# ముత్యాల పల్లె

గోవిందరాజు సీతాదేవి

అనూరాధ పబ్లిషర్స్
6-3-903/4/B సోమాజిగూడ,
హైదరాబాద్-500482

ముత్యాల పల్లకి

గోవిందరాజు సీతాదేవి

ప్రతులకు :
అనూరాధ పబ్లిషర్స్
6-3-903/4 B, సోమాజిగూడ
హైదరాబాద్-500 482

నవయుగ బుక్ హౌసు
సుల్తాన్ బజార్
హైదరాబాద్-500 001

ముద్రణ :
శ్రీ శేషయ్య ఎంటర్‌ప్రైజెస్
విజయవాడ-520 003

వెల : **25-00**

# గోవిందరాజు సీతాదేవి ఇతర నవలలు

| | |
|---|---|
| జీవన కలశం | ... ఆంధ్రజ్యోతి సీరియల్ |
| అనురాగ ధార | ... |
| దేవుడు బ్రతికాడు | ... |
| వెలుగునీడ | ... పొలికేక వారపత్రిక సీరియల్ |
| అపర్ణ | ... జయశ్రీ మాసపత్రిక సీరియల్ |
| మజిలీ | ... డైరెక్ట్ నవల |
| పూలనావ | ... ఆంధ్రజ్యోతి వారపత్రిక సీరియల్ |
| ఇది జీవితం | ... డైరెక్ట్ నవల |
| జీవితం చిన్నది | ... తరుణ సీరియల్ |
| తుంగభద్ర | ... డైరెక్ట్ నవల |
| కొత్తవెలుగు | ... " |
| ప్రేమ పంజరం | ... " |
| ఆశల వల | ... " |
| చుక్కలు నవ్వాయి | ... " |

నవలికలు :

ప్రేమ పరీక్ష
తాతయ్యా గర్ల్‌ఫ్రెండ్
సన్మానం
ఓ సుమిత్ర కథ
సిరి

కథల సంపుటాలు :

ఒంటిస్తంభం మేడలో ఒకటిన్నర గది
రాజీ
కొత్త బంధం
పాఠకులారా బహుపరాక్

# ముత్యాల పల్లకి

పెళ్ళి పందిరిలో సన్నాయి మోగుతోంది.

"సీతమ్మ పెళ్ళికూతురాయెనే మన రామయ్య పెళ్ళికొడుకాయెనే" పాట వాయిస్తున్నారు సన్నాయి వాళ్ళతోబాటు యూనీఫారంలో వున్న బ్యాండువాళ్ళు. పచ్చి కొబ్బరాకుల పందిరి క్రింద మామిడాకుల తోరణాల మధ్య రంగురంగుల పువ్వుల తోరణాలతో తయారైన కల్యాణమంటపంలో కూర్చున్న పెళ్ళికొడుకునీ, పెళ్ళికూతురినీ చూస్తూ పదినిమిషాలు నిల్చున్నా దశరధరామయ్యగారికి తృప్తి కలగలేదు. పెళ్ళితంతు జరుగుతూనే వుంది. పెళ్ళిపెద్దలు అటూ ఇటూ తిరుగుతూ హడావుడి చేస్తున్నారు.

ప్రతి మనిషికీ జీవితంలో ఈ వివాహం అంపమైన తియ్యటి అనుభవం. యవ్వనం దాటిపోయినా యీ అనుభవం గుర్తు తెచ్చుకుంటూ అందమైనకలలు కనవచ్చు. అయితే యీ అనుభవం అందరికీ లభ్యమవుతుందా! కాదు. కొందరికే ఈ వరాన్ని ప్రసాదిస్తాడు భగవంతుడు. ఇది నిజం. లేకుంటే ఈ

అదృష్టం నాకు లేకున్నా నా పెంపుడు బిడ్డ నారాయణ కన్నా యెందుకు లభ్యంహాలేదు! నారాయణ పెళ్ళి యెంతోవైభవంగా చెయ్యాలనీ, ముత్యాల పల్లకిలో పూరేగించాలనీ అనుకుంటే భగవంతుడు యెందుకూ కాకుండా చేశాడు.

దశరథరామయ్యగారు యెండవేడికి చెమటలు కారుతున్నా పల్లెనుంచి పట్నంవచ్చి కొడుకు నారాయణరావు ఇంటికివెడుతూ మధ్యలో ఈ పెళ్ళిమేళం విని ఆగిపోయి చిన్నపిల్లవాడిలా పందిరి దగ్గరకొచ్చి కళ్యాణ మంటపంలోకి తొంగిచూశారు. అప్పుడే కట్టిన మంగళసూత్రం చేత్తో తడిమి చూసుకుంటోంది పెళ్ళికూతురు. పెద్దలందరూ అక్షింతల వర్షం కురిపిస్తున్నారు. అక్కడున్న అందరితోబాటు దశరథరామయ్యగారి చేతిలోనూ పెట్టిన అక్షింతలు ఆ నూతన వధూవరుల మీదికి విసిరి "నూరేళ్ళు అన్యోన్యంగా సిరి సంపదలతో వర్ధిల్లండి" అని మన స్ఫూర్తిగా దీవించి తృప్తిగా నిట్టూర్చి యీడూ జోడూ బాగా కుదిరింది అనుకున్నారు మనస్సులో. అంతా బాగానేవుంది కానీ, పెళ్ళి పూరేగింపుకి మరి పల్లకీ యెక్కడ అని చుట్టూ చూశారు. పల్లకీ కన్పించలేదు. కాని చేమంతి మల్లెపూలదండ లలో అలంకరించిన చిన్నకారు వాకిట్లో ఆగివుంది. అది చూసి పెదవి విరచి 'అబ్బే పెళ్ళి పూరేగింపుకి ఈ కార్లు యేంబాగుం టాయి. ముత్యాలపల్లకీ అయితే అందంగా హాయిగా అద్భుతంగా ఉంటుంది' అనుకుంటూ కొడుకు ఇంటివైపుకి నడక సాగిం చారు దశరథరామయ్యగారు. లాయరు నారాయణరావు వరం

డాలో కూర్చుని పార్టీలతో మాట్లాడుతూ ప్రహరీగేటు తీసుకుని లోపలకి వచ్చే పినతండ్రిని చూస్తూనే లేచి యెదురువెళ్ళి

"చిన్నాన్నా ! ఉత్తరమన్నా రాయకుండా వచ్చారేం. బస్ దగ్గరకి యెవరినన్నా పంపుదును కదా!" అంటూ ఆయన చేతిలోని సంచీ అవీ అందుకోబోయాడు.

నవనవలాడే వంకాయలు పుత్తరీయం కొంగున కట్టిన మూట భుజం మీదనుంచి వ్రేలాడుతోంది. నెత్తిన పెద్ద గుమ్మడికాయ, చంకలో లేత అరిటాకుల కట్టా, చేతిలో పెద్ద బూడిద గుమ్మడికాయ పడి పుజానివున్న మూటలోనించి పెద్ద పెద్ద జామకాయలూ బాదంకాయలూ తొంగిచూస్తున్నాయి.

"అబ్బ! అంత పెద్ద గుమ్మడికాయ బస్టాండ్ నుంచి యెలా మోసుకువచ్చావు చిన్నాన్నా! యేదీ ఆ గుమ్మడికాయ యిలా ఇవ్వు!" అంటూ తీసుకోబోతుంటే

"ఆహాహా! అది చాల బరువురా నువ్వు మోయలేవురా ! యిదిగో ఈ పుత్తరీయం మూటా ఈ సంచీ తీసుకో" అంటూ మువ్వ వంకాయల మూట అందించారు కొడుకుని ఆప్యాయంగా చూస్తూ. గ్లాస్కో పంచలూ లాల్చీలూ జరీ కండువాలూ ధరించి వున్న పార్టీలు లోపలికివచ్చిన ముసలాయన్ని కళ్ళప్పగించి చూస్తూ వుండిపోయారు.

నీరుకావిపంచె, గుండీలులేని పొట్టిచేతుల పాతకాలం ఫ్యాషను చొక్కా, చెమటలు కారిపోతూ దుబ్బులా పెరిగిన గడ్డం, వార్ధక్యం తెల్పుతూ నెరిసిన తెల్లని కనుబొమలూ ఆయన ఆకారం చూడగానే మొదట కాస్త గౌరవం అంతలోనే

చాదస్తం మనిషిలా వున్నాడనే తేలికభావం ఒకేసారి కల్గుతాయి. లేకుంటే 'బస్' దిగినవాడు యే రిక్షా అయినా చేయించుకురాక యింత బరువు యాభై సంవత్సరాలు పైబడ్డ ఈయన మోసుకురావటం యేమిటి పీనాసితనం కాకుంటే అనుకున్నారు పార్టీలు. నారాయణరావు పినతండ్రి చేతిలోని బరువు కొంత అందుకుని లోపలికి తీసుకువెళ్ళాడు.

ముసలాయన వరండా దాటి లోపలి హాలులోకి అడుగు పెట్టగానే మిగతా బరువు అందుకుంది కోడలు అన్నపూర్ణ. యెక్కడో ఆడుకుంటున్న మనవడూ మనవరాలూ "తాతయ్యా" "తాతయ్యా" అంటూ పరుగున వచ్చిపడ్డారు.

"తాతయ్యా! నాకేం తెచ్చావ్!"అంటూ మురళి మూటలు వెదకటం మొదలుపెట్టాడు " "తాతయ్యా! మరి నాకో" యెనిమిదేళ్ళ అనూరాధ అతన్ని తోసేస్తూ "బాదంకాయలు, జామకాయలూ అన్నీనాకే నాకే"అంటూ గొడవ మొదలెట్టింది. పన్నెండేళ్ళ మురళికి వళ్లు మండిపోయింది. "అన్నీ నీకేం కాదు. నాకే నేనే తాతయ్యని తెమ్మని చెప్పాను అందుకే తెచ్చాడు. ఇవన్నీనాకే, నీకేంలేవు" మురళి చెల్లెలిని దూరంగా తోసేశాడు.

"కాదు. నాకేనాకే"అందోన్న అనూరాధని చూచి చెంప పగిలేలా కొట్టాడు. దశరథరామయ్యగారు నిర్విణ్ణుడైపోయాడు. ఆయనకి కోపంతో వళ్లు మండిపోయింది. ఎఱ్ఱగా కందిన అనూరాధ బుగ్గని చూడగానే తాతగారి ఆగ్రహం అవధులు దాటింది.

"రేయ్! మురళీ" ఆయనకేక ఆ డాబాయిల్లు ప్రతి ధ్వనించింది. వరండాలోని నారాయణరావూ వంటయింట్లో ఉన్న పూర్ణా ఒకేసారి అక్కడికి వచ్చారు.

"మురళీ, చెల్లాయినిలా కొట్టావా! యెక్కడ నేర్చు కున్నావురా! అది యెవరో తెలుసా! ఈ ఇంటికి ఆడపడుచు, సాక్షాత్తు లక్ష్మిరా"

ముసలాయన గొంతులోని ఆవేశం పొంగుతోంది.

"లక్ష్మికాదు జ్యేష్ఠ" మురళి కచ్చిగా అన్నాడో లేదో అంతే అతడి చెంప ఛెళ్ మంది. దశరథరామయ్యగారు ఆవేశం అదుపులో పెట్టుకోలేకపోయారు. నారాయణరావూ అన్నపూర్ణా శిలా విగ్రహాల్లా చూస్తూ నిల్చున్నారు.

మురళి కళ్ళనిప్పు కుళ్ళుతిరిగాయి. అక్కడ కుప్పగా పోసివున్న కూరలని చింపిరి పందిరిగా తన్నేసి యేడుస్తూ అక్కడనుంచి వెళ్ళిపోతూన్నప్పుడు దశరథరామయ్యగారి లోని ఆవేశం మెల్లగా జారిపోయింది!! "ఒరేయ్! ఎక్కడికీ వెళ్ళకు. ఇందు యివన్నీ నీ కోసమేగా తెచ్చింది! ఇవిగో బాదం పప్పుల బెల్లంవుండలు తీసుకో" ఆయనగొంతు మామూలు స్థాయికి చేరుకుంది.

"తెచ్చావులే చోడిబాదం పప్పులు! వుంటిగా నీ ముద్దుల మనవరాలు అన్నీ దానికే పెట్టు. నాకేం అక్కరలేదు. చచ్చినా ఒక్కటి కూడా ముట్టుకోను పిసరంత కూడా తినసంటే తినను. తినసుగాకతినను"

పుదికివచ్చే కన్నీళ్ళను తుడుచుకుంటూ విసురుగా

బైటికి వెళ్ళిపోయాడు మురళి. నారాయణరావుకి కొడుకు పెంకె తనానికి కోపంవచ్చినా మింగేసి పార్టీలని పంపేసి త్వరత్వరగా భోజనంచేసి నల్లకోటు తీసుకుని కోర్టుకి వెళ్ళిపోయాడు.

దశరథరామయ్యగారు తాపీగా స్నానం కానిచ్చి భోజనానికి కూర్చున్నారు. కోడలు అన్నపూర్ణ వినయ శ్రద్ధతో విసురుతూ స్వంతవూరి విషయాలు కనుక్కుంటూ వుంది. అనూరాధ తాతగారి ప్రక్కనే బుల్లిపీట వేసుకుని వూరినించి తెచ్చిన లేత అరిటాకులో అన్నం తింటోంది.

అన్నపూర్ణా! మురళి ఇంత పెంకివాడైనాడేం అమ్మా! మొక్కై వంగనిది మ్రానై వంగుతుందా అని వీడివిషయంలో యిప్పటినించే జాగ్రత్త తీసుకోవాలి.

పప్పు అన్నంలో ఆవకాయ వూరగాయ నంచుకుంటూ కోడలితో కబుర్లు మొదలెట్టారు దశరథరామయ్యగారు.

"మురళి చాలా దుడుకుగా తయారవుతున్నాడు మామగారు! వాడు పట్టిన కుందేలుకి మూడే కాళ్ళు అంటాడు. నామాటంటే అసలు భయమేలేదు. మీ అబ్బాయి కేమో ఎప్పుడూ తన కోర్టులేమో, పార్టీలేమో, కేసులేమో!'

నేతిగిన్నె యెత్తి మామగారికి వడ్డిస్తూ అంది అన్నపూర్ణ.

"వూ! చదువులో యెలావున్నాడు, మార్కులు బాగా వస్తున్నాయా"

కంచు గ్లాసులోని మంచినీళ్ళు యెత్తి గడగడా తాగుతూంటే అవుతున్న శబ్దాన్ని తాతగారినీ కళ్ళప్పగించి చూస్తూ అన్నం తినటం మర్చిపోయింది అనూరాధ.

"మూర్ఖులు ఫర్వాలేదువెండి. యెప్పుడూ క్లాసులో ఫస్టునే వస్తాడు. లేకుంటే సరిగ్గా నిద్రకూడా పోడు"

దశరథరామయ్యగారు ముసిముసి నవ్వులు నవ్వుతూ మీసం సరిచేసుకున్నారు. తిరిగి అన్నపూర్ణ కబుర్లు చెప్తోంది.

"మొన్నామధ్య పిన్నత్తగారి కూతురు కామేశ్వరిలేదూ ఆవిడ కాశీ వెడుతూ ఇక్కడిదిగి రెండురోజులున్నారు. ఆవిడ మురళిని చూసి ఒకటే అనటం అచ్చంగా చిన్నప్పుడు దశరథరామయ్య ఇలాగే ఉండేవాడనీ అల్లరీ యిలాగే ఉండేదనీ చివరికి ఆ నడకకూడా అన్నయ్యలానే నడుస్తాడు మురళి అంటూ మెన్నోసార్లు అన్నారు."

అంటూ తనలోతానే నవ్వుకుంటూ చెప్తోంది అన్నపూర్ణ. దశరథరామయ్యగారికళ్ళు క్షణంలో సగం 'గర్వం' తో మెరిసిపోయాడు. "బ్రేవ్" మంటూ తేపుతూలేచి చెయ్యి కడుక్కుని వరండాలో పట్టెమంచం మీద కూర్చుని విశ్రాంతి తీసుకుంటున్నారు.

కోపంతో ఇంట్లోంచి బైటికివెళ్ళిపోయిన మురళి రెండు గంటల తర్వాతగానీ రాలేదు. యెండలో తిరగటంవల్ల కాబోలు ముఖం నల్లగా పెంకులా తయారయింది. ఇంట్లోకి వచ్చీ రాగానే పెద చెంబుడు నీళ్ళు తాగేసి తన చదువుల గదిలోకి

వెళ్ళి మంచంమీద బిగించి పడుకున్నాడు. తల్లి వచ్చి యెంత బ్రతిమిలాడినా మురళీ ముసుగు తియ్యలేదు.

వరండాలో పట్టెమంచం మీద సగం సగం నిద్రలోకి జారుతున్న తాతగారు మనవడి మంకు పట్టుకి ఆశ్చర్యపోతూ "వేలెడులేడు వెధవకి యెంతపట్టుదలా! బక్కపల్చగా యెర్ర తేలులా వుండేవాడు రోజురోజుకి యెదిగిపోతున్నాడు. వీడి విషయంలో కాస్త జాగ్రత్తగా వుండక తప్పదులావుంది. వీడె వరూ....నా వారసుడుకాడూ! తాతని పోలీ పుంతరానా !!"

నవ్వుకుంటూనే పూర్తిగా నిద్రలోకి జారిపోయా రాయన.

# 2

దశరథరామయ్యగారు పట్నంలో నాలుగు రోజులుండి తిరిగి పల్లెకి ప్రయాణం అయారు. మురళికి కోపం ఆ రోజు రాత్రికే పోయింది. అరే మురళీ నా వెంట పల్లెకి వస్తావురా! ఎలాగూ శలవులేగామన యిల్లు పొలం చూద్దువుగాని అంటూ ప్రయాణం చేశారు.

మురళీ యెగిరి గంతేసి రెండు జతల నిక్కర్లూ షర్టులూ ఓ సంచీలో కుక్కి 'పద' అంటూ తాతగారి చెయ్యి పట్టు కున్నాడు.

అన్నపూర్ణకి కొడుకుని మామగారితో పల్లెకి పంపటం కాస్త కూడా యిష్టంలేదు. అప్పుడే కోర్టునుంచి ఇంటికొచ్చి బట్టలు మార్చుకుని కాఫీ తాగుతూన్న భర్తకి తన ఉద్దేశ్యం చెప్పేసింది అన్నపూర్ణ.

"శలవులే కదూ! వెడితే ఏం?" అన్నాడు నారాయణ రావు.

అన్నపూర్ణ జవాబివ్వలేదు.

"పూర్ణా! మురళి పెద్దవాడు అవుతున్నాడుగా! అసలు మనని వదలి ఉండగలడో లేడో ఓసారి చూస్తే పోయిందేం ఉంది. అయినా దగ్గరేగా. పిల్లలని అప్పుడప్పుడూ ఇలా ఎక్కడికన్నా పంపటం మంచి అలవాటు. అందులోనూ మన మురళి లాంటివాడికి మరీ అవసరం. ఏం ఏమంటావు?"

ఖాళీ కప్పు అందుకుంటూ కూడా జవాబివ్వలేదు అన్నపూర్ణ. నారాయణరావు భార్య వెళ్ళిపోతూంటే పమిటికొంగు పట్టుకు దగ్గరికి లాక్కుని ప్రేమగా చూస్తూ.

"ఇంతకీ అసలు నీ ఉద్దేశ్యం అర్థంకాలేదు" అన్నాడు.

"కారణం చెప్పాలంటే కష్టమే. కానీ ఒక్కటి నే చెప్పేది. వినండి. మురళిని పల్లెకి పంపటం అంత మంచిది

కాదని నా ఉద్దేశ్యం. ఇంక మీ ఇష్టం" అంటూ భర్త చేతిలోని పయిటకొంగు వదిలించుకొని వెళ్ళిపోతూంటే—

నా కిష్టంలేదు అని నాకు చెప్పకుంటే ఓరీ వెధవా వెళ్ళ వద్దు అని నీ కొడుక్కి చెప్పి ప్రయాణం ఆపేయరాదూ. చిన్నా న్నతో వీల్లేదని నే నెలా చెప్పేది. అయినా స్కూలు ఎలాగూ లేదు. మరి వాడు పల్లెకి వెళ్ళినందువల్ల నష్టంఏమిటో ఈవిడకి ఎందు కిష్టంలేదో! అబ్బ చస్తే అర్థంకారీ ఆడవాళ్ళు. పన్నెం డేళ్ళుగా కాపురం చేస్తున్నా ఎప్పటికీ కొత్తదానిలానే అన్పిస్తూ ఉంటుంది అన్నపూర్ణ అనుకుంటూ తలగోక్కున్నాడు నారాయణ రావు.

"నారాయణా" మురళీ నేనూ వెళ్ళివస్తాంరా! ఇప్పటికే ఆలశ్యం అయింది. బస్‌లు దొరక్కపోతే చీకటైపోతుంది. నీ కోసమే చూశానింతసేపూ" అంటూ మనవడి చెయ్యి పట్టుకుని చెప్పులు తొడుక్కుంటూ చెప్పే పెదతండ్రితో—

"ఆ వూరిసంతా అల్లరితో ఓ కొలిక్కిచేస్తాడు చిన్నాన్నా వీడు."

"ఆహా! అస్సలు అల్లరి చెయ్యను నాన్నారూ!"

తాతగారి చెయ్యి మరీ గట్టిగా పట్టుకుని తండ్రికి అతి వినయంగా చెప్పాడు మురళి.

"ఏం ఫర్వాలేదులే. మనవూరేగా! ఆ. అన్నపూర్ణా వెళ్ళి వస్తాం అమ్మా మురళి అల్లరిచెయ్యడు. వీడెప్పుడూ మిమ్మల్ని

వదలలేదు కదా! బెంగపడకుంటే మరి నాలుగురోజులుంటాడు. లేకుంటే వెంటనే పంపేస్తాను. ఆ వూరినుంచి ఎవరో ఒకరు కోర్టుచుట్టూ ప్రదక్షణాలు చేసే వాళ్ళున్నారుగా. అదీ గాక నారాయణా! ఏకెప్పుడూ కోర్టు, కోడలికి ఇల్లు బందిఖానా! మరి నన్ను వీడు తప్ప మరెవరు చూస్తారురా. వీడు పెద్ద అయింతర్వాత ప్రతి శలవులకి నా దగ్గరికి రావాల్సిందే. అంయి కిది నాంది....'

ఇంకా యేదో మాట్లాడే తాతగారి చెయ్యి పట్టి లాగుతూ 'అబ్బ త్వరగా వెళ్ళిపోదాం తాతయ్యా' అన్నట్లు చూశాడు మురళీధర్.

దశరథరామయ్యగారు మనవడి ఉద్దేశ్యం గ్రహించి చప్పున మాటలు కట్టిపెట్టి "అరే మురళీ అమ్మకీ నాన్నకీ వెళ్ళి వసాం అని చెప్పు!"

అంటూ బయలుదేరారు. నారాయణరావు వీసలంద్రిని బస్ ఎక్కించేందుకు 'స్టాండ్'వరకూ బయలుదేరాడు. అన్నపూర్ణ మరీ మరీ కొడుక్కి 'జాగ్రత్త' అని చెప్పింది.

"ఓ! అలాగేనమ్మా!"అంటూ పొంగిపోతూ వాకిలి దాటేశాడు మురళి. దశరథరామయ్యగారు రిక్షా జట్కా, యెక్కరు.

"మనిషి మనిషిమీద సవారా! ఏం నాగరికతరా యిదీ?" అని నిలదీస్తారు.

"అందరితోబాటు కమా మనం కూడా చిన్నాన్నా" అని నారాయణరావు నచ్చజెప్పజూసినా "నా అంతరాత్మ వప్పదురా"

అనే పినతండ్రిని మరేం అనలేక ఆయనతో బాటు తనూ నడిచి బయలుదేరాడు లాయరు నారాయణరావు. పినతండ్రినీ, కొడుకునీ బస్ ఎక్కించి మురళి జాగ్రత్త చిన్నాన్నా అని మరీ మరీ చెప్పి బస్ వెళ్ళిపోగానే తిరిగి మైలున్నర దూరంలో ఉన్న ఇంటికి నడిచిరాలేక రిక్షా చేయించుకుని వచ్చేశాడు. లాయరుగారి ప్రాక్టీసు టాక్సీ ఖర్చులు చెల్లించేంతగా లేదు.

ఇంటికిరాగానే అన్నపూర్ణ ముభావంగా భర్తకి మంచినీళ్ళు అందించింది. ఆవిడని మరి పల్కరించకుండా ఖాళీగ్లాసు అందించి వరండాలో బెంచీలమీద కూర్చుని లాయరుగారి కోసం ఎదురు చూసి కునికిపాట్లు పడే పార్టీల దగ్గరికిపస్తూ, అనూరాధ మంచం చాటున కూర్చుని బొమ్మల పెళ్ళిచేస్తూన్న ఓక్షణంచూసి వరండా లోకి వచ్చేశాడు.

మురళీ దశరధరామయ్యగారూ బస్ దిగేసరికే సందె చీకట్లు నలుమూలలా అలుముకున్నాయి. ఇంక తాతగారి వెంట పట్టి రోడ్డుమీద పడుతూ లేస్తూ నడుస్తూన్నాడు మురళి. కాస్త దూరం నడిచేసరికీ ఓ పెద్ద కాలువ అడ్డు వచ్చింది. 'అది దాటాలి బల్లకట్టు లేదే' అని అనుకుంటూ ఏదేదో మాట్లాడు కుంటున్నారు కొందరు రైతులు. పంచెలు పైకిదోపి నీళ్ళలోకి

దిగి కాలువ అవతల గట్టుకచేరే కొందరిని చూస్తూంటే మురళికి చాలా ఆశ్చర్యంగా ఉంది.

దశరథరామయ్యగారు మనవడిని భుజాల మీదకి ఎత్తుకొని బట్టల సంచీ మురళిని పట్టుకోమని చెప్పి నీళ్ళల్లోకి దిగుతూంటే మురళికి గుండె గబగబా కొట్టుకోవటం మొదలెట్టింది. ఒళ్ళంతా చెమట పట్టేసింది. ఆ చల్లని ఆరుబయలు ప్రదేశంలో కూడా. కొందరు గొడ్ల కాపరులు పశువులని కాలువలోకి తోలారు. అవి యీదుకుంటూ అవతల గట్టుకి చేరుకుంటూంటే వాళ్ళూ అలాగే ఈదుకుంటూ వెడుతూన్నది కళ్ళు వెడల్పు చేసుకుని మరీ చూస్తూన్నాడు. అదంతా భలే బాగున్నట్లుంది.

దశరథరామయ్యగారు కాలువ మధ్యలోకి వచ్చారు. ఎక్కువ లోతులేదురే అంటున్నారు కొందరు. లోతులేదు కానీ ప్రవాహం మనిషిని తోసేస్తోంది అంటున్నారు మరికొందరు. తాతగారి భుజాలమీద కూర్చున్న మురళికి ఆ కాలువలోని నీళ్ళు చేతితో అందుకోవాలని అన్పిస్తోంది. ఒకప్రక్కకి వంగి చేతితో అందుకోబోయాడు మనవడు కాలువలో పడిపోతున్నాడని భయపడిపోతూ గాభరాగా.

"ఒరే....ఒరే మురళీ...." అంటూ గావుకేకలు పెడుతూ తూలిపోయారు. అంతలోనే దగ్గరున్న ఇద్దరు రైతులు ఆయన్ని గభాలున పట్టుకోకబోతే తాతా మనవడూ ఈ సరికి స్వర్గానికి బెత్తెడు దూరంలో ఉండేవాళ్ళు. ఎలాగో వడ్డుకి చేరారు. కానీ

మురళికి అసంతృప్తి మొదలైంది. తాతగారి భుజాలమీద కూర్చుని అలా ఆ కాలువ నీళ్ళలో ఎంతోదూరం ఇంకా ఇంకా పోతూనే ఉండాలన్పిస్తోంది. అయితే అవకాశం లేదే. తాతగారికి పిల్లలని అలా భుజాలని ఎక్కించుకోవటం అలవాటు లేక కాబోలు ఆయాసం ముంచుకొచ్చింది.

కాసిని మంచినీళ్ళు తనుతాగి మనవడికీ తాగించి అక్కడే ఉన్న చిన్న 'బడ్డీ' కొట్టులో రెండు వేరుశనగ చెక్క ముక్కలు కొనిచ్చి తిరిగి ప్రయాణం ప్రారంభించారు. కొంతదూరం నడవ గానే మురళికి కాళ్ళనొప్పులు పెట్టి అడుగు ముందుకు పడటం కష్టమైపోతూంది. అయినా పళ్ళబిగించి తాతయ్య పరుగులాంటి నడకతో అనుసరిస్తూన్నాడు.

పంచాయతీవారు వెలిగించిన గుడ్డి దీపాల వెల్తురులో ఎగుడు దిగుడు మట్టిరోడ్డుమీద తాతయ్య గబగబా నడిచేయటం మురళి ప్రాణంమీదకి తెస్తోంది. ఎలాగైతేనేం తమ పల్లె రానే వచ్చింది. సంతబజారూ బడి వీధీ గుడివీధీ దాటి మరో మలుపు తిరిగితే పెద్ద పెద్ద రావిచెట్లు రెండు మరి దానికి కాస్తదూరంలో ఓ జువ్విచెట్టూ, దానికి మరి కాస్త దూరంలో ఓ చింతచెట్టూ, అక్కడనుంచి కుడివైపుకి తిరగ్గానే ఓ పడిపోయిన పెంకుటిల్లు, ఓప్రక్క క్రిందికి పూర్తిగా వంగిపోయిన వసారాలో తాడుకితగి లించిన హరికెన్ లాంతరు వ్రేలాడుతోంది. మిగతా అంతా చీకటిమయం. తాతయ్య చెయ్యి గట్టిగా పట్టుకుని పడిపోయిన

ప్రహరీ దాటి లోపలికి రాగానే ఆ వసారాలో ఓ కంబరుతాడు మంచం విక్రమార్కుడి సింహాసనంలా వాల్చి ఉంది.

దశరథరామయ్యగారు చేతిలోని సంచీ క్రిందపెట్టి మంచం మీద కూలబడ్డారు. చాలా అలసిపోయినట్లుగా ఆ మసక వెలుతురులో గ్రహించాడు మురళి. ఆ ప్రదేశాన్నంతా కొత్తగా చూస్తూ మళ్ళీ తాతయ్య ముఖంలోకి చూస్తున్నాడు మురళి. ఈ చీకటి అంటే మురళికి చాలా భయం. అసలిక్కడికి రావాలనే హుషారులో పల్లె అంటే ఎలావుంటుందీ అని కాస్త కూడా ఆలోచించలేదు.

"అయ్యో అలా నిల్చునే ఉన్నావే నాన్నా! ఇలా రా, కూర్చో" అంటూ మనవడిని చెయ్యి పట్టుకుని దగ్గర కూర్చోబెట్టుకుని "యశోదా! ఓ యశోదా!" అంటూ కేకపెట్టారు.

"ఆ! వస్తున్నా నల్లగేదె పాలు తీస్తున్నా" అంటూ విన్పించింది ఓ కంఠం.

ఆ చీకట్లోకి కళ్ళు పెగుల్చుకుని చూశాడు అలా శబ్దం వచ్చిన వైపుకి మురళి. ఆ చీకటికంటే కూడా నల్లగా వున్న గేదె దాని దగ్గరగా కట్టివున్న చిన్నదూడ తాడు లాక్కుంటోంది. అది చూస్తూ తల్లి ఆప్యాయంగా బిడ్డ వళ్ళంతా మూతితో నవిరిస్తోంది. కాస్సేపటికి ఆ గేదె వెనకనించి కూజాబిందె అంత చెంబుతో పాలుపిండి పమిటకొంగు దానిమీద కప్పుకుని నల్లగా ఉన్న నలభైయేళ్ళ స్త్రీ వెలుతురులోకి వచ్చింది. కణమంచు

యెఱ్ఱరవికె ముదురు నీలం నడిపాత చీరె, నున్నగా దువ్వి వేసుకున్న పెద్ద బర్మాముడి, నవ్వినప్పుడల్లా తెల్లగా మెరిసి పోతూ ముత్యాల్లా కన్పించే పలువరుస ఆ మసక వెలుతురులో కూడా తళతళమని మెరుస్తూన్న ఒంటిరాయి ముక్కుపుడక, చెవులకి అదోలాంటి పెద్దపెద్దులు దృఢంగా నిటారుగా నడిచి వచ్చే ఆమెని పరీక్షగా చూస్తూ ఈవిడేనా తాతయ్య పిల్చిన యశోద. అయితే ఈ యశోద ఎవరూ అనుకున్నాడు. యశోద పాలచెంబు అలా పట్టుకునే దశరథరామయ్యగారినీ ఆయన దగ్గర కూర్చున్న మురళినీ క్షణం పరీక్షగా చూసింది.

"ఎవరో తెలిసిందా !" దశరథరామయ్య కళ్ళెగరేసి నవ్వారు. అలా నవ్వే తాతయ్య కొత్తగా కనిపిస్తూన్నాడు మురళికి. మురళికి తెలిసిందల్లా పల్లెనుంచి అప్పుడప్పుడూ కూరలూ పళ్ళూ తీసుకుని పట్నంవచ్చి యెంతో హుందాగా మాట్లాడేతాతయ్య. తననీ చెల్లెలినీ వల్లమాలిన అభిమానంతో, ప్రేమతో దగ్గరకు పిల్చి ఎన్నెన్నో కబుర్లూ, కథలూ చెప్పే తాతయ్య. అంతవరకే తెలుసు. కానీ తమ దగ్గరనించి ఈ పల్లెకి వచ్చి ఇక్కడ ఎలా వుంటాడో, ఎవరెవరు వున్నారో ఇవేం తెలియవు మురళికి. అసలీ వూరుని గురించి ఆలోచించనే లేదు. పల్లెలో దానిమ్మా, జామా, కొబ్బరి చెట్లున్నాయని తెలుసు. అవికాక బాదంచెట్టు వుందనీ, దాని కాయలు చాలా పెద్దవనీ ఆ చెట్టుకొమ్మ ఒకటి తుఫాను వచ్చినపుడు విరిగి పోయిందని అందుకే కాపు కాస్త తగ్గిందని మాత్రమే తెలుసు.

తీరా ఇక్కడికి వచ్చిన తరువాత తనకి తెల్సినవేకాక మరెన్నో తెల్సుకోపల్సినవి ఉన్నాయని పన్నెండేళ్ళ మురళి బుల్లి బుర్రకి తెల్సింది. అందుకే కళ్ళు ఆర్పకుండా యశోదని తదేకంగా చూస్తూన్నాడు.

యశోదా మురళిని కన్నార్పకుండా చూసింది. ఆమె ముఖంలో సంతోషం వెల్లువిరిసింది. "అరె! మురళి బాబొచ్చాడే! ఇందాకటి నుంచీ ఈ సంగతి చెప్పరేం. రా బాబూ.... రా.... అపునూ ఎందుకు చెప్పలేదూ" చిరుకోపంతో అడిగింది.

"పాలు సగం పిండి వదలి పరుగున రావటానికా!" అన్నాడు నవ్వుతూ. "అబ్బో గొప్ప. మురళి బాబూ.... బస్ దిగి రెండుమైళ్ళు నడిచేవచ్చావా? మీ తాతయ్య ఎంత కఠినులు. కాళ్ళు నొప్పెట్టాయా బాబూ.... ఉండు క్షణంలో తెస్తా" అంటూనే గబగబా లోపలికి వెళ్ళింది.

దశరథరామయ్యగారు యశోద సంతోషాన్ని ఓరకంటితో చూస్తూ తృప్తిగా నవ్వుకున్నారు. "తాతయ్యా నేను మురళినని ఈవిడకెలా తెల్సా?" అడిగాడు అర్థం కానట్లు.

"నాన్నా! నువ్వు మురళివని యశోదకి తెల్సురా. నీవేం చదువుతున్నావో 'నీకెన్ని ఎక్కాలు వచ్చో' నీకు ఆటల్లో ఎన్ని ప్రైజులు వచ్చాయో, నీ కెన్ని కథలొచ్చో అవన్ని తెలుసు;

ఉండూ నీవే చూద్దువుగాని. నీవేకాదు— అనూ కూడా యెలా ఉంటుందో- ఎలా మాట్లాడుతుందో— ఎలా నడుస్తుందో అంతా తెలుసు."

"అలాగా! మరి ఏడ పట్నం ఎప్పుడూ రాలేదుగా!"

"ఆ! రాకుంటే ఏం నేనొస్తే ఆమె వచ్చినట్లే."

"నిజంగా!"

అక్షరాలా!"

"అయితే తాతయ్యా! ఈ యశోద ఎవరూ?" మురళి చాలా సీరియస్‌గా చూస్తూ అడిగేసరికి దశరథరామయ్యగారు ఉలిక్కిపడ్డారు మనవడి ప్రశ్నకి. ఆయన జవాబులు టక్కున ఆగిపోయినాయి.

"ఏం తాతయ్యా! ఏమవుతుందీ! నాకూ! పోనీ నీకు తెలియదా! అయితే నీకేం అవుతుందో చెప్పు. అప్పుడు ఆవిడని ఎలా పిలవాలో నే చూసుకుంటా!"

"త్వరగా చెప్పు తాతయ్యా ఆవిడొస్తోంది అయ్యో వచ్చేస్తోంది" ఆ....విడా....ఆవి....డా ఆవిడ....అదే....యశోద.... "ఆ....చెప్పుమరి...." మురళి వదిలేలా లేదు.

"ఆ సంగతి....ఆవిడనే అడిగెయ్!" అంటూ మంచంమీద కళ్ళు గట్టిగా మూసేసుకున్నారు దశరథరామయ్యగారు. యశోద చల్లటి మజ్జిగ పెద్ద గ్లాసుల్లో నిండా తెచ్చియిచ్చింది మురళికీ, తాతగారికీ,

మురళికి కడుపులో ఆకలీ కంటిమీదకి నిద్రా తోసుకు వస్తోంది. అలాగే గ్లాసు అందుకుని గడగడా తాగేసి గ్లాసు అందించాడు. తాతగారు టక్కునలేచి మజ్జిగ తాగేసి మళ్ళీ పడు కుని ఉత్తరీయం కొంగు ముఖంమీద కప్పేసుకున్నారు.

యశోద ఆ గ్లాసులు పట్టుకుని మురళినిచూస్తూ నిల్చుంది. మురళి ఇబ్బందిగా కదిలి నేల చూపులు చూస్తూ కూర్చున్నాడు. "మురళిబాబూ! అక్కడ ఎన్నింటికి బయలుదేరారూ?"

"నాలుగింటికి!"

"అబ్బా! చాలా సేపే అయింది. ఆకలి అవుతోంది కదూ! ఇదిగో మిమ్మల్నే! అప్పుడే నిద్రా! అయ్యో నా రాతా! గుర్రు కూడా మొదలెట్టేశారా! మీరెప్పుడు పట్నంనించి వచ్చినా అన్నం అక్కరలేకపోవటం అలవాటైనా, పసివాడు మురళి ఆకలికి ఆగ లేకుండా ఉన్నాడు. క్షణంలో పొయ్యి రాజబెడతాను. కాస్త అన్నం అయినా ఉడకెయ్యండి. ఏ ఊరగాయముక్కో వేసుకో వచ్చు."

దశరధరామయ్యగారు బలవంతంగా కళ్ళుతెరచి "లేవలేనే యశోదా! నువ్వే ఏదోఒకటిపెట్టు వాడికి. పోరానాన్నా యశోద దగ్గరికి" అని తిరిగి ఉత్తరీయం ముసుగుపెట్టేసుకున్న దశరధ రామయ్యగారు నిద్ర కుపక్రమించారు.

మనవడు యశోద నీకేం అవుతుందో అని వేసిన ప్రశ్న ఆయన్ని మూగవాడిని చేసేసింది. ఇలాంటి ఓ రోజు జీవితంలో వస్తుందనీ, తన మనవడిలా ప్రశ్నిస్తాడనీ తెలిసివుంటే.... కాదు ముందు ఆలోచనచేసి వుంటే, బహుశా తన జీవితం.... ఇలాకాక మరోలా.... వుండి వుండేదేమో!

ఆలోచిస్తూనే అలిసిపోయి నిద్రాదేవివడిలోకి జారిపోయా రాయన.

"వూ! ఇంక తెల్లారిన తర్వాతేగా కళ్ళుతెరిచేదీ! అయినా ఈ పాపిష్టి చేత్తో అన్నంపెట్టి ఈ పిల్లాడి కులం ఎలాపోగొట్టను. వద్దు వద్దు. అంతపాపం నా కొద్దు" అనుకొంటూ యింట్లోని డబ్బాలన్నీ వెతికి ఇన్ని అటుకులు పెరుగులో నానేసి తెచ్చి బాదం ఆకులో పెట్టింది.

అప్పటికే నిద్రలో జోగుతున్న మురళి కళ్ళుమూసుకునే మింగేశాడు అటుకులు. చెయ్యీ, మూతీ కడిగి ఎత్తుకువెళ్ళి నవారుమంచంమీద పడుకోబెట్టటం కాస్త కాస్త గుర్తు వుంది మురళికి.

తర్వాత బాగా నిద్రపట్టేసింది.

ఒక రాత్రివేళ మెలుకువ వచ్చి కళ్ళు తెరిచాడు. మెడ వరకూ కప్పిన దుప్పటీ మీద ఓ చెయ్యివేసి నేలమీద కూర్చుని తల మంచంకోటికి ఆనించి నిద్రపోతోంది యశోద.

"అమ్మా!" అన్నాడు చేత్తో తడిమి. చేతికి యశోద

చెవులకి ఉన్న అదోరకం కమ్మలూ, చేతికున్న లావుపాటి గాజులూ తగిలేసరికి గుర్తుకొచ్చింది. తను తాతయ్యతో పల్లెకి వచ్చాననీ ఈమె అమ్మకాదు యశోద అనీ. ఇంక నిద్ర పట్ట లేదు మురళికి. యశోదనీ, కాస్తదూరంలో గుర్రుకొడుతూ వింత వింత శబ్దాలుచేస్తున్న తాతగారినీ మార్చిమార్చి చూశాడు మురళి. ఏదో శబ్దం అయింది. మ్యావ్ అన్న శబ్దానికి భయ పడిపోతూ 'తా....తాతయ్యా' ఒక్క గావుకేక పెట్టాడు.

యశోద ఉలిక్కిపడి లేచి "ఏంబాబూ ఏమైందీ" గాభ రాగా అడిగింది.

"పి....పి....పిల్లి" మురళి నోట్లోంచి మాటే రావటం లేదు.

"అదా! అది మన పెంపుడు పిల్లి....మరేం భయంలేదు. పడుకో. అయినా నేనుండగా నీకేం భయం."

అంటూన్నా మురళికి భయం పోలేదు. నిద్ర రావటం లేదు" అన్నాడు ఎలాగో.

"నిద్ర రావటంలేదూ! నేను జోలపాడనా చిన్నకృష్ణా" నవ్వుతూ అంది.

"నా పేరు మురళిధర్" ముఖం చిట్లించి అన్నాడు.

"మురళీధరుడూ కృష్ణుడేగా. మురళికి మరోపేరు ఉంది చెప్పనా?"

"చెప్పనా! నల్లనయ్య. కృష్ణుడికి వెన్న అంటే చాలా యిష్టం కదూ! మరి నీకో!

"తెల్లారి నీకు తప్పకుండా వెన్నముద్ద పెడతాను నిద్రపో" అంటూ మెల్లగా వీపుతడుతూ "నల్లనయ్యా నిదరపో చిన్నికృష్ణా నిదురపో" అంటూ మెల్లగా పాడుతోంది యశోద.

ఆ పాటవింటూ కళ్ళు మూసుకుని ఎప్పటికోగానీ నిద్ర పోలేదు మురళి.

నాలుగురోజులు తాతగారి వూరిలో వుండి వచ్చేశాడు మురళి. వచ్చిన దగ్గరనుంచీ పసపిట్టలా ఒకటే వాగుడు మొదలెట్టాడు. స్నేహితులనందరినీ పోగుచేసి తనవూరి విశేషాలు చెపుతూన్నాడు హుషారుగా.

"ఆ వూరులో, అదే మా పల్లెలో తాతయ్య నా కోసం ఎంతో చక్కటి ముత్యాలపల్లకీ దాచి ఉంచాడు. ఆ పల్లకీలో నేనూ, పెళ్ళికూతురూ పెళ్ళిచేసుకుని వూరేగుతాం. అబ్బ ఆ పల్లకీ ఏంత బాగుందని. రంగురంగుల గాజుగొట్టాలు ఆర్చీలు, ఆర్చీలుగా, జలతారు జలతారుగా, మెరమెర మెరిసిపోతూ ఎంత బాగుందనీ కొత్తది అంటే సరికొత్తది నా కోసమే దాచేడుట

తాతయ్య. అబ్బ నాకు అది ఎంతబాగుందో చెప్పటం చేత కావటం లేదుగానీ అద్భుతంగా, అందంగా, ఇంకా ఇంకా చాలా చాలా బాగుంది...."

"నిజంగా!" అందరు స్నేహితులూ ఏక కంఠంతో అడిగారు.

"నిజ్జంగా. దేవుడితోడు. అది చూస్తుంటే చప్పున దాన్నెక్కి పూరేగితే ఎంత బాగుండూ అన్పించింది. కానీ పెళ్ళి కూతురే లేదే" నిరుత్సాహంగా పెదవి విరిచాడు మురళి.

"నీదంతా గ్యాస్!" మురళి మాటలు స్నేహితులు కుతూహలంగా వినటం సహించలేని సూరి అసూయ పడిపోతూ అన్నాడు. అసలు ఏ విషయం అయినా తను చెపితే యింత ఆసక్తిగా వినని స్నేహితులు, అదే మురళి చెపితే నోళ్ళు తెరుచుకు వింటారు. ఇదెప్పుడూ సూరికి చికాకు కలిగిస్తుంది.

అసలు మురళి ఎవరినీ 'కేర్' చెయ్యడు. వాడిమాటే అందరూ వినాలి. అలా వింటేనే తను వాళ్ళజట్టు వుంటాడు. లేకుంటే కోపంతో ఏదో ఒక అల్లరిచేసి లేచి వెళ్ళిపోతాడు. ఆటల్లో, చదువులో ఎప్పుడూ సూరి మురళికే ప్రత్యర్థి. మొదట క్లాసులో సూరే ఫస్టు ఉండేవాడు. మురళి పట్టుదలగా చదివి ఆ ప్రథమ స్థానాన్ని సంపాదించుకున్నాడు. అంతే మళ్ళీ సూరి రెండో వాడిగానే ఉండిపోవాల్సి వస్తోంది. ఇది తగని అసూయ కల్గిస్తూ వుంటుంది సూరికి—

"గాస్ కాదు నిజంగా నిజం. ఎంతెంతపందెం వేస్తావ్?"

మురళి సవాలుచేశాడు సూరిని. "ఓ యస్....ఎంతెంత?" అంటూన్న సూరిని రెక్కపట్టుకు ప్రక్కకిలాగి చంద్రం"మురళీ పెళ్ళికూతురూ, పెళ్ళికొడుకూ రిక్షాలో, ఆటోలో, కారులో వూరేగుతారుగానీ 'పల్లకీ' అంటూన్నారే అదెలా వుంటుందో దాంట్లో అసలు వూరేగుతారో లేదో మేమెప్పుడూ చూడలేదే. సరే మీ తాతయ్య నీ కోసం 'ముత్యాల పల్లకి' చేయించాడే అనుకో మరి దానికి ఇంజన్ అదీ వుండదుగా. మరెలా నడుస్తుందీ."

"పెట్రోలు తాగేస్తుందా!" మరో కుర్రాడు బుర్ర గోక్కుంటూ అడిగాడు. అవేం వుండవు. ముత్యాల పల్లకిని మనుషులే మోస్తారుట!"

ఈ మాటకి వాళ్ళందరికి చచ్చేంత నవ్వొచ్చింది. సూరి పగలబడి నవ్వీ నవ్వీ పొట్ట చేత్తో పట్టుకున్నాడు. చంద్రం నవ్వు ఆపుకుంటూ "అయ్యో! సిగ్గు సిగ్గు.... పెళ్ళికొడుకునీ, పెళ్ళికూతుర్నీ మనుషు రెక్కడన్నా మోస్తారుటరా....ఛీ....ఛీ" ఎగతాళి మొదలెట్టారు. "పొండోయ్! మీకేంతెల్సు. చెప్పినా అర్థం చేసుకోలేని ఘంఠలు. నే చూసి చెపుతూన్నా అర్థం కాదే మీకు."

అసహసంగా అనేశాడు.

"అన్నీ అబద్ధాలే. పల్లకి ఎవరికీ ఉండదు. మా అమ్మ

చెప్పింది నీవన్నీ కోతలే" సూరి తనవైపు బలం ఎక్కువగా ఉండటం చూసుకుని ధైర్యంగా అనేశాడు.

మురళికి వళ్ళు భగ్గుమంది. అంతే విసురుగా లేచి సూరి జుట్టు పట్టుకుని వంచి వీపు మీద గబ గబా గుద్దులు వేసేసి, చెంపలు వాయించేశాడు. సూరి ఏడుపు విని వాళ్ళ అమ్మ వాకిట్లోకి రావటం చూసిన మురళి వాడిని వదిలి పారిపోయాడు.

"అయ్యో! అయ్యో! వీడిముఖం మండా! మా యింటి వాకిట్లోనే మా అబ్బాయినే అంతలేసి దెబ్బలు కొడతావా? నీ చేతులు విరిగిపోనూ" అంటూ అన్నపూర్ణ దగ్గరికి చేతులు బారలు చాస్తూ వచ్చేసింది.

"ఏమమ్మా, అన్నపూర్ణమ్మా మేం అసలీ వాడకట్టున కాపురం ఉండాలా లేక ఇల్లుపీక్కుని పోవాలా ? నీ కొడుకు ఆగానికి అంతులేకుండా ఉంది. అలా వీపు విరిగేలా బాదేసి పారిపోయి వస్తాడా!" పెద్దగొంతుతో అరుస్తూ చెప్తోంది. "అసలేం జరిగింది" అని అన్నపూర్ణ అడిగినా ఆవిడ వినకుండా "నీ కొడుకు ముత్యాలపల్లకీ ఎక్కి పూరేగుతేనేం ఉరేసుకు చస్తే మాకేం. మా వాడిని అనవసరంగా వీపు చిట్లగొట్టి యెందుకు పారిపోయాడూ అంట. ఇది మొదటిసారా అంట? ముప్పయ్యో సారి నీ కొడుకిలా చెయ్యటం. నువ్వు బుద్ధి చెప్పలేకపోతే నేనే పోలీస్ రిపోర్టిచ్చి జైల్లో తోయించేస్తాను. ఆ పని చేయిం

చకపోతే నాపేరు సూర్యకాంతమే కాదమ్మా. అసలునీకొడుక్కి వళ్ళంతా పొగరే. త్రాచుపిల్లలా బుసలు కొడుతూ ఉంటాడు. వాడి మాటకి ఇంట్లో ఎదురులేదని, బైటా అలాగే సాగాలంటే పూరుకుంటామా? చావగొట్టి చెపులు మూసేస్తా. ఇంతకీ వాడేడీ వెధవ కనబడితే వళ్ళు చీరేస్తును. ఏమమ్మా! మాట్లాడవేం.

నీవెప్పుడు జవాబిచ్చావు గనక. ఇదిగో ఆఖరు సారిగా చెపుతున్నాను. వళ్ళు జాగ్రత్తగా ఉంచుకోమను. నేనసలు మంచిదాన్ని కాను. నీకొడుక్కి తలకాయ అంతా పొగరైతే నాకు వళ్ళంతా పొగరని గుర్తుంచుకో. ఏదో ఇరుగూ పొరుగూ అని ఈసారికి పూరుకుంటున్నా...."

ఆవిడ చిచ్చుబుడ్డిలా లేచి అంతలోనే చల్లబడి వెళ్ళి పోయింది. అన్నపూర్ణకి నీరసం వచ్చేస్తోంది....ఏడీ ఈ మురళి గాడు! అంటూ ఓకర్రపుల్ల పట్టుకుని ఇల్లుఅంతా వెతుకుతూంటే అంతవరకూ తండ్రి త్రాత బల్లక్రింద నక్కి కూర్చున్నవాడల్లా, ఛెంగ్న గెంతి ప్రహరీగోడ దూకేసి పారిపోయాడు.

ఇంతలో నారాయణరావు కోర్టునుంచి వచ్చాడు. భర్తని చూచి కోపాన్ని మింగేస్తూ లోపలికి వెళ్ళింది అన్నపూర్ణ. నారాయణరావు బట్టలు మార్చుకుని తీరుబడిగా కాఫీ తాగుతూ అన్నపూర్ణ ముఖంలోకి క్షణం చూసి "ఏమిటి! ఏదో పెద్ద తుఫానే వచ్చి వెళ్ళినట్లుంది" అన్నాడు.

సామాన్యంగా అన్నపూర్ణ భర్త కోర్టునుంచి రాగానే యే విసుగూ కల్గించే విషయమూ చెప్పదు. అందుకే "ఆ ఏంలేదు" అనేసింది.

"లేకపోవటం ఏమిటి? కలహాకంతిలా కర్రపట్టుకు ఇల్లు చుట్టూ ప్రదక్షణాలు చేస్తూన్నా వెవరికోసం? ఏం మళ్ళీ మురళీ ఏం తెచ్చాడు కొంపమీదకి?"

"ఏమీ లేదులెండి" అని అప్పటికి పూరుకుని, రాత్రి తండ్రీ, కొడుకూ, కూతురూ ఒకేసారి భోజనాలు చేస్తూండగా సాయంకాలం విషయం భర్తకి చెప్తోవుంటే మురళికి తల్లిమీద చాలా కోపం వచ్చేసింది! తప్పించుకుని పారిపోయేందుకైనా అవకాశం లేదు. తన కోపం అన్నంమీద చూపిస్తూ పెద్ద పెద్ద ముద్దలు చేసి మింగేస్తూన్నాడు.

అంతా విన్న నారాయణరావు ఆ విషయం ఎంతో తేలిగ్గా తోసేస్తూ నవ్వుతూ కొడుకువైపు చూసి.

"మురళీ! నీ ముత్యాలపల్లకీ తాతయ్య యెంత భద్రంగా దాచి కాపాడుతున్నాడో చూసుకొచ్చావా! నువ్వు పెద్దవాడివై పెద్దచదువు చదివి మంచిఅందమైన అమ్మాయిని పెళ్ళిచేసుకుని, ఆ ముత్యాలపల్లకీలో పూరేగుతూ వచ్చి మన ఇంట గృహ ప్రవేశం చెయ్యాలి. తెలుసా!" అన్నాడు.

తండ్రి కోప్పడకుండా ఇలా సరదాగా కబుర్లలోకి దిగే సరికి మురళికి హుషారొచ్చింది. "నిజంగానే కదూ నాన్నారూ" అన్నాడు.

అనూరాధ పెరుగుముద్దలు తింటూ మూతిని ఎడంచేత్తో తుడుచుకుంటూంటే తల్లి అలా చెయ్యకూడదు అని మందలి స్తూనే భర్తతో—

"మామగారు మురళి పెళ్ళి గృహప్రవేశం కూడా ఆ పాడుపడిన ఇంట్లోనే చెయ్యాలని పట్టుబడితే మాత్రం చాలా కష్టమే బాబూ" అంటూ నవ్వింది అన్నపూర్ణ.

"చిన్నాన్న అంత చాదస్తుడు కాదనుకో! ఒకవేళ అలా అన్నాడా అక్షరాలా జరిగి తీరాల్సిందే."

"అబ్బ.... ఆ పాత ఇంట్లో గృహప్రవేశం ఎలాగండీ! కష్టం కదూ'

అప్పుడే కొడుకు పెళ్ళి జరగబోతూన్నట్లు మామగారు సగంకూలిన పురాతనపు ఇంటిలోనే గృహప్రవేశం చెయ్యాలి అని పట్టుపడుతూన్నట్లు ఊహిస్తూ బాధపడి పోతోందిఅన్నపూర్ణ. నారాయణరావు భార్యని చూసి నవ్వి "సరే నీ విప్పుడే అలా బాధపడకు. పెరుగు వెయ్యి" అన్నాడు కూతురు గ్లాసులోకి మంచినీళ్ళు వంపుతూ.

"నాన్నారూ ఆ ముత్యాలపల్లకీ అబ్బ ఎంత అందంగా ఉందనీ, చాలా బావుంది. అది మాసిపోకుండా నిండా గుడ్డకప్పి వుంచారు. ఔనూ అది నిజంగా ముత్యాలపల్లకీ యేనా?"

"శ్రద్ధగా వింటావా నే చెప్పేది!"

ఓ....వినటమేకాదు బాగా గుర్తుంచుకుంటాను చెప్పండి"

కుదురుగా కూర్చున్నాడు. అనూరాధ కేదేమిటో సరిగా అర్థం కాకున్నా, తండ్రి చెప్పేది తనూ వింటోంది. అన్నపూర్ణ కూడా సరదాగా వింటోంది భర్త చెప్పేది.

"ఆ ముత్యాల పల్లకీకి చాలా చరిత్ర వుందిరా మురళీ. క్లుప్తంగానే చెప్తాను. దాన్ని మా నాన్న ఆఖరి తమ్ముడైన ఈ చిన్నాన్నకోసం ఎంతో శ్రమపడి చేయించారు. అంతక్రితం అంత అందమైన ముత్యాలపల్లకీ ఆ ఊరిలోగానీ ఆ చుట్టుపట్ల గానీ లేదంటే నమ్ము. ఆ పల్లకీలో మా చిన్నాన్నకూడా కొడుకై ఊరేగాలని కలలు కనేవాడు. కాని ఏం లాభం. ఎవరి తనుగానే ఆ అవకాశాన్ని పోగొట్టుకున్నాడు. ప్రతి మనిషికీ ఈ ముత్యాల పల్లకీలో ఎక్కే అదృష్టం జీవితంలో ఒకే ఒక్క సారి వస్తుంది. అది మర్చిపోయిన చిన్నాన్న యవ్వనగర్వంతో పెళ్ళి నిర్లక్ష్యం చేశారు. ఆ తర్వాత ఎంత విచారించినా ప్రయోజనం లేదుగా. సరే ఆయనకి అలాఅయింది. పోనీ ఆ అదృష్టం నాకూ దక్కలేదు. సరే నావిషయం యాదృచ్ఛికంగా జరిగిందే అనుకో. ఏది ఏమైనా ఆ పల్లకీ విలువ చిన్నాన్నకి తెల్సినంతగా మరెవ్వరికీ తెలియదు.

నిట్టూర్చాడు నారాయణరావు. అన్నపూర్ణ వంటగదిలోకి ఎప్పుడు వెళ్ళిందో చూడలేదెవరూ. తర్వాత మెల్లగా వచ్చి—

"చిన్నవెధవ వాడు. వీడి దగ్గర ఏమిటీ మాటలన్నీ?" మెలగానే అంది.

"అరె! అవును కదూ! ఏమిటో....చెప్పేదానా....సరే.... సరే" అంటూ ఆ విషయం తప్పించేయటానికి ప్రయత్నిస్తున్నా మురళి వదలటంలేదు.

"మీరెందుకెక్కలేదు నాన్నారూ ?" రెట్టించి అడుగు తున్నాడు.

"చూశారా" అన్నట్లు చూసింది అన్నపూర్ణ భర్త కళ్ళ లోకి. అదేం వినసట్లు చెయ్యి కడిగేసుకుంటూన్న తండ్రితో—

"నాన్నారూ! మరి....పల్లెలో యశోదమ్మ అంటూ ఒకామె ఉండే ఆవిడ మనకి ఏమవుతుంది? రాజయ్యకి ఏమవుతుందో కూడా తెలియదు నాకు— చెప్పండీ ఆవిడెవరు?"

ఆ ప్రశ్నకి భార్యాభర్త లిద్దరూ ఉలిక్కిపడ్డారు. ఒకరి ముఖంలోకి ఒకరు చూసుకుంటూ ఉండిపోయారు. నారాయణ రావు చెయ్యికడిగి లేచి వెళ్ళిపోతూంటే మురళి "నాన్నారూ నాకు జవాబు చెప్పనేలేదు" అన్నాడు.

"మీ అమ్మనడుగు" హాల్లోకి వెళ్ళిపోయాడు.

"ఇలాంటివన్నీనామీదకి నెట్టటం ఎప్పుడూ అలవాటేగా" చిరచిరలాడుతూన్న తల్లితో "అమ్మా నువు చెప్పు. యశోదమ్మ ఎవరు?"

"నాకు తెలియదు. మీ నాన్నగారినే అడుగు" వంటగది లోకి వెళ్ళిపోయింది అన్నపూర్ణ.

"బాగుంది. తాతయ్య యశోదని అడుగు అన్నాడు. యశోద తాతయ్యనే అడుగు అంది. ఇక్కడ నాన్నను అమ్మని అడుగు అన్నారు. అమ్మ నాన్నారినే అడుగు అంది. కానీ జవాబు మాత్రం ఎవరూ చెప్పలేదు. ఏంటన్నా ఇదీ—"

మురళి తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. అనూరాధ చెయ్యి కడిగేసి లేస్తూ అన్నగారి ఆసరాతో పుచ్చదిగి "అన్నాయ్.... యశోదనే అడిగెయ్యి. నీవెవరు అని" అంది లంగాతో మూతి తుడుచుకుంటూ—

గుడ్ అయిడియా అనూ! ఈసారి పల్లెకి వెళ్ళినప్పుడు అదే చేస్తాను అనుకున్నాడు.

"అన్నయ్యా ఈసారి నీ వెళ్ళేపుడు నన్నూ తీసుకువెడతావా?"

"ఓ! తప్పకుండా చెల్లాయ్. అక్కడ యశోద వుంది చూశావూ—"

"నే చూళ్ళేదుగా!"

"ఓ అవునుకదూ! నే చెప్తాగా విను. ఆ యశోద చాలా మంచిది. నన్ను చాలా ప్రేమగా చూసింది. ప్రతి శలవులకీ తప్పక రమ్మంది. నన్ను ఒక్కడినేకాదు నిన్నుకూడాతీసుకుని. ఆవిడ కాఫీ భలే బాగా చేస్తుంది. నువ్వు ఎప్పుడూ నా మాటకి

ఎదురు చెప్పకుండా ఉంటే తప్పక తీసుకువెడతా సరేనా—అమ్మా! లోపల ఏం చేస్తున్నావమ్మా ఇంతకీ యశోద నాకేం అవుతుందీ చెప్పనేలేదు."

"ఇంక చదువూ సంధ్యా ఏంలేదు. వెధవ వాకాడూ నువ్వు. పో చదువుకో."

తల్లి అకారణ కోపానికి భయపడి అనురాదా మురళి తమ చదువుల గదిలోకి వెళ్ళిపోయారు. మురళి పుస్తకం తెరిచాడు. అనూ ఆవలిస్తూ గడగడా పైకి తెలుగుపాఠం చదువుతోంది.

"అబ్బబ్బ! నోరుమూసుకోవే తల్లీ! ఇక్కడ నాకు చదువు బుర్రకెక్కటం లేదు."

"నాకు అలా అయితే రాదు"

"రాకపోతే నోరుమూసుకు పడుకో. నాకు రేపుపరీక్షలు. పన్నెండింటివరకూ చదివినా తరిగేలా లేదు వెధవ నోట్సు" మురళి లైటుతీసేసి టేబుల్‌లైటు వేసుకుని చదువులో మునిగిపోయాడు. నారాయణరావు పదకొండుగంటల తర్వాత పడుకోపోతూ పిల్లల గదిలోకి తొంగిచూశాడు. మురళి ఏకాగ్రతగా చదువుకోవటం చూసి తృప్తిగా నిట్టూర్చి మంచంమీద వాలి కళ్ళు మూసుకున్నాడు. తన ఏకైక పుత్రుడు బాగా చదివి పెద్ద పొజిషన్‌లోకి వెళ్ళిపోవాలని ఆయన కలలు కంటున్నాడు.

ఇప్పటి నించీ. అనూ మాత్రం ముసుగు బిగించి నిద్రపోతోంది అప్పుడే. పోనీలే ఆడపిల్ల ఎలాగైనా ఫర్వాలేదు అనుకున్నాడాయన.

కాలచక్రం తిరిగిపోతోంది. మూడు సంవత్సరాలు గడిచిపోయాయి.

మురళి పదోతరగతి పరీక్షలు వ్రాసి తాతయ్య 'దగ్గరికి వెళ్ళొస్తా!' అంటూ పేచి పెట్టుకుకూర్చున్నాడు. "అన్నయ్యా నేనూ వస్తా" అంటూ బయలుదేరింది అనూరాధ.

"పిల్లలు పెద్ద వాళ్ళవుతున్నారు. అక్కడికి పంపటం ఏమంత మంచిది కాదని ఎన్నిసార్లు చెప్పనూ. మురళిని ఇప్పటికి నాలుగుసార్లు చెప్పిన మాట వినకుండా పంపారు. ఏమైనా సరే ఇంక అక్కడికి పంపటానికి వీల్లేదు. "చూస్తూన్నారుగా అనూ కూడా బట్టలు సర్దేస్తోంది" ఖచ్చితంగా చెప్పేసింది అన్నపూర్ణ. నారాయణరావు ఇరుకున పడిపోయాడు. కొడుకుని ఒప్పించటం చాలా కష్టమే అనుకుని—

"మురళి ఆ పల్లెలో ఏం ఉందిరా. మీ చిన్నమామయ్య రమ్మని రాశాడుగా విశాఖపట్నం వెళ్ళు" అని మురళికి నచ్చ

చెప్పి పల్లె ప్రయాణం మాన్పించి మేనమామదగ్గరికి పంపేసరికి చాలా కష్టమే అయింది. అనూరాధ నేను "మామయ్యగారి ఊరు వెళ్ళనే వెళ్ళను" అని సణుగుతూ సర్దుకున్న బట్టలన్నీ తీసి గదిలో గిరాట్టు వాట్టేసింది. ముసుగు బిగించి పడుకుంది.

అన్నపూర్ణ కూతుర్ని పలకరించకుండానే తన పని చేసుకుంటోంది. ఇది మరీ మంటలెత్తిస్తోంది అనూరాధకి. నేనూ అన్నయ్యలా అబ్బాయినై వుంటే వీళ్ళకెవరికీ చెప్పకుండానే తాతయ్య దగ్గరికి వెళ్ళిపోయి ఆ యశోదని ఓసారి చూసి వచ్చే దాన్ని అని బాధపడిపోయింది ఎంతోసేపు. ఆ రాత్రికి భోజనం కూడా మానేసింది. అయినా అన్నపూర్ణ బ్రతిమిలాడలేదు. లోలోపల ఉడికిలిపోతూనే మర్నాడు తండ్రితో అన్నం తినేసింది అనూరాధ.

ఇంక పల్లెలో మురళి రాకకోసం యశోదా దశరథ రామయ్యగారులు రోజులూ గంటలూ లెక్కపెట్టుకుంటూ ఎదురు చూస్తున్నారు. మురళి రాలేదుకదా ఓ కార్డు ముక్కైనా రాయలేదు. యశోద పోష్టుమేన్ కోసం ఎదురుచూసి చూసి అతను "మీకేం లేవమ్మా యశోదమ్మా" అనంగానే నీరుగారిపోయి "అబ్బే నేను ఉత్తరంకోసం కాదు పూరికినే నిల్చున్నాను వాకిట్లో" అనేస్తుంది. పోష్టుమెన్ అప్పారావు ఉత్తరాల కట్ట చూసుకుంటూ "అట్టాగా! మనవడి ఉత్తరం కోసం కాపువేశావేమో అనుకుంటున్నా! బొంబూ శలవులకి మీ మురళిబాబూ రాలేదులా ఉందే" అంటూనే వెళ్ళిపోతాడు.

"రావల్సిందే వాసీ ఎందుకో రాలేదు" అనుకుంటూ మర్నాడు అప్పన్న వచ్చేవేళకి లోపలేవున్నా అతను వెళ్ళిపోగానే బైటకి వచ్చి వసారాఅంతా ఓసారి కళ్ళతోనే వెతుక్కుంటుంది. ఒకవేళ పిలవలేక ఉత్తరం గిరాట్టువేసి వెళ్ళాడేమో అని వాసి అక్కడా నిరాశే ఎదురౌతోంది. అలా పదిహేను రోజులు ఎదురు చూడగా చూడగా నారాయణరావు దగ్గర నుంచి కార్డు రానే వచ్చింది. ఆ ఉత్తరం ఇంగ్లీషులో వుంది. ఆ భాష తనకి రానందుకు బాధపడిపోతూ. —

"ఏమండోయ్....వచ్చింది ఉత్తరం" అంటూ గావుకేక పెట్టటం తడవు దశరథరామయ్యగారు గబాలున వచ్చి యశోద చేతిలో ఉత్తరం లాక్కొని చదువుతోంటే___

"ఏమండీ మురళిబాబు వస్తున్నాడా?" ఆత్రంగా అడిగింది.

"రాడుట. ఈ శలవుల్లో మేనమామ దగ్గరికి వెళ్ళాడుట" నీరసంగా ఉత్తరం మంచంమీద పడేసి ఆయనా కూలబడిపోయాడు.

"ఈ విషయం ఇన్నాళ్ళ తర్వాతనా మనకిరాసేదీ! మంచి కొడుకే. ఐనా మురళిబాబు ఈ శలవులకి ఇక్కడికి తప్పకుండా వస్తానని మాట యిచ్చాడు. ఒకవేళ మేనమామ దగ్గర నుంచి ఇంటికి వెడుతూ ఇక్కడే దిగి తన్ని చూసిపోతాడేమో"

"..........."

"మాట్లాడరేంటి! మీరలా ఉంటే నాకేం తోచదని ఎన్ని సార్లు చెప్పాను." "యశోదా! మనలాంటి వాళ్ళు మమతలని పెంచుకోకూడదు" అన్నారు హాసగా. యశోదకి కోపం బుస్సున పైకొచ్చింది.

"అని తెలిసే కాబోలు ప్రతిరోజూ ఆ ముత్యాలపల్లకీ దగ్గర కూర్చుని మనవడి భవిష్యత్తు ఊహించుకుంటూ ఎన్నో కలలు కంటూన్నారు. దాన్ని కాపలా కాయలేక ఎంత హైరాన పడిపోతున్నారో తెలియదూ! దీనికోసం ఎన్ని విరోధాలు తెచ్చు కున్నారూ! ఎంత నష్టపోయారూ. మునసబుగారి అమ్మాయి పెళ్ళికి ఈ పల్లకీ కావాలని అడిగినా 'వీల్లేదు' అని మీరన్నా రనేగా కోపంవచ్చి గొడ్లు పొలంలోపడి పాడుచేశాయని బందెల దొడ్డిలో పెట్టించాడూ, అర్ధరాత్రి రౌడీ వెధవలకి తాగబోయించి ఇంటిమీదకి దొంగలనానికి పంపితే నాలుగు బస్తాల ధాన్యం దోచుకుపోయారూ. ఆ కొట్లాటలోనేగా మోకాలికి దెబ్బలగిలి అడుగుతీసి అడుగు వెయ్యలేకేగా ఇన్నాళ్ళూ బస్తీకివెళ్ళి రాడు కునీ, మనవడినీ మనవరాలినీ చూడలేకపోయూనే అని తెగ బాధ పడిపోతున్నారు. ప్రాణం అక్కడా శరీరం ఇక్కడా!

ఔనా కాదా! నిజం చెప్పండి. ఇప్పుడు చెప్పండి. మమ కారం పెంచుకున్నది యెవరు?"

"మీకు పెళ్ళిలేదు పిల్లలు లేరు" అన్నకొడుకుని తల్లీ

తల్లీతండ్రీ లేనివాడిని ఇంతవాడిని అంపవాడినిచేశారు.కడుపుకట్టు కుని చదివించారు. ఆయన్ని లాయర్ని చేయటానికి మీరెంత కష్టపడ్డారో మీరు మర్చిపోయినా నేను మర్చిపోలేను. మీరింతగా ప్రాణంలో ప్రాణంగా చూసుకున్నా ఆయన ఏం చేశాడు! చెప్పకుండా స్నేహితుడి చెల్లెలి పెళ్ళికంటూ వెళ్ళి ఏదో కట్నం డబ్బుకోసం తగాదావచ్చి ఆ పెళ్ళి ఆగిపోతే ఆ పిల్ల కన్నీళ్ళకి కరిగిపోయి మీ అబ్బాయి ఆ పిల్ల మెడలో మంగళసూత్రం కట్టేసి, గప్‌చిప్‌గా ఇంటి కొచ్చేసి, ఆరునెలల తర్వాత పెళ్ళి అయినమాట బైటపెడితే మీరేం చేశారు. మొదట ఆవేశపడ్డా, తర్వాత సరుకుని కోడలిని తీసుకురమ్మని పట్నంలో కాపురం పెట్టించారు. సరే అయిపోయింది. ఆయనకి ఓ ఇల్లూ ఇల్లాలూ పిల్లా పాపా అంటూ ఏర్పడ్డారుగా! ఆయన బ్రతుకు ఆయన బ్రతుకుతూన్నాడుగా! అని వూరుకున్నారా మీరు. వాళ్ళ పిల్లల మీద మితంలేని మమకారం పెంచుకుని ఆ మురళిబాబుకి శలవు లెప్పుడొస్తాయా ఇక్కడికెప్పుడు వస్తాడా! అని ఒకటే ఎదురు చూడటం. పైగా మీరు నాకు చెపుతున్నారా మమకారం పెంచుకోవద్దనీ."

యశోద రోషంగా అనేస్తోంది.

"అసలుకంటే వడ్డీ ముద్దు అని నీకూ తెల్సుగా" అంటూ మంచం ఆరుబైట వేసుకుని దానిమీద పడుకుని ఆకాశంలోకి చూస్తూ ఆలోచిస్తున్నా రాయన.

యశోద ఇంక ఏం మాట్లాడకుండా కూర్చుంది.

"యశోదా నారాయణని అసలు 'లా' చదివించకుండా ఉండాల్సింది. ఏదో సంపాదిస్తూన్నాడేకానీ 'మరేం ఫర్వాలేదు' అనేంత ప్రాక్టీసు లేదే. గాజుల మలారం భోజనానికి సరి అన్నట్లుంది. వాడి పని అసలా వృత్తిలో అన్ని ఒడుదుడుకులున్నాయని తెలిస్తే 'లా' చదివించేవాడిని కాను."

"మరేం చేయించేవారు! బి. ఎ. అవగానే మాన్పించి గుమాస్తా చేయించే వారా?"

"కాదు యం. ఎ. చేయించి ఐ. ఎ. యస్. కూర్చోపెట్టి కలెక్టర్‌ని చేసే వాడిని."

"అబ్బ! ఎంతఆశ. కలెక్టరుగారి పినతండ్రిని అని గొప్ప చెప్పుకోవాలనేగా! పోనివ్వండి ఇప్పుడు మాత్రం పోయిందేం వుంది. మనవడిని చేయవచ్చుగా! కలెక్టర్ తాతగారినని వెన్ను విరుచుకుని నడుస్తూ మీసం మెలేయవచ్చు."

"యశోద పరిహసిస్తూ అంది."

"అక్షరాలా అలానే చేసి తీరతాను. చూస్తూ వుండు."

గర్వంగా అన్నారు దశరథరామయ్యగారు.

"వూ! అప్పుడే మనవడు కాలేజీలో అడుగు పెట్టీ పెట్టలేదు. కలెక్టర్ అయిపోయినంతగా పొంగిపోతూన్నారు పిచ్చి మారాజులు."

నిట్టూర్చింది యశోద.

"చూస్తూ వుండగానే రోజులూ, నెలలూ, సంవత్సరాలూ ఎంత త్వరగా తిరిగిపోతున్నాయే యశోదా! మన పరిచయం నిన్నమొన్న అయినట్లే వుంది నాకు. వాసీ పాతిక సంవత్సరాలు దొర్లిపోయాయి చూడు. నా వయస్సు యాభైలోకి వస్తోంది. నా తల పూర్తిగా బట్టతలైంది. మీసమూ నెరిసిపోయింది" అంటూ నవ్వారాయన.

"అబ్బ! ఎన్నాళ్ళకి మీ నోటినించి విన్నానూ ఈ మాట. పెద్ద తనం వచ్చిందని వప్పుకోవటం. మీ కబుర్లకేంగానీ పాలు పిల్లి తాగిపోగలదు. అన్నట్లు ఎర్రగేదె ఈనమోపులైంది. రాత్రివేళ కాస్త కనిపెట్టి వుండాలి. ఆవు పాలే సరిగా ఇవ్వటం లేదు. మరోగేదెని కొనుక్కుందామా!

"వూ....చూద్దాంలే"

"సరే పడుకోండి. నే వెళ్ళి లోపల పని చూసుకువస్తా" అంటూ లోపలికి వెళ్ళిపోయింది యశోద. మురళిబాబు రెండు రోజులైనా వచ్చి వెడితే బాగుండేది. అయినా నేను తనకోసం ఎదురుచూస్తూ ఉంటానని తెలియదూ!

తనలో తనే బాధపడిపోతూ అలవాటుగా పని చేసుకుంటోంది యశోద.

# 6

కాలచక్రం గిర్రున తిరిగిపోతోంది. మురళీధర్, అనూరాధా కాలేజీలో చదువుతున్నారు. నారాయణరావు సంపాదన ఏమంత పెరగలేదుగానీ ఖర్చుమాత్రం బాగా పెరిగి పోయింది. పల్లెనుంచి దశరథరామయ్యగారికి ఆరోగ్యం బాగాలేదని ఉత్తరం వచ్చింది.

"వెంటనే ఇక్కడికి వచ్చేయండి చిన్నాన్నా! మంచి డాక్టరుతో మందు ఇప్పిస్తాను" ని అనారాయణరావు ఉత్తరం రాసినా ఆయన రాలేదు.

ఇరవైఏళ్ళ మురళి అందంగా ఆకర్షణీయంగా తయారైనాడు. ఫ్యాషన్ కూడా పెరిగిపోయింది. అల్లరి తగ్గి మాటలో, నడకలో హుందాతనం వచ్చింది. చిన్నప్పటి ఆరతాయి మురళేనా వీడు అంటూ వుంటారు దగ్గరి బంధువులు. అనూరాధా వోణీలువేస్తోంది. సన్నగా పొడుగ్గా అందంగా బంగారుబొమ్మలా అయింది. అన్నగారితో చీటికీ మాటికీ చిన్నప్పటిలా తగూకి దిగటం మానేసింది. అన్నగారంటే నానాటికీ అభిమానం ఎక్కువవుతోంది. ఈ ఇద్దరి పిల్లలినీ వారానికి ఓసారన్నావచ్చి కరువు తీరాచూసుకుని వెళ్ళే దశరధరామయ్యగారు ఈసారి నెలరోజులైనాఅనారోగ్యంవల్ల రాలేకపోయారు.

మురళి తండ్రితో "నాన్నారూ, నా కెలాగూ కాలేజీకి శలవే. ఇవాళే వెళ్ళి తాతగార్ని తీసుకొచ్చేస్తాను" అంటూ బయలుదేరాడు.

హఠాత్తుగా వచ్చిన మురళిని చూస్తూ యశోద పొంగిపోయింది. తాతగారి ఆరోగ్యం యేం బాగాలేదు. వెంటనే బయలుదేరదీశాడు. బస్ వరకూ కిరాయి బండీ కట్టించాడు. యశోద యిదివరకు తను చూసినప్పుడులా లేదు. యేదో దిగులు కన్పిస్తోంది ముఖంలో. చాలా పెద్దదై పోయినట్లుగా ముఖం అదోలావుంది. చెంపలపైన జుత్తు తెల్లగా నెరిసినట్లు కన్పిస్తోంది. హుషారుగా నవ్వుతూ వుండే యశోద అదోలా వుంటే మురళికి బాధగావుంది. అయినా మురళి ఏమీ మాట్లాడలేకపోయాడు.

తాతగారిని బండీ యెక్కించి ఆ బండీ వెంట నడుస్తూన్న మురళిని నాలుగు వీధులు దాటే వరకూ అను సరిస్తూనే వుంది యశోద.

"అబ్బా! ఇంకా యెంత దూరం వస్తావు యశోదా! వెళ్ళు ఇంటికి. త్వరగా వచ్చేస్తాగా" దశరథరామయ్యగారు అంత [illegible]లో నవ్వేస్తూ అన్నారు.

యశోద ఆగిపోయింది. బండీ ముందుకి సాగిపోయింది. మురళి క్షణం అక్కడే ఆగాడు. ఆమె కళ్ళు తడి కావటం గ్రహించిన మురళికి మనస్సులో తెలియని బాధ.

"యశోదమ్మా! నువ్వో బస్తీ రాకూడదూ!"

"ఇప్పుడు కాదు బాబూ!"

"ఎప్పుడూ ఇలాగే చెప్తావు. కానీ యెప్పుడొస్తావో పోనీ చెప్పు."

"నీ పెళ్ళికి తప్పకుండా వస్తానుగా" యశోద ముఖంలో నవ్వు పులుముకుని అంది.

"సరే గుర్తుంచుకో! మరి నే వెళ్ళొస్తా! వెంటనే వుత్తరం రాస్తాలే ...సరేనా"

"సరే" వుబికి వచ్చే దుఃఖాన్ని దిగమింగుకుంటూ వెనక్కి తిరిగి గబగబా వెళ్ళిపోయింది యశోద. మురళికి బాధగా వుంది. యశోదతో వెళ్ళి ఆమెని ఓదార్చాలని వున్నా తాతగారి బండీ ముందుకు వెళ్ళటం గుర్తుకొచ్చి బలవంతంగా నడుస్తూ బండీని కదుపుతున్నాడు.

తాతగారిని బస్‌లో జాగ్రత్తగా తీసుకుని వచ్చాడు మురళి. డాక్టర్ వచ్చి చూసి మందు యిచ్చి వెళ్ళాడు. అన్నపూర్ణ వెయ్యి కళ్ళతో మామగారికి లోటు చూస్తోంది. కాలేజీ నుంచి ఇంటికి రాగానే బట్టలైనా మార్చుకోకుండా తాతయ్య దగ్గర కూర్చుని కాస్సేపు కబుర్లు చెప్పటం అలవాటైపోయింది మురళికీ, అనూరాధకీ.

అలవాటు ప్రకారం కాలేజీ నుంచి వస్తూనే తాతగారి

దగ్గర కూర్చుని కబుర్లు మొదలెట్టాడు మురళి. అనూరాధా వచ్చేసింది. అనూ చెప్పే కబుర్లకి దశరథరామయ్యగారు పగలబడి పెద్దగా నవ్వేస్తూంటే మురళికి పల్లెలో ఆపాత ఇంట్లో ఒంటరిగా దిగులుగా కూర్చునే యశోదే గుర్తుకొస్తూ వుంటుంది. యశోద ఒంటరిది. ఆమె సర్వస్వం తన తాతయ్యే అనే విషయం యెప్పుడో గ్రహించాడు మురళి. తను మొదటిసారి పల్లెకి వెళ్ళినప్పుడు "తాతయ్యా యీ యశోద యెవరు. నీకేం అవుతుంది. పోనీ నేనేమని పిలవాలి" అని అమాయకంగా వేసిన ప్రశ్న గుర్తు వచ్చినప్పుడల్లా తనలో తానే నవ్వుకుంటాడు.

"యశోదనే అడుగు" అని తాతయ్య.

"మీ తాతగార్నే అడుగు" అని యశోదా జవాబిచ్చినప్పుడు నిజంగా ఆ యిద్దరి మీదా కోపం వచ్చింది. ఆ కోపంలో యశోదని రెట్టించి రెట్టించి అడిగాడు.

"నీ వెవ్వరో నీకే తెలియదా!" అని. అప్పుడు యశోద ముఖంలోని భావాలని యిప్పుడు గుర్తుకు తెచ్చుకుంటూ బాధపడతాడు,

"నే నెవరో నాకే తెలియదు మురళీబాబూ! నాకు తెల్సిందల్లా నేను యశోదని! అయినా నన్ను యశోదా అని పిలవకూడదూ!" అన్నప్పుడు ముఖం క్రిందకి దించుకుని నేల చూపులు చూస్తూ—

"సరే అలాగే" అన్నాడు. అంతే అప్పటినించీ

'యశోదమ్మా' అని పిలవటం అలవాటుచేసుకున్నాడు మురళి. మురళి అలా పిలిచినప్పుడల్లా "ఏంటి చిన్నికృష్ణా!" అని చిరునవ్వు నవ్వుతుంది. ఆ నవ్వంటే మురళికి తగని యిష్టం. యివన్నీ గుర్తుకొచ్చి తనలో తనే నవ్వుకున్నాడు మురళి.

ఇంతలో తండ్రి కోర్టు నించి రావటంతో మురళి లేచి బట్టలు మార్చుకునేందుకు గదిలోకి వెళ్ళాడు.

"పూర్ణా! యివిగో బత్తాయిలు. ఇవి రసం తీసి చిన్నాన్న కివ్వు".

అంటూ భార్య కందిస్తూ వుంటే అన్నపూర్ణ అవి అందుకుని "నాలుగే తెచ్చారేం" అంది.

"రేపు ఒక డజను తెస్తానులే" అంటూ బట్టలు మార్చుకోవటానికి వెళ్ళాడు. అదంతా వింటూన్న దశరథ రామయ్యగారు బాధపడిపోతూ—

"వీడిలా ప్రతిరోజూ లెక్క పెట్టినట్లు సంపాదిస్తూంటే యింక పిల్లలిద్దరి కాలేజీ చదువులెలా పూర్తిగాను. అనూపెళ్ళి యెలాకాను. ఈరోజుల్లో కట్నాల పాట ఆకాశాన్ని అంటుతోందే! పదివేలన్నా లేంది సరైన వరుడురాడు. వీడి దగ్గర చూస్తే పది వందలన్నా వున్నట్లు లేదు. యెలా చేస్తాడు పిల్ల పెళ్ళి."

విచార పడుతున్నారాయన. అనూ బంగారుబొమ్మ. సుగుణాల రాశి. అయితే ఈ రోజుల్లో రూపాన్నీ గుణాన్నీ చూసి చేసుకునే రాజకుమారు లెక్కడున్నారు!

"[illegible] తాగండి మామగారూ" అన్నపూర్ణ గ్లాసు అందించింది.

ఆలోచనలు కట్టిపెట్టి కోడలి చేతిలోని గ్లాసు అందుకుంటూ వుండగా, నారాయణరావు లుంగీకట్టుకుని తువ్వాలు భుజం మీద వేసుకుని ఓ కుర్చీలాక్కుని పినతండ్రి దగ్గర కూర్చుని భార్య అందించిన కాఫీ తాగుతూ—

"చిన్నాన్నా! పెదనాన్నగారి కూతురు రాజేశ్వరి అక్కయ్య రాయపూర్‌నుంచి ఇక్కడికి వచ్చేస్తున్నట్లు పుత్తరం రాసింది. బావగారు రిటైరైపోయారుట. ఇక్కడే ఓ యిల్లు కొనుక్కుని యిక్కడే సెటిల్ అయిపోతాం అని యేదైనా ఇల్లు వుంటే రాయమని రాసింది. ముందు మన ఇంటికే రమ్మని యివాళే జవాబు రాసేశాను. రెడీగా ఓ యిల్లు కూడా అమ్మకానికున్నట్లు తెల్సింది. అది చూసి వాళ్ళకి నచ్చితే....కొనేయవచ్చు."

"అలాగా! వాళ్ళు చాలా సంవత్సరాలుగా పుత్తర దేశంలోనే వుండిపోయారు. ఈ మధ్య మరీ రాకపోకలు తగ్గిపోయాయి. ఇక్కడే వుంటే నాకూ దగ్గర. ఇద్దరినీ చూస్తూ వుంటాను. నా కెవరున్నారు.

పెద్దన్నయ్య కూతురుగా అదీ, చిన్నన్న కొడుకుగా నువ్వూ యింతేగా. అన్నట్లు రాజేశ్వరి దగ్గర మన మురళి యీడు వాడే కొడుకు వున్నాడుగా, వాడు మెకానికల్

ఇంజనీరింగ్ చదువుతున్నాడని రాసినట్లు గుర్తు, బహుశా ఆఖరి సంవత్సరం కాబోలు, వాడిపేరా....గిరిధర్. నేను నాలుగేళ్ళ క్రితం రాజేశ్వరి దగ్గరికి వెళ్ళినప్పుడు వాడిని చూశాను. పిల్లాడు బాగుంటాడురా....వాడు కాక మరో యిద్దరు ఆడపిల్లలు. పెద్దది సునంద మన మురళి కంటే కాస్త పెద్దది.

"అక్కయ్య పిల్లలు పెద్దవాళ్ళైం తర్వాత నేను చూడలేదు. తను ఒక్కర్తె వచ్చి వెడుతూ వుంది కదా"

"ఫో! వాసూ, నారాయణా మన అనూ పెద్దదైంది కదా దాని పెళ్ళి ప్రయత్నాలు మొదలు పెట్టిపెట్టూ!"

నారాయణరావు జవాబు చెప్పలేదు. అన్నపూర్ణ అందుకుని "నే నెప్పటినించో చెప్తున్నాను. కానీ విన్పించు కోవటం లేదు." అనేసింది.

భార్య మీద చిరాకొచ్చింది నారాయణరావుకి. అనూ పెద్దదయిందని తనకి తెలియదా. మంచి సంబంధం చూడాలనీ, పెళ్ళి చేసెయ్యాలనీ కూడా తెలుసు. కానీ పెళ్ళి అంటే డబ్బు కావాలే. కట్నం సంగతి అలా వుంచి ఖర్చుకైనా నాలుగు వేలు లేవు. ఎప్పటికప్పుడు సంసారపు ఖర్చులూ, పిల్లలిద్దరి చదువూ ఇంటికి వచ్చిపోయే అతిథులూ అభ్యాతులూ, యివన్నీ సవరించుకునే సరికే శక్తి సరిపోతుంది. ఇంక నిలవ చేయటం యెక్కడ. ఇవన్నీ తల్చుకుంటూంటే తన వృత్తి మీద తనకే కోపం ముంచుకొస్తుంది. విసుగు కలుగుతుంది. బ్రతకలేని బడిపంతుల్లాంటిదే, "ఫైలు"లేని ప్లీడరీ గిరీ కూడా.

ఈ వృత్తిలో కొందరు వేలూ లక్షలూ సంపాదించ టం చూసిన పినతండ్రి అబ్బాయిని ప్లీడరు చేయాలని కలలు కన్నాడు. బి.ఏ. ప్యాస్ రాగానే "లా" చదువుతావురా అని అడిగితే "మీ యిష్టం చిన్నాన్నా" అన్నాడు ఆనాడు. అప్పుడు ఏ లైనులోకి పోతే మంచిదో తెలిసి యేడిస్తేగా!

"లా" డిగ్రీ తీసుకుని ప్రాక్టీసు ప్రారంభించిన తర్వాత గానీ ఈ వృత్తిలోని సాధకబాధకాలు అర్థంకాలేదు. అందులో ఈ వృత్తిలో అనుసరించవల్సిన కొన్ని పద్ధతు లంటే తనకి అసహ్యం. ఇది వెధవ పని. దీనికంటే పల్లెటూరిలో నాలుగెకరాలు పొలంవుంటే స్వంత వ్యవ సాయం చేసుకు బ్రతకటంలో సుఖం వుంది. కానీ ఆ భూమి అమ్మేసేగా చిన్నాన్న ఈ చదువు చదివించింది!

ఆలోచిస్తూన్న నారాయణరావుని ప్రేమగా చూస్తూ "నారాయణా" అన్న పిలుపు యెంతో తియ్యగా విన్పించి తలెత్తి చూశాడు.

"రాజేశ్వరి రావటం మనకి మంచిదేరా! అనూ పెళ్ళిని గురించి దిగులెందుకురా నాయనా!" అంటూ ధైర్యం చెప్తున్నారు.

మురళి గదిలో 'టీ' తాగుతూ కూర్చున్నాడు. తాతగారూ తండ్రీ మాట్లాడే మాటలు శ్రద్ధగా వింటూ న్నాడు. ఇంక వాళ్ళ సంభాషణ ఆగిపోయింది. మురళి ఆలోచనలు మరోవైపుకి మళ్ళాయి.

మొదటిసారి పల్లె వెళ్ళినప్పుడు ఒకరోజు యశోద—

"మురళీ బాబూ! ఇదిగో ఈ బాదం పప్పు నీ కిష్టంట కదూ" అంటూ గుప్పెడు పప్పులు కాయితంలో పోసి యిచ్చింది.

"చాలా బావుంటాయి యశోదమ్మా" అంటూ అన్నీ తినేసి చివరికి ఒక్కటి మాత్రం మిగిల్చి "మరి నీకో! యిది తిను" అంటూ యశోద గుప్పెట్లో పెట్టాడు. యశోద నవ్వుతూ "ఇదీ నువ్వే తినుబాబూ' అంటూ గట్టిగా ముద్దు పెట్టుకుంది. "ఛీ....ఛీ యెంగిలి" అంటూ తను బుగ్గని షర్టుతో తుడుచుకున్నది. అప్పుడప్పుడూ గుర్తు కొస్తూ వుంటుంది.

రాత్రిపూట దగ్గర కూర్చుని యెన్నెన్నో కథలూ కబుర్లూ చెప్తూ వుంటే, తనకి నిద్ర కళ్ళమీదకి వస్తూంటే యశోద నవ్వి లేవదీసి మంచం మీద పడుకోబెట్టి మంచం క్రింద కూర్చుని చెయ్యి తన వీపు మీద వేసి మెల్లగా తడుతూ సన్నని కంఠంతో "చిన్నికృష్ణా నిదురపో, నల్లనయ్యా నిదురపో" అని పాడేది.

"ఒకరోజు తను అడిగాడు!"

"యశోదమ్మా! నీకు శ్రీకృష్ణుడంటే యిష్టమా!" అని-

"మురళీధరుడంటే యిష్టంలేని వాళ్ళు వుంటారా?" అని యెదురు ప్రశ్న వేసింది. అంతే తనకి యెందుకో సిగ్గువేసింది. దుప్పటి ముఖం మీదకి లాగేసుకున్నాడు. యింత పెద్ద వాడైనా మురళికి ప్రతిరోజూ రాత్రి నిద్రపోయే సమయానికి యశోదపాడే ఆ పాట వినిపిస్తున్నట్లే వుంటుంది. ఆ పాట గుర్తుకి రాగానే ఆ పల్లెటూరూ సగం

పడిపోయిన పురాతనపు ఇల్లూ, చిక్కటి చీకటీ మినుకు మినుకుమనే నక్షత్రాలూ, ఆ ఇంటికి కాస్త దూరంగా వేపచెట్టు మీదనించి తెరలు తెరలుగా వీచేగాలీ, తన క్రాపులోకి వేళ్ళుపోనిచ్చి మెల్లగా నవ్వుతూ పాటపాడే యశోదమ్మా గుర్తుకొస్తూ వుంటారు.

ఈ జరిగిపోయిన సంఘటనలు గుర్తు కొస్తూంటే చాలా మధురంగా వుంటాయి. అయితే తను ప్రతి శలవుల్లోనూ యశోదమ్మ దగ్గరికి వెళ్ళడం, తల్లికి అసలు యిష్టంలేదనే సంగతి యిప్పుడిప్పుడే అర్థం చేసుకుంటున్నాడు మురళి. యశోదమ్మ అంత మంచిది కదా! మరి అమ్మకి యెందుకు కోపం

ఆలోచిస్తున్నాడు మురళి. యిది వరకు వచ్చే చుట్టాల తోనే విసిగిపోయే మురళికి మళ్ళీ ఈ రాజేశ్వరి యెవరు బాబూ అన్పిస్తోంది. వరుసకి 'అత్త' అవటం బాగానే వుంది. కానీ వీళ్ళెలాంటి మనుషులో. వాళ్ళంతా హైక్లాసు అంటుంది అమ్మ అప్పుడప్పుడూ 'వాళ్ళెన్నాళ్ళు వుంటారో! యింక చదువు సాగుతుందో లేదో! ఒక వైపు పరీక్షలు వచ్చి పడుతున్నాయి.'

అనుకుంటూ విసుగ్గా లేచి స్నానానికి వెళ్లాడు మురళి. తండ్రీ, తాతగారూ మాట్లాడుకునే మాటలు తనే కాదు అనూ కూడా శ్రద్ధగా వింటోందనేది గ్రహించిన మురళికి నవ్వొచ్చింది.

# 7

రాజేశ్వరీ, ఆమె భర్త ప్రసాదరావూ, పిల్లలతోనూ సామానుతోనూ వచ్చేశారు. నారాయణరావు చూపించిన ఇల్లు భార్యాభర్తలకు నచ్చింది. వెంటనే కొనేశారు. వారం రోజులు తమ్ముడింట్లో వుండి స్వంత ఇంట్లో గృహప్రవేశం ఆర్భాటంగా చేసి వెళ్ళిపోయారు.

రాజేశ్వరి కొడుకు గిరిధర్ తెల్లగా పొడుగ్గా అందంగా వుంటాడు.

'ఆఖరి సంవత్సరం మెకానికల్ ఇంజనీరింగ్' చదువుతున్నాడు. శలవులు కాగానే తిరిగి గిరిధర్ వెళ్ళిపోయాడు. అతను కాక మరిద్దరు ఆడపిల్లలు రాజేశ్వరమ్మకి. పెద్దమ్మాయి సునంద. నల్లగా పొడుగ్గా గుమ్మటంలా వుంటుంది. కానీ పాట అద్భుతంగా పాడుతుంది. యస్సెల్సీతోనే చదువు ఆపేసి ఇంట్లో కూర్చుంది. ఇంక రెండో అమ్మాయి ఈవూరు వచ్చి బి. ఎ. లో చేరాలని (కాలేజీలు తెరవగానే) ప్రయత్నం. ఇందిరకి అందానికి తోడు చలాకీతనం ఎక్కువ. ఎంతకొత్త వాళ్ళనైనా క్షణంలో పరిచయం చేసుకుని స్నేహం పెంచేసుకుంటుంది.

నెలరోజులన్నా కాకుండానే ఎందరినో స్నేహితులని సంపాదించేసింది. ఏవేవో ప్రోగ్రాములు అంటూ తిరుగుతోంది. ప్రసాదరావు ఆడపిల్లలకి చాలా స్వేచ్ఛ యిచ్చేశాడు. సునంద సామాన్యంగా ఒంటరిగా ఎప్పుడూ ఎక్కడికీ వెళ్ళదు. సినీ

మాలకైనా తల్లిదండ్రులతో అప్పుడప్పుడూ వెడుతుంది. అయితే ప్రతిరోజూ లైబ్రరీకి వెళ్ళి ఒక్కతనే స్వయంగా చూసుకుని తెచ్చుకుంటుంది. మంచి పుస్తకాలు కొనేయటం, వాటి భద్రంగా దాచుకొని చదవటం ఆ అమ్మాయికి చాలా సరదా.

తండ్రి ఇద్దరు కూతుళ్ళకీ సాటిగ ఖర్చులకిగాను యిచ్చే డబ్బు ఇందిర బట్టలకీ, టాయిలెట్ సామానులకీ యెంత ఆడంబరంగా ఖర్చుచేస్తుందో, సునంద ఆ డబ్బుని పుస్తకాల క్రింద ఖర్చు చేస్తుంది.

తల్లిదండ్రులు పిల్లల అలవాట్లనిదేన్నీ కాదనరు. గిరిధర్‌కి చెల్లాయిలిద్దరంటే ఎగని ప్రేమ. సునందకి తను అందంగా లేననీ ఆకర్షణీయంగా కన్పించననీ బాగా తెల్సు. లేని దాని కోసం బాధపడటం అనవసరమనీ తెల్సు.

కానీ ప్రసాదరావు కూతురికి లేని అందం డబ్బులో పూడ్చి, మంచి సంబంధం తెచ్చి ఘనంగా పెళ్ళి చేసేయాలని యెన్నో విధాల ప్రయత్నిస్తున్నాడు. యెందరెందరి పెళ్ళికొడుకులనో చూస్తున్నాడు.'

ఇప్పటికి మూడుసార్లు పెళ్ళి ఇంటర్వ్యూలైనాయి. మూడుసార్లూ సెలెక్టు కాలేకపోయింది సునంద. ఇలా అప్పుడే ఆరుతెలలు జరిగిపోయాయి. ఈ రోజూ ఓ పట్టభద్రుడైన పెళ్ళికొడుకు సునందని పెళ్ళిచూపులు చూసి వెళ్ళిపోయాడు. కనీసం సభ్యతకోసమైనా! 'ఉత్తరం రాస్తానెండి.' అని అయినా అనలేదని బాధపడిపోయింది సునంద. తన పెళ్ళి కుదరటం లేదని తల్లిదండ్రులు లోలోపల యెంత బాధపడిపోతున్నారో బాగా తెల్సు సునందకి. అయితే యేం చెప్పగలదు !

భగవంతుడు డబ్బునీ, మంచి తల్లిదండ్రులనీ ఇచ్చాడు. అయితే అనాకారితనంకూడా యిచ్చాడు. ఎక్కువ అందం లేకున్నా సామాన్యంగా వున్నా ఫర్వాలేదు. అంత అదృష్టం కూడా లేకపోయింది. పొట్టిగా లావుగా వుండటం తండ్రివారసత్వం.

"ఖర్మ అత్తపోలిక రాకుంటే నా పోలిక రాకూడదూ" అని వాపోతూ వుంటుంది రాజేశ్వరి.

సునందకీ అందంగా తెల్లగా సన్నగా పొడుగ్గా పాలరాతి శిల్పంలా వుండాలని అనిపిస్తుంది. అలా ఎందుకు సృష్టించ లేదా అని భగవంతుడిమీద ఎన్నోసార్లు కోపం తెచ్చుకుని ఎన్నో రాత్రులు ఏడ్చిఏడ్చి సొమ్మసిల్లి పడిపోయేది. ఒకే తల్లి బిడ్డలు అయినా, అన్నయ్యకీ చెల్లాయికీ యిచ్చిన రూపం నాకెందుకివ్వలేదా అని వ్యథపడింది. ఆ వ్యథవల్ల కలిగే ప్రయోజనం శూన్యం అని తెల్సుకున్న మరుక్షణం నుంచియింక ఆ విషయం ఆలోచించటం మానేసింది సునంద. యింక మనస్సు తేలికైంది. ఇప్పుడెప్పుడు చూసినా సునంద చిరునవ్వుతోనే గడిపేస్తోంది రోజులు.

ప్రసాదరావు రిటైరై పోవటంతో ఆర్థిక ఇబ్బందులు అంతగా లేకపోవటంతో, ఇక్కడికి వచ్చింతర్వాత పురాణాలూ, హరికథలూ, 'గీతాపారాయణా' అంటూ సత్కాలక్షేపం చేస్తున్నాడు. రాజేశ్వరమ్మ అంతే. వాళ్ళిదరికీ ఒక్కటే దిగులు పెద్ద ఆడపిల్ల పెళ్ళి చేయలేకపోతున్నామే అని. మెల్లగా తమరికి తమరే నచ్చచెప్పుకుంటారు.

"దేనికైనా టైమురావాలి. మన ప్రయత్నంవల్ల యేం ప్రయోజనం" అని—

రాజేశ్వరమ్మ 'గీత' వినటానికి దేవాలయానికి ప్రసాదరావు బజారుకి వెళ్లాడు. ఇందిర స్నేహితులతో 'మ్యాట్నీ'కి వెళ్ళింది. సునంద ఒక్కర్తీ ఇంటిముందున్న చిన్న తోటలో కూర్చుని పుస్తకం పట్టుకుంది. కానీ ఆ నవల తల కెక్కటంలేదు. మనస్సు యెక్కడెక్కడికో పరుగుతీస్తోంది. మురళి ప్రహరీ గేటు తీసుకుని లోపలికి రావటం కూడా గమ నించలేదు. రెండు నిమిషాలు అలాగే నిల్చి "సునందా !" అన్నాడు మెల్లగా. సునంద ఉలిక్కిపడి తలతిప్పింది. "ఓ ! నువ్వా! రా బావా!" అంటూ దగ్గరున్న మరో కుర్చీ అతని దగ్గరికి జరిపింది.

సునంద మురళిని 'బావా' అంటూ పిలుస్తుంది. అలా పిలవటం మురళికి నచ్చదు. పైగా యేదో చేదుతింటున్నట్లు వుంటుంది. రాత్రిలో ఒకసారి "నన్ను అలా బావా అని పిల వద్దు నాకు నచ్చదు. మురళీ అని పిలు" అన్నాడుకూడా. అయినా సునంద తన అలవాటుని మార్చుకోలేదు. పైగా—

"నాకు నిన్ను 'బావా' అని పిలిస్తేనే యెంతో బాగుంటుంది" అంది.

మురళి మాట్లాడలేదు. ఇంక సునంద ముఖం చిన్న బుచ్చుకుని "పోనీలే మానేస్తాను సరేనా" అంది.

"ఓహో! నీకు అంత తృప్తిగా అన్పిస్తే పోనీ అలాగే పిలువు" అనేశాడు.

అంతే అప్పటినించీ ఈ 'బావా' అనే పిలుపు అలవాటు

అయిపోవటమేకాదు చెవులకి యెంతో యింపుగా విన్పిస్తూ వుం
టుంది."

సునంద రూపం మాసుకేస్తున్నా గొంతు మంచిదని త్వర
లోనే గుర్తించేశాడు మురళి. యెంతో తియ్యగా యెన్నెన్నో
కబుర్లు చెప్తుంది. సునంద కబుర్లంటే చాలా యిష్టం. అందుకే
మురళి అప్పుడప్పుడూ యిలా మేనత్త యింటికి రావటం అల
వాటు చేసుకున్నాడు. రోజుకో రకంగా 'డ్రెస్' అయి తిరిగే
ఇందిర అంటే అసలు గిట్టదు మురళికి. ఆ అమ్మాయితో సాధ్య
మైనంత క్లుప్తంగా మాట్లాడతాడు. ఇందిర కిది నచ్చదు.

"సునందా! ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది యెవ్వరూ లేరూ"
అంటూ కుర్చీలో కూర్చున్నాడు. ఎవరెవరు యే పనిమీద
బైటకి వెళ్ళింది సవివరంగా చెప్పింది సునంద.

"అయితే ఇందిరతో నువ్వూ సినిమాకి వెళ్ళలేదేం"

"అలవాటులేదు' అదీ కాక అది స్నేహితులతో కలిసి
వెళ్ళింది" సునంద చేతిలోని పుస్తకం మూసేస్తూ అంది. మురళి
ఈరోజు సునంద అలంకరణ ప్రత్యేకంగా కన్పించి ఆసక్తిగా
చూశాడు. ఆకాశం నీలం రంగు జరీ బార్డరు చీరే, అదే రంగు
జాకెట్టూ, మెడలో లాకెట్టుచెయిను చెవులకి పెద్దవే రింగులూ,
చేతులకి రెండు జతల బంగారు గాజులూ, తలలో పెట్టుకున్న
కనకాంబరాల మాల సగం వాడి కుడి భుజంమీద నుంచి
ముందుకు పడుతూంది. చల్లటి గాలికి చెదరిన ముంగురులు
ముఖం మీదకి పడుతూంటే అదో విధమైన ఆకర్షణ కల్గిస్తోంది.
నల్లని బుగ్గలు గుండ్రంగా వున్నాయి. అసలు సునంద ప్రతి

రోజూ ఇలా ముస్తాబులో వుండదు. ఎక్కువగా తెల్లటి ప్రింటెడ్ చీరెలు లైట్ కలర్ చీరె కట్టుకుంటుంది. నగలంటే అసలు ఇష్టం వుండదు. అందుకే పెట్టుకోదు. నారాటి జడని పెద్ద రిబ్బనుతో ముడివేసి నగానికి మడిచి కట్టేస్తుంది. అంత సింపుల్‌గా వుండే సునంద ఈ రోజు ఇంతగా ముస్తాబు అవడం ఆశ్చర్య పరచి సునందని పరీక్షగా చూస్తున్నాడు.

"మంచినీళ్ళు కావాలా!" అంటూ జవాబు వినకుండానే చేతిలోని పుస్తకం అక్కడే పడేసి లోపలికి వెళ్ళింది సునంద.

ఆ పుస్తకం అందుకుని పుటలు తిరిగేస్తూండగానే సునంద ప్లేటులో టిఫెనూ, గ్లాసుతో మంచి నీళ్ళూ తీసుకొచ్చింది.

"ఏమిటి! మంచినీళ్ళు తెస్తానని ఫలహారం కూడా తెచ్చావు. ఏమైనా విశేష వార్త చెప్తావా!" ప్లేటు అందుకుంటూ అడిగాడు.

"తినటం కోసమే ఇవన్నీ చేసింది అంతే!"

"నీవు?"

"వు....హూ....తినే ఓపికలేదు।

"పోనివ్వు కానీ విషయమేమిటో చెప్పలేదు."

"ఇంకా అర్థం కాలేదూ పెళ్ళి చూపులు! చూసీ చూడగానే ముఖం తిప్పేశాడు. నాన్నగారు పది వేలు కట్నం ఇస్తా, స్కూటరిస్తా అని యెన్ని చెప్పినా వెనక్కి తిరిగి చూడకుండా పారిపోయాడు ఆ పెళ్ళి కొడుకు."

"ఓ! ఇలా జరిగిందా! వెరీ సారీ సునందా"

నొచ్చుకుంటూ ఫలహారం ప్లేటు అలాగే పట్టుకుని బాధగా అన్నాడు.

మరేం ఫర్వాలేదు".

"నీ మనస్సుకి బాధ కల్గించే విషయం తెలియక గుర్తు ....చేసి...."

"అ....ఆ....నీ వలా నొచ్చుకోవద్దు. నే అలవాటు పడి పోయాను. నేనేం బాధపడను కూడా. ఇంక ఆ విషయం వది లేద్దాం మురళీ! టిఫిను తింటూ కబుర్లు చెప్పు."

"తిన బుద్ధి కావటంలేదు. పోనీ ఒకటి నా కోసమైనా తీసుకో ఇంద" అంటూ మైసూర్‌పాక్ ముక్క ఇచ్చి తను తింటూన్నాడు.

సునంద ఆ ముక్క చేత్తో అలాగే పట్టుకుని మురళిని చూస్తూ—

"నే నీ రోజు నీ కోసం యెంతగానో యెదురు చూస్తూ న్నాను. తొస్సేపు కబుర్లు చెప్పు. కాఫీ తాగి వెడుదువుగాని. కానీ... బావా నిన్నో విషయం అడగనా!"

"ఓ యస్ అడుగు. రహస్యమైనా జవాబు చెప్పేస్తాను."

"నా కంటే ఇంకా స్త పెద్దవాడివై వుంటే యెంత బాగుం డును అన్పిస్తుంది."

"ఏం! అలా యెందుకంటూన్నావు"

"నాకు తెలియదు. కానీ ఈ రోజు అలా అన్పిస్తోంది. అంతే"

"నోనో! సునందా! అలా జరిగి వుంటే ఓ మంచి స్నేహితురాలిని పోగొట్టుకునేవాడిని. నీ దగ్గర యింత స్వతంత్రం నా కుండేదికాదు. నిజంగా చెప్తున్నాను. సునందా నువ్వంటే నాకు చాలా యిష్టం. మనస్సులోని విషయం మరెవ్వరితోనూ చెప్పలేకున్నా నీతో చెప్పగలను. నీతో కబుర్లు చెప్పి ఇంటి కెడితే యెంతో హాయిగా వుంటుంది. రాత్రి రెండింటి వరకూ కూడా చదువు కోగల్గిన శక్తి వస్తుంది. మనయిద్దరి ఈ స్నేహం నా కెంతో అపురూపంగా అన్పిస్తుంది సునందా! బాంధవ్యం అసలు గుర్తేరాదు. మరి నీకు?"

"నాకు ...మాటల్లో చెప్పటంరాదు మురళీ! నా కసలు నిజమైన స్నేహితుడివి నువ్వు ఒక్కడివే" సునంద కంఠంలో బాధతో కూడుకున్న తృప్తి ధ్వనించింది.

"నిజంగానా సునందా"

"నిజం మురళీ! అసలు నా జీవితమే ఒక చేదు నిజం."

సునంద గడ్డం కింద చెయ్యి పెట్టుకుని విషాదంగా నవ్వింది.

మురళి టిఫిను ఎలాగో తిని ప్లేటు కింద పెట్టేశాడు. ఇంతలో రాజేశ్వరమ్మ దేవాలయం నించి వచ్చేసింది. మేనల్లుడిని పలకరిస్తూ—

"మురళీ! యెంతసేపయింది వచ్చి. సునందా బావకి కాఫీ టిఫెనూ యిచ్చావామ్మా" అంటూ కూర్చుంది.

"టిఫిను పెట్టాను కానీ కాఫీ యివ్వలేదమ్మా. తెస్తాను" అంటూ లోపలికి వెళ్ళింది. లోపలికి వెళ్ళే కూతుర్ని వెనగ్గా చూస్తూ నిట్టూర్చింది రాజేశ్వరి.

"అత్తయ్యా! గీతోపదేశం యెంతవరకూ వచ్చింది" అన్నాడు నవ్వుతూ.—

పిల్లకాకులు మీకేం తెలుస్తుందిరా జీవితంలో బాధ్యతలూ బరువులూ! అవి మోయటానికి యెంత సహనం కావాలీ యెంత శక్తి కావాలి! అవి తగ్గిపోతుంటే ఈ వేదాంతం వింటూ కర్తవ్య నిర్వహణకి శక్తిని కూర్చుకుంటాం మాలాంటి వయస్సు మళ్ళిన వాళ్ళం" అంటూ నిర్లిప్తంగా నవ్వింది.

"నిజమే! వేదాంతం సంగతలావుంచి యిప్పుడు నీ వన్న మాటల్లోని సారమే నా కర్థం కాలేదు." అంటూ నవ్వాడు.

"పోనివ్వగానీ తాతయ్య ఈ మధ్య పల్లె నుంచి రానే లేదుగా"

"రాలేదత్తయ్యా"

సునంద కాఫీ తెచ్చింది. అది తాగేసి నేనింక వెళ్ళి వస్తానని చెప్పి ఇంటికి బయలుదేరాడు మురళి. కానీదారిలో మళ్ళీ మళ్ళీ సునంద అన్నమాట గుర్తు కొస్తోంది.

"బావా! నాకంటే యింకాస్త పెద్దవాడివై వుంటే బాగుం డేది."

అనటంలో సునంద ప్రవేశ్యం యేమై వుంటుంది! అప్పుడు నా బుర్ర సరిగా పని చెయ్యలేదు—ఏదేదో చెప్పేశాను. కానీ అసలు ఆ మాటల అర్థం లోతుగా ఆలోచించనేలేదు.

ఆలోచనల్లో తేలిపోతూ ఇలు చేరాడు మురళి.

# 8

సంపూర్ణా! నువ్వు సాక్షాత్తూ ఆ అన్నపూర్ణవే నమ్మా. నీ చేతి వంట తింటూ వుంటే "జిహ్వ" లేచి వస్తోందనుకో! యేంరుచీ యేంరుచీ! ఆ గుత్తి వంకాయ కూరలో అమృతమే పోసి వండినట్లుంది. సంపూర్ణా ఒక మాట చెప్తాను సరిగ్గా విను. నేను అంటున్నా అనుకున్నట్టుగా అనేటు పొట్టపడనే అనుకో. వచ్చిన ప్రతిసారి మీ ఇంటికే వస్తాననుకో! అసలెందుకు వస్తానంటావూ! ఈ పట్నంలో ఇంతమంది చుట్టాలు వుండగా నిన్నా నీ యింటికే యెందుకు వెతుక్కుంటూ వస్తానంటే నీకు బంధుప్రీతి యెక్కువ గనక. నా లాంటి పెద్ద వాళ్ళంటే గౌరవం గనక. యింకా నాకు దగ్గర చుట్టాలువున్నారు. యెందుకూ. వాళ్ళిళ్ళకి వెడితే మనుషులని చూడగానే దెయ్యాలని చూసినట్లు ముఖం పెడతారు.

ఇల్లూవాకిలీ వదిలి వీరిళ్ళల్లోనే తిష్టవేసి, కేవలం వీరి ఇంటి మీదపడి తినేందుకే వచ్చాం అనుకుంటారు. యింక వీళ్ళ

పిల్లలున్నారు చూశావూ ఈ తరం పిల్లలు చాలా అసహ్యంగా ప్రవర్తిస్తారు.

"ఇవేం సత్రాలా!" అంటూ జోక్ చేస్తారు. అయినా నాకు తెలియకడుగుతా ఇల్లన్న తర్వాత అతిథీ అభ్యాగతీ ఎవ్వరూరాకుండా ఎలా వుంటారమ్మా. అసలు రోజుల్లో బంధు ప్రేమ ఎవరికేడిసింది. నూటికీ కోటికీ వుండే నీ లాంటి అన్నపూర్ణ తల్లులకి తప్ప. ఏదీ గుత్తి వంకాయలు మరో రెండు వెయ్యి. అన్నట్లు మురళి, అనూ కూడా ఈ కూరం తింటారా!

వాళ్ళకి యిప్పన్నీ తినటం నేర్పాలి. ఈ సారి ఈ మువ్వ వంకాయలూ పొట్లకాయలూ తప్ప పెరట్లో మరే కూరాకాయటం లేదు. లేకుంటే ఇంకా తెచ్చేవాడిని. ఆ....చాలు చాలు. అసలు నీ ఆత్మీయతకే నా కడుపు నిండిపోతుంది. అసలు మీ దంపతులని చూస్తూంటేనే నా కెంతో ముచ్చటగా వుంటుంది.

అన్యోన్య దాంపత్యం జన్మ జన్మల పుణ్యం. అది అందరికీ లభ్యం కాదమ్మా"

ఇంకా ఆయన మాటలు విన్పిస్తూనేవున్నాయి. వాకిట్లో అడుగు పెట్టిన మురళికి. కాలేజీనుంచి తిరిగి షికారు కంటూ బైట కెళ్ళి ఎనిమిదింటికి ఇల్లు చేరటం బాగా అలవాటు. ఈ రోజు అలా తిరిగి వచ్చేసరికి లోపలినుంచి ఆ మాటలన్నీ విన్పించి విసుగ్గా ముఖం పెట్టుకుని అనుకున్నాడు.

"అబ్బ! వచ్చాడూ పిలక తాతయ్య. ఇంక ఇంట్లో యెవ రికీ చదువుసాగదు. నిద్రాపట్టదు. అనుకుంటూ చదువుల గదిలోకి వెళ్ళాడు. అప్పటికే అనూరాధ గ్లాసు పుస్తకం పట్టుకుని టేబుల్ లైటు దగ్గర కూర్చుంది. కానీ రోడు స్పీకరులోనించి వినిపిస్తు న్నట్లున్న పిలక తాతయ్య గొంతు చెవులు చిల్లులు పడేలా చేస్తోంది.

"రేపు పరీక్ష ఎలా!" అని తలపట్టుకు కూర్చుంది.

మురళి లోపలి కొచ్చి బట్టలు మార్చుకుంటూ వుంటే "అన్నయ్యా" అంది దిగులుగా. "వూ! ఈ పిలక తాతయ్య ఒక్కడేనా! మరింకా దిగారా చుట్టాలు" లుంగీ కట్టుకుంటూ అడి గాడు మురళి.

"ఈయన రాకముందే కాపుకు పిన్నిట మెవరో ఆవిడ దిగింది రిక్షా. అమ్మకసలే ఇవాళ ఆరోగ్యం బాగాలేదు. రిక్షా దిగిందో లేదో వెంట తెచ్చిన పెద్దమూటెడుబట్టలు మైలపడాయనీ తడిపిపడేసింది. ఇంట్లో పట్టి వుంచిన నీళ్ళన్నీ పారబోసేసింది. పాతిక బక్కెట్లు స్నానం చేసింది. అయినా పూర్తిగా స్నానం కాలేదుట. కుళాయిపోయింది.

యింక తిట్ల పంచాంగం విప్పింది. చేతగానిచవట గవర్న మెంటునీ, నీళ్ళు కూడా సరిగా సప్లై చెయ్యలేని మున్సిపాలిటీనీ, ఓ నుయ్యి అయినా తవ్వించని ఇంటి వారినీ ఇలాంటి వెధవ ఇంట్లో పదిహేనేళ్ళుగా అద్దెకుంటూన్న నాన్నగార్నీ దుమ్మెత్తి పోసింది. అబ్బ ...బోర్....యమబోర్‌గా వుంది ఈవిడ వ్యవ హారం. చెవుల్లో వేళ్ళు పెట్టుకుని ఈ గదిలో దాక్కున్నా ఆవిడ

గొంతు విన్పిస్తూనే వుంటుంది. ఈ బాధ చాలదన్నట్లు పిలక తాతయ్య కూడా దిగాడు. భగవాన్ ఏదిదారి"

అనూరాధ నీరసంగా కుర్చీ వెనక్కి వాలింది. "ఛీ ఛీ యేంచుట్టాలో ప్రాణాలు తీస్తూన్నారు. పట్టుమని పది రోజులన్నా నాన్నారూ, అమ్మా, మనిద్దరం వుండలేదు. యెప్పుడూ వచ్చే వాళ్ళూ పోయే వాళ్ళూ అబ్బబ్బా అసలు వీళ్ళిద్దరి వరసా చూస్తూంటే ఇప్పుడప్పుడే కదిలేలా లేదు. మనమేదైనా వుపాయం ఆలోచించి వీళ్ళని సాగనంపేలా చూడాలి"

"నిజమే నీవన్నది. కాని యెలాఅనూ...."తీవ్రంగా ఆలోచిస్తూ యిటూ అటూ పచార్లు చేస్తూన్నాడు మురళి. అనూ కూడా ఆలోచిసోంది.

"ఆ! తట్టింది. చెల్లాయ్....ఓ రాత్రివేళ వీళ్ళిద్దరి మూటా ముల్లా గోడవతల గిరాటు కొడతాను. అదెవరో యెత్తుకు చక్కాపోతారు. యిద్దరూ కుయ్యో మొర్రో అంటూ యేడ్చి వచ్చిన దారినే వెతుక్కుంటూ పోతారు. ఎలా వుంది నా ఐడియా"

"బ్రహ్మాండంగా వుంది .. కానీ....ఈ విషయంగాని మనం చేసినట్లు అమ్మకీ నాన్నగారికీ తెలిసిందా! కొంప మునుగుతుంది."

"నిజమే...."మురళి మరో అయిడియా ఆలోచిస్తూన్నాడు విప్పిన షర్టు అలా చేత్తో పట్టుకునే.

అనూరాధకి అన్నగారంటే నాలుగో ప్రాణం. యేపనైనా త్వరపడి నెత్తికి తెచ్చుకుంటాడేమో అని భయపడిపోతుంది. అందుకే అన్నగారు యే సలహా అడిగినా దూరం ఆలోచించి మరీ తన అభిప్రాయం చెప్తుంది.

మురళికి కూడా ఏ పని చెయ్యాలన్నా ముందు చెల్లాయికి చెప్పటం బాగా అలవాటు. ఒకవేళ యెప్పుడన్నా ఏదైనా చేసినా వెంటనే చెప్పేస్తేగానీ తృప్తివుండదు. అన్నాచెల్లెలూ ఇలా యెంత అన్యోన్యంగా వున్నా అప్పుడప్పుడూ దెబ్బలాడుకోకుండా వుంటారనేది అబద్ధం. వీళ్ళిద్దరికీ సామాన్యంగా తగూ వచ్చేది ట్రాన్సిస్టర్‌లో హిందీ పాటలు వినాలన్నప్పుడు, ఇంగ్లీషు మాట్నీలు చూడాలన్నప్పుడు.

అన్నపూర్ణమ్మా, నారాయణరావూ ఇంగ్లీషు సినీమాలు చూడరు. ఇంక అనూని మురళి తీసుకు వెళ్ళవల్సిందే. తనని తీసుకు వెళ్ళకుండా అన్నగారు వెడితే అనూ చాలా గోలచేస్తుంది మురళి విసుక్కున్నా, అన్నపూర్ణమ్మ మందలిస్తుంది కొడుకుని. "ఒక్కగాను ఒక చెల్లెలు. తీసుకువెళ్ళరా" అని—

రద్దీగా వుండే సిటీబస్‌లూ కొల్లేటి చాంతాడంతటి సినీమా క్యూల్లో చెల్లెలు వెంటవుంటే మురళికి చికాకు. అనూ రద్దీగా వున్న బస్ యెక్కినప్పుడు యే కుర్రాడన్నా కాస్త దగ్గరగా వెడితే చాలు. మురళికి కళ్ళు యెర్రబడి రక్తం వుడుకెత్తిపోయి ఆ కుర్రాడితో తగూకి దిగి షర్టులు చింపుకున్న సంఘటనలు

చాలానే వున్నాయి. అయితే అనూని వెంట తీసుకువెడితే ఒక్కొక్కప్పుడు కాస్త వుపయోగమూ వుంది. క్యూ (ఆడ వాళ్ళ) లోనించి త్వరగా యిద్దరికీ టిక్కెట్లు తెచ్చే చెల్లాయి అంటే ఆకాస్సేపూ సంతోషపడిపోతాడు. ఆ జనంలో తోపు లాటలో తను నలిగిపోనక్కరలేదు———

ఇంటర్వెల్‌లో అనూరాధ అన్నయ్యా! కోకోకోలా! అనీ, చిప్స్ అని అడిగితే విసుగే. ఆ సినిమా హాల్లో స్నేహితు లెవ రన్నా కన్పిస్తే అనూని పరీక్షగా చూసి ముఖం అదోమాదిరిగా పెడతారు. 'గర్ల్ ఫ్రెండా' అన్నట్లు. ఆ కాస్త క్షణాల్లోనే వాళ్ళ కళ్ళలో అసూయ ప్రతిఫలిస్తుంది. మురళికి వళ్ళంతా "భగ్" మంటుంది. అయినా దాన్ని మింగేస్తూ వాళ్ళని తనే విష్ చేసి "మా సిస్టర్ అనూరాధ" అంటూ పరిచయం చేస్తాడు. అప్పుడా ఫ్రెండ్ ముఖం నల్లబడి అంతలోనే మామూలుగా అయి———

"ఈజిట్! ఓస్ సిస్టర్.....నమస్తే మిస్ అనూరాధా" అంటూ పరిచయం చేసుకుంటూవుంటే అనూ బొమ్మలా అన్న ప్రక్కన నిలబడి "నమస్తే" అంటుంది అందంగా చేతులు జోడించి. అయితే వాళ్ళ ఈ పరిచయాన్ని పెంచుకోవటానికి ప్రయత్నిస్తూంటే మరీ చిటపట మంటుంది. మురళి ముఖం.

ఒకసారి ఇలాగే అనూని వెంట తీసుకుని ఇంగ్లీషు మాట్నీకి వెళ్ళాడు. చాలా రద్దీగా వుంది. అనూ క్యూలో నిల్చుంది.

మురళి పాంటు జేబులో చేతులు పెట్టుకుని యిటూ అటూ పచార్లు చేస్తున్నాడు. ఓ ఫ్రెండ్ మురళి దగ్గర కొచ్చి "మురళీ ధర్ మీ సిస్టర్‌ని నాకూ ఓటికెట్ తీసుకోమని చెప్పవూ" అంటూ "ప్లీస్" అంటూ రిక్వెస్టు చేస్తూంటే కాదని యెలా చెప్పగలడు. టికెట్టు తీసుకుని యివ్వటంతో ఆ పరిచయం ఆగిపోదే. ఒకే చోట కూర్చోవటం సినిమా మీద కామెంట్ చేస్తూ కబుర్లలో దిగడం యిదంతా నచ్చదు మురళికి. అందరూ ఇలా చెయ్యరు అని మురళికీ తెల్సు—

"ఓ మురళిధర్ ఈ అమ్మాయి మీ సిస్టరా! యేం చదువు తోంది."

అంటూ మర్యాదగా అడుగుతూంటే మురళికి గర్వంగా వుంటుంది. అప్పుడు అనూని గురించి గడగడా చెప్పేస్తాడు గొప్పగా. అసలు అన్నగారు సినీమా విషయం వచ్చేసరికి యెంత విసుక్కున్నా అనూరాధ కోపం తెచ్చుకోదు. పైగా ఆ కాస్సేపూ యెంతో వినయ విధేయతలని ప్రదర్శిస్తుంది.

మురళికి తెల్సు. ఇదంతా దొంగ నాటకమనీ మాట్నీ నించి రాగానే సమాప్తం అయిపోతుందనీ. అందుకే మరీ బెది రిస్తూ వుంటాడు.

ఒకసారి అన్నా చెల్లెలూ మొదటి ఆట సినీమా చూశారు. రాత్రి తొమ్మిదిన్నర దాటింది. యెంతసేపు నిల్చున్నా

బస్ దొరకలేదు. ఆఖరికి యెలాగో రష్‌గా వున్న బస్‌ని లేడీస్ సైడునుంచి చెల్లెలిని యెక్కమని తను యెలాగో యెక్కేశాడు. మురళి.... రెండు స్టాపింగ్‌లు దాటిం తర్వాతగానీ కాస్త రష్ తగ్గలేదు, చెల్లెలి కోసం వెతుక్కున్నాడు. అనూ కన్పించలేదు.

"క్షణం గుండె కొట్టుకొంది. బస్ అంతా వెతుక్కుంటూ ప్రతి ఆడపిల్ల ముఖంలోకీ పరీక్షిస్తూంటే అమ్మాయిలు ముఖం గంటుపెట్టుకుంటూన్నారు. మరి కొందరు పురిమిచూశారు. మరి కొందరు సణుక్కుంటూంటే మురళికి వళ్ళు మండింది."

మీ ముఖా లెవరిక్కావాలి! మా చెల్లాయి కోసం నేయేడుస్తూంటే అనుకుంటూ బస్ ఆగగానే మళ్ళీ వెనక్కి వెళ్ళటానికి బస్ కోసం చూశాడు. కానీ దొరకలేదు. ఆటో అన్నా, టాక్సీ అన్నా మాట్లాడు కుందాం అంటే జేబులో యెక్కువ డబ్బులేదు అప్పటికీ పది గంటలు కావస్తోంది. అనూ వంటరిగా యేమయిపోయిందో అనే భయం తర్వాత యేమన్నా కానివ్వు అని ఆటో చేసుకుని వెళ్ళి పోయాడు.

అప్పటికే వర్షం ప్రారంభమయింది. సినిమా హాలు దగ్గరే వున్న బస్ స్టాపులో అనూరాధ కళ్ళనీళ్ళు తిరుగుతూంటే బిక్క ముఖం వేసుకుని గోళ్ళు కొరుకుతూ అర అంగుళం కూడా కదలకుండా వణుకుతూ నిల్చుంది.

అప్పటికే అనూ అలా వంటరిగా నిలబడిపోవటం చూసిన

ఇద్దరు కుర్రాళ్ళు ఈల పాటపాడుతూ యిటూ అటూ పచార్లు చేస్తున్నట్లు నటిస్తూ "యెక్కడికి వెళ్ళాలి" అంటూన్నారు. అనూకి పళ్ళంతా చెమటలు పట్టేస్తున్నాయి. అన్నయ్యని మనస్సులో తిట్టుకుంటూ వెంటనే తిరిగి వచ్చేలా చేయి భగవంతుడా అని దేవుడికి యెన్నో మొక్కులు మొక్కుతోంది. నే బస్‌లో లేనని గ్రహించిన తక్షణం అన్నయ్య బస్ వురికి మరీ వెనక్కి వచ్చేస్తాడు. అనే ధైర్యంతో నిల్చుంది. ఆ రష్‌లో బస్ యెక్క లేక పోయింది.

తన చాతకాని తనానికి ఇంటికి వెళ్ళింతర్వాత అన్నయ్య చేత యెన్ని చివాట్లు తినాలో అని భయపడిపోతోంది. అన్నతో యెన్నిసార్లు సినిమాకి రాలేదు. యెప్పుడూ యిలా జరగలేదు. ఖర్మ యిప్పుడే యిలా జరగాలి! లేచి యెవరి ముఖం చూశానో! అనుకుంటుంటే మరీ భయం వేస్తోంది.

ఇంతలో ఆటోలో వేగంగా వచ్చేసిన అన్నగార్ని చూసి "అన్నయ్యా" అంటూ గట్టిగా కౌగలించుకుని ఏడుపు మంది.

మురళికి కూడా కళ్ళలో నీళ్ళు తిరిగాయి. అప్పటివరకూ అనూని 'వహవా' కాసే కుర్రాళ్ళు దూరంగా వెళ్ళి నిల్చుని తమాషాగా చూస్తూన్నారు.

"సరేలే....మ్మా....పదపోదాం" అంటూ అనునయంగా దగ్గరికి తీసుకుని ఆటో యెక్కించి తనూ ప్రక్కన కూర్చున

పోనిమ్మన్నాడు. ఆటో వేగంగా వెడుతోంది. వర్షం మరీ పెద్ద దైంది. యిప్పుడింక చెల్లెలి మీద జాలిపోయి కోపం ముంచు కొచ్చేసింది. సిటీ బస్ యెక్క లేదిన్నాళ్ళ బట్టీ పట్నంలోపుండీ.

"ఛీ....ఛీ" అంటూ ధూంధాం మొదలెట్టాడు. ఇంక జన్మలో నా వెంట సినీమాకి తీసుకు వెళ్ళను. యిదిగో అసూ ఈ విషయం ఇంట్లో అమ్మకి గానీ, నాన్నగారికి గానీ చెప్తావా! జాగ్రత్త నా అసమర్థత అంటూ నాన్నారు అర్ధగంట పుపన్యాసం యిస్తారు. నా కలాంటివి వినాలంటే పళ్ళు మంట తెల్సుగా నీకు అమ్మకీ చెప్పద్దు. అమ్మయో అని హడలిపోయి నన్ను తిట్టే స్తుంది. అవన్నీ సరే ముంది ఆటోకి డబ్బు యివ్వటం యెలా, అమ్మని అడిగితే అసలు విషయం బయటి కొస్తుంది. మరి యెలా".

మురళి తీవ్రంగా ఆలోచిస్తూ అన్నాడు.

నా దగ్గర మూడు రూపాయలున్నాయి అన్నయ్యా! కానీ అవి అమ్మ బీరువాలో దాచానే! ఎలా!" అంది తలగోక్కుంటూ-

"ఏడవలేకపోయావ్! నీ వెధవ తెలివి తక్కువ వల్ల నాకు చివాట్లు అదిగో ఇల్లు వచ్చేసింది. నేనిక్కడేపుంటాను. నీ వెలాగో వెళ్ళి ఆ డబ్బు పట్టుకురా త్వరగా! బహుశా అమ్మ నిద్రపోతూ పుంటుంది. నాన్నారింకా ఆఫీసు రూములో ఫైల్సు చూసుకుంటూన్నారులా పుంది. లైటు వెలుగుతూ పుంది.

"నీ దగ్గర అసలు యేంలేదా అన్నాడు!"

"లేకేం వుంది. దాని రూపాయి సరిపోదు. పో త్వరగా" మురళి ఆటో దిగి అక్కడే నిల్చున్నాడు. అనూ లోపలికి వెళ్ళి అయిదు నిమిషాల తర్వాత డబ్బు తెచ్చి యిచ్చింది. అమ్మయ్య ఈరోజు నాన్నారితో యెంత గొడవ జరిగేదో! తప్పింది.

అనుకుంటూ ఇంట్లోకి వచ్చాడు. అన్నపూర్ణమ్మ పడుకునే—

"ఇంత ఆలశ్యం అయిందేరానాయనా" అంది.

'బస్సులు అందలేదమ్మా" ఇద్దరూ ఒకేసారి అన్నారు.

"యేం బస్‌లో యేమో సరే కాళ్ళు కడుక్కుని బట్టలు మార్చుకోండి. అన్నం పెడతాను" అంది లేవకుండానే.

"నువ్వు పడుకో అమ్మా! అన్నయ్యా, నేనూ అన్నం తినేసితలుపులన్నీ వేసేస్తాం" అనూరాధ అని బాత్‌రూములోకి వెళ్ళింది.

"అనూ సుద్ధ మొద్దురాయి. అనుకున్న మురళికి మనస్సులో చెల్లెలంటే ప్రేమ పొంగి పొర్లింది. భోజనం చేస్తూ తల్లి యిద్దరికీ అని వుంచిన పెరుగు ప్రతి రోజూ సగానికి పైగా తనే వంపేసుకునే మురళి ఇవాళ అనూకి యెక్కువవేసి తను

మజ్జిగ పోసుకుని లేచాడు. ఇద్దరూ అన్నీ సర్దేసి తమ గదిలోకి వచ్చేశారు. అనూరాధ ఆవులిస్తూ తన మంచం మీద పడుకుంది.

"మురళి చెల్లెలి మంచం మీదకి వచ్చి కూర్చుని" అనూ! ఇవాళ చాలా పెద్ద ప్రమాదమే తప్పింది కదూ! నాకు చాలాభయం వేసింది. నువ్వసలు బస్ యెక్కలేక పోయివుంటా వనే అనుకోలేదు. అందులో రాత్రి సమయం. చాలా అదృష్ట వంతులం.

"ఇంకెప్పుడూ యిలా జరగదులేమ్మా! నిశ్చింతగా నిద్రపో" చెల్లెలికి మెడవరకూ దుప్పటికప్పి తను చదువుకోవ టానికి టేబుల్ దగ్గర కూర్చున్నాడు. కానీ చదువు తలకెక్కేలా లేదు. 'లాభంలేదు' అనుకుని లైటు తీయబోతూ చెల్లెలివైపు చూశాడు. అనూ నిశ్చింతగా నిద్రపోతోంది.

లైటుతీసి తన మంచం మీద కొచ్చి కళ్ళు మూసుకు పడుకున్నాడు. చాలా ఆలశ్యంగా నిద్ర పట్టింది కానీ ఆ నిద్రలో యేవో కలలు.

అనూరాధ సినిమా హాలు దగ్గర ఒంటరిగా వర్షంలో తడుస్తూ నిలబడినట్లు 'అన్నయ్యా అన్నయ్యా' అంటూ యేడు స్తున్నా ఇద్దరు రౌడీలు అనూని బలవంతంగా యెత్తుకు పోతూ న్నట్లు తను వాళ్ళని పట్టుకుని చితక్కొట్టి చెల్లెలిని విడిపించా లని ప్రయత్నిస్తూన్నాడే కానీ వాళ్ళు దొరకటంలేదు.

"అనూ....అనూ" అంటూ కలవరిస్తూండగానే మెలకువ వచ్చేసింది. కళ్ళు తెరచి అనూరాధ మంచం వైపు చూస్తే నిశ్చ

లంగా నిద్రపోతోంది. అమ్మయ్య యిదంతా కలేనా! మనస్సెంత బాధపడిందీ అని తనలో తనే నవ్వుకుని కళ్ళు మూసుకున్నాడు.

చిన్నప్పటినించీ అన్నాచెల్లెళ్ళకి ఒకే గదిలో చదువుకోవటం ఒకే మంచం మీద పడుకోవటం అలవాటు. అనూకి తొమ్మిదేళ్ళు వచ్చిన తరువాత తల్లి ప్రత్యేకంగా మరో మంచం యేర్పాటు చేసింది. అయినా అనూరాధ చాలా సేపటి వరకూ చదువుకుని నిద్ర ముంచుకొస్తూంటే అలవాటుగా అన్నగారి మంచంమీదనే పడుకుని నిద్రపోయేది. అన్నపూర్ణమ్మ చూస్తే విసుక్కుని అనూ మంచం మీదకి తీసుకువెళ్ళి పడుకోబెట్టేది. ఆమె చూడకపోతే యింక మురళీ చాలా పొద్దుపోయే వరకూ చదువుకుని ఆవులిస్తూ నిద్ర ముంచుకు వస్తుంటే లేచి తన మంచం మీద వాలబోయి చెల్లెలిని చూస్తూనే విసుక్కుంటూ —

"ఈ దెయ్యానికి నా మంచం మీద కానీ నిద్రరాదు" అంటూ సణిగి మొద్దు నిద్రపోయే అనూని యెత్తి ఆ పిల్ల మంచం మీదకి చేరేసి 'అమ్మయ్య' అనుకుంటూ తన మంచం మీద ఒక్కడూ విశాలంగా కాళ్ళు చాచుకుని పడుకుంటే కానీ హాయిగా నిద్రరాదు మురళికి.

ఇంక ఇంటికి యేకొత్త చుట్టాలు వచ్చినా ఈ అలవాటుకి భిన్నంగా జరుగుతుంది. చెల్లాయి మంచం చుట్టాలకి వెడితే అనూ అన్నగారి మంచం ఆక్రమించుకుంటుంది. ఇంక మురళికి చిరుచాపాదిండూనే గతి. క్రిందపడుకుంటే మురళికి చస్తే నిద్రపట్టదు.

ఆ చాపమీద పడుకుని అటూ ఇటూ దొర్లుతూ వచ్చిన చుట్టాలని మనస్సులో శపిస్తూ యెప్పుడు పోతార్రా దేవుడా అని దణ్ణం పెట్టి యెలాగో కలత నిద్రలోకి జారిపోతాడు. ఇలా తరుచుగా జరగటం ఆ అన్నా చెల్లెళ్ళకి అలవాటే. అయినా ఈ రోజు మళ్ళీ యింటికి చుట్టాలు వచ్చారనే సరికి మురళీకి కోపంతో వళ్ళు మండిపోతోంది.

"అనూ, మరేం అయిడియా తట్టటంలేదు. పిలకతాతయ్య సంచీ కాపుడమ్మ మూటా విసిరి పుచ్చుటని ప్రహరీ బైట గిరాటు కొట్టాల్సిందే" అన్నాడు విప్పి పట్టుకున్న షర్టు హేంగర్కితగిలిస్తూ—

"ఔననుకో! కానీ ఆ తర్వాత ఆ ఇద్దరికీ రైలు చార్జీలకి నాన్నారే డబ్బు యివ్వవల్సి వస్తుంది. అసలే పిలక తాతయ్య అఖండుడు."

"పాయింటే" అంటూ ఆ గదిలో ఇటూ అటూ షికారు చేస్తూ—

అరె! గదిలో నా మంచంతో బాటు నీ విక్రమార్కుడి సింహాసనానికి కూడా (చెల్లెలి మంచానికి ముద్దుగా మురళీ పెట్టిన పేరు) స్థాన చలనం వచ్చిందే అన్నాడు ఆశ్చర్యంగా చూస్తూ—

"కాపుడుపిన్ని ఒకటీ పిలకతాతయ్య ఒకటీ పేచీలేకుండా పంచుకున్నారుగా! అన్నట్లు ఈ కాపుడు పిన్ని యెందుకొచ్చిందో తెలుసా!"

"నువ్వు చెప్పందే."

"అయితే శ్రద్ధగా విను. ఆవిడ వూరికే యెక్కడికీ రాదట. నీకు పెళ్ళి సంబంధం తెచ్చిందట. పెళ్ళికూతురెలా వుంటుందంటే రంగు పాలచింతపండుతో పోటీ పడుతోంది. అయితేనేం రంగు కొరుక్కుతింటారా! రూపం శాశ్వతమా!"

గుణం ప్రధానం కానీ! అందుకే పెద్దలు కులమింటి కోతైనా సరే పెళ్ళి చేసుకోమన్నారు.

ఇంక ఆ పెళ్ళికూతురు ఇంటికి యాభైమంది అతిధులు వార్నింగ్ యివ్వకుండా కట్ట గట్టుకు వచ్చి పడ్డా అందరికీ శుభ్రంగా వండీ వార్చేయగలదట. మిరపకాయల కారం యెన్ని కిలోలైనా సరే మెత్తగా పంకంలా కొట్టేయగలదట. యింక పప్పులు విసురుతుందట. అంట్లు తోమెస్తుందట. బట్టలు వుతికేయగలదట. అన్నంవండేయగలదు తినేయగలదట....మరింకా......

అన్నగారి ముఖంలోని కోపపు ఛాయలు గమనిస్తూన్నా ఆగకుండా అభినయిస్తూ చెప్పుకు పోతూనేవుంది అనూరాధ.

"అప్రస్తుత సంభాషణ చేస్తూన్నావు అనూ" తీవ్రంగానే అన్నాడు.

"హేయ్‌రామ్! పురుము పురిమి పంగలం మీద పడ్డదట. అలా వుంది నీ వరస. ఆవిడ మనకి అమ్మమ్మ....కాదు. బామ్మ వరస.,..అహ అదీ కాదు. సరే యేదో వరస అనుకో ఈ

డైలాగులన్నీ నావి కావు మహాప్రభో కావుడు పిన్నివి. ఆవిడని నాన్నారూ, అమ్మా, చివరికి పిలకతాతయ్య కూడా—

"కావుడు పిన్నీ అంటూన్నారు. నేనూ అలాగే అంటూ న్నాను సోదరా! అదీ కాక ఆవిడ సీను కాబోయే భార్యా మణికి...."

"స్టాపిట్"

"యస్ బ్రదర్" నోటి మీద వేలుంచుకుని బొమ్మలా కూర్చుంది అనూరాధ.

విసురుగా వెళ్ళిపోయాడు మురళి అక్కడనించి.

"అన్నపూర్ణా! అబ్బాయి వచ్చినట్టున్నాడే. అబ్బో చాలా పొడుగు యెదిగిపోయాడే. చిన్నప్పుడెప్పుడో చూశానంతేగా! అరె! అచ్చంగా దశరధ అన్నయ్య గుర్తొస్తూన్నాడు వీడిని చూస్తూంటే. ఆపచ్చని రంగూ పడ్డూ పొడుగూ ఆ నొక్కుల క్రాపూ కాస్త వంగినట్లు నడవటం ఇంతగా తాతగారి పోలికలు పుణికిఎలా పుచ్చుకున్నాడేవీడూ! ఆఛాతీకూడా అంతే. అచ్చంగా దశరధన్నయ్య పాతికేళ్ళప్పటి ఫోటోలావున్నాడు వీడు.

యెంత చిత్రం. యేమిటో రాకలూ, పోకలూ లేందే పట్టరికాలు దూరం అయిపోవూ! నా ఆరోగ్యం బావులేక రాలేక పోయాను. వీడిని చూడాలని యెన్నాళ్ళగానో అనుకుంటూనే.

ళావుగా పొట్టిగా వున్న ఓ అరవైయేళ్ళ ఆవిడ మంచం

మీద కూర్చుని మురళిని సునిశితంగా పరీక్షిస్తోంది. ఆవిడ వాగ్దాటి ఆగేలా లేదు.

మురళికి అడుగు ముందుకు పడేలా లేదు. నడపటమే సరీగారాని వాడిలా వెళ్ళి కాళ్ళు కడుక్కొని పీట మీద భోజనానికి కూర్చుండి పోయాడు.

మురళికి కొత్త వాళ్ళెవరు అన్నం వడ్డించినా ముద్ద గొంతు దిగదు.

అన్నపూర్ణమ్మ ఆరోగ్యం బాగులేకపోయినా కొడుక్కి తనే వడ్డిస్తుంది. లేకుంటే అనురాధైనా పెడుతుంది. అనూరాధ వచ్చి అన్నగారికి వడ్డించింది....కామదమ్మ యింకా మురళిని పరీక్షిస్తూనే వుంది. "ఇంతరాత్రి పరికూ యెక్కడ తిరుగుతున్నావురా"అంది దీర్ఘం తీస్తూ....

"వల్లకాట్లో" అనబోయి మింగేశాడు. అన్నం ముద్ద నోట్లో పెట్టుకుని వెంటనే బాబోయ్ కారం....కారం. గటగటా గ్లాసుడు నీళ్ళు తాగేశాడు.

కామదమ్మ మురళిని చూసి విస్తుపోతూ....అయ్యో నారాతా! ఈ కాస్త కారానికే యిన్ని కన్నీళ్ళురా! నీ కాబోయే పెళ్ళాం కొరివి కారం ముద్దలు మింగేస్తుంది. గుంటూరు గోంగూరలో పండుమిరప్పళ్ళుపోసి చేసిన పచ్చడి కచ్చాబచ్చాగాతొక్కి బిరుసన్నంలో యెత్తుకెత్తూ కలిపి అంత నెయ్యో వెన్నో వేసుకుని తింటూ "అమ్మమ్మా! రుచి స్వర్గానికి బెత్తెడు యెడంగా వుందే"

అంటుందిరా! నిజం చెప్పాలంటే మన తెలుగు వాళ్ళకి ధైర్య సాహసాలు యెలా వచ్చాయంటావురా! కారంలోనే వుంది శౌర్యం అంతా!

"మా నాగనాంచారి వుంది చూశావూ అది కొరివికారం సుద్దలుమింగినా వుగ్గిగిన్నెడైనా నీళ్ళు తాగదు. పిల్లంటే పిల్లరా అదీ! బంగారు శలాకే.

రంభా ఊర్వశీ దీనిముందు బలాదూర్. పిచ్చి పిల్ల నిద్ర కాయలేదు! అందుకే పూరకపోయాకం ముందు యింత అన్నం తినేసి ముసుగు తన్ని నిద్రపోతుంది. నువ్వు వస్తావనీ చూడాలనీ యెంతో సేపు ఆ వసారాలోనే కాపు వేసింది.

కానీ నువ్వు రాలేదు. పిచ్చి తల్లి అప్పుడే గురకలు పెడుతోంది. పోనివ్వు. తెల్లారి చూసుకుందురు గానిలే. అయిన వాళ్ళమేగా! యెక్కడికి పారిపోతాం గనక. నే నిప్పుడొచ్చింది మీ యిద్దరికీ లగ్నాలు పెట్టించటానికే. నిన్ను చూసింతర్వాత చాలా సంతృప్తిగా వుంది నాకు. ఇదీ నాయనా సంగతి."

మురళికి తినే అన్నం ప్లేటు ఆవిడ ముఖాన విసిరి కొట్టా లనిపించింది. "అను! పెరుగు" పెద్దగా అరిచాడు.

"కాపుడు పిన్నీ! నువ్వు చెప్పేదంతా బాగానే వుంది. కానీ నారాయణకానీఅన్నపూర్ణమ్మగానీ 'పి మనపరాలని' చేసు కుంటాం అని ఒక్క మాట అన్నారా! వాళ్ళ మాట తీసుకోకుండా నే లగ్నాలూ అదీ అంటే యెలా! ఖాయం అని నువ్వనుకుంటే పెళ్ళి అయిపోతుందా!"

ఖంగూ ఖంగూ దగ్గుతూ లేచివచ్చి ఒక్కో మాటా అన్నాడుపిలక తాతయ్య.

"బాబాయ్! నీ కలాంటి సందేహం అక్కర్లా. మా నాగ నాంచారి పుట్టడమే మురళి పెళ్ళాంగా పుట్టింది తెలుసా! యింక నువ్వెక్కడున్నా అసలే కోర్టు పక్షివిగా అందుకు చెపుతూన్నాను. ఈ పెళ్ళికి వచ్చి కాస్త గాడిపొయ్యి దగ్గర వంట వాళ్ళని అజ మాయిషీ చేయాలి. మాకసలు పెద్ద దిక్కు నువ్వేగా! అసలు పెళ్ళిళ్ళకి చుట్టాలు మేకల మందల్లా తినటానికి వస్తారు గానీ మనకి సాయపడేందుకు వస్తారా! ఆడంగులున్నారంటే క్షణానికో చీరె సింగారించుకోవటానికే సమయం చాలదు. మగాళ్ళు పేకదసాలు కలపటానికే సరిపోతుంది.

కాఫీలు తాగటం. పలహారాలు తినటం సిగరెట్లు తాగటం యింతేగా! ఈ పేకాట పిచ్చగాళ్ళని చూస్తూ వుంటే చింతబరిక పుచ్చుకుని బాదాలన్పిస్తుంది.

మరి నా కెవరుచెప్పు సాయపడేది నువ్వు తప్ప. అందుకే యింతగా చెప్తూన్నాను. నువ్వు నా మాట కాదనవని తెల్సులే.

కాపుదమ్మ ముసి ముసి నవ్వులు నవ్వుతూ తన వాక్ చాతుర్యంతో పిలక తాతయ్య నోరు కట్టేయటానికి ప్లాను వేసే సింది. మురళి అన్నం తినటం మర్చిపోయి ఆ మాటలు వింటూ అలాగే కూర్చున్నాడు. అనూరాధ నీళ్ళలాంటి మజ్జిగ గుమ్మ రించి వెళ్ళింది. మురళి కంచంలోకి చూసి "ఛెత్ యివి మజ్జి గేనా" అన్నాడు కోపంగా—

"కాదు! పంపులో నీళ్ళు" గదిలోనించే జవాబిచ్చింది.

చెంబుడు నీళ్ళు కంచంలో గుమ్మరించి లేచేశాడు.

"ఇంతకీ కావుడూ! కట్న కానుకలు యెంతిస్తావేంటి"

పిలకతాతయ్య విషయం అంతటితో వదలక పొడిగించాడు.

"ఏం! అలా అడిగావే?" వురిమినట్లు చూస్తూ అంది.

"అబ్బే యేంలేదమ్మో! తెల్సుకుందాం అని"

"అంతే కదా! చెప్తూన్నా విను. పల్లంపొలం రెండెకరాలూ నాగనాంచారి పేర రాసేస్తాను. బాబాయ్ పిల్లకిస్తే పిల్లాడికిచ్చినట్లు కాదా!

యిది కాక పది కాసుల బంగారం పెడతాం. యేం సరిపోయిందా లేదా, యిదైనా మన మురళికి పిల్లనిస్తూన్నాం గనక."

"నిజమే కానీ ఆ పల్లం పొలంలో రేగి కంప తప్ప యేం పండదని యెవరో అనగావిన్నాలే! ఔనూ బంగారం పూత గాజులూ, గొలుసులూ చేయించావట, ఏ కంసాలి దగ్గరా."

కావుడు పిన్ని ముఖం మాడిపోయింది. అయినా గొంతు పెద్దది చేసి—

"యిదిగో తెలిసీ తెలియక మాట్లాడకు. పల్లం పొల

స్వయంగా చేస్తే బంగారం పండుతుంది. అది సరే నగల పూసు నీ కెందుకూ. ఓ గొలుసన్నా గాజులన్నా చేయించుకుంటావా!"

ఆవిడ మాట చురుక్కున తగిలినా పిలకతాతయ్య వెనక్కి తగ్గకుండా—

"అవునే! ఈమధ్య మీ పిన్ని అదే మా ఆవిడ గొలుసో గాజులో అని ప్రాణం తినేస్తోంది. మరి బంగారం ధర చుక్కల్ని చూస్తోందా! అందు కడిగాను.

"ఓ యబ్బో! అరవై యేళ్ళొచ్చింతర్వాత ఒకరి మాట ఒకరు గౌరవించుకునే ఆదర్శదంపతులయ్యారన్నమాట. షష్టిపూర్తి చేసుకుంటావా"

ఆ యిద్దరి సంభాషణా యిప్పట్లో ఆగేలా లేదని అన్నపూర్ణ 'అబ్బబ్బా' అని తలపట్టుకుంది. నాగనాంచారి గురక పెద్దదైంది. అనూరాధ చెవుల్లో వేళ్ళు పెట్టుకుని చదువులో లీనం కావటానికి విశ్వప్రయత్నం చేస్తోంది.

ఇంక మురళి పరిస్థితి చెప్పనే అక్కరలేదు. తంత్రికనక అడ్డం రాదనే ధైర్యం వుంటే ఆ యిద్దరినీ ఇంటి బైటికి తోసి తలుపు గట్టిగా గడియ బిగించేసేవాడు. కానీ ఆ అవకాశం లేదే!

ఆఫీసు గదిలో ఫైల్సు చూసుకునే నారాయణరావు అవి అలాగే వదిలి హాల్లో కొచ్చి "అలీ లేదు. చూలూ లేదు. కొడుకు పేరు సోమలింగంట. అలా వుంది మీ గొడవ. మురళి యిప్పుడప్పుడే పెళ్ళి చేసుకోనంటూన్నాడు. పైగా వాడి పెళ్ళి విష

యంలో మా పెత్తనం యేం లేదు. కనుక ఆ విషయం వది లెయ్యండి" ఖచ్చితంగా చెప్పి వెళ్ళి పోయాడు.

కావుడమ్మ "అయ్యో అయ్యో అంటూ నోరుకొట్టుకుంటూ అలా అంటే యెలారా నారాయణా! నాగనాంచారి పుట్టినప్పటి నించీ—

"మురళి పెళ్ళాంగానే పెంచి పెద్దచేస్తే యిప్పుడు మరొకడి చేత మంగళసూత్రం ఎలా ముడేయించుకుంటుంది. అసలు నేనెలా వేయిస్తాను. అయినా నీదేంలేదన్నావుగా! మురళినే అడిగేస్తాను...."

అంటూ తన స్థూల కాయాన్ని మెల్లగా లేవనెత్తి మురళి గదిలోకి బయలు దేరింది. ఇంత వరకూ వీళ్ళ సంభాషణ వింటూన్న అన్నా చెల్లెలూ "అయ్యబాబోయ్ అనుకున్నారు.

"అన్నాయ్! ఆవిడ వస్తోందిరా!" కెవ్వమన్నట్లు కేక పెట్టింది అనూరాధ.

"ఈ నాగనాంచారెవరే నా ప్రాణానికి లంఖిణీలా దాపరించింది. ఆ పిల్లని సరిగ్గా నువు చూశావా"

"ఆ! చూశాను. అచ్ఛంగా శూర్పణక చెల్లెలులా వుంటుంది."

అంది వచ్చే నవ్వు ఆపుకుంటూ. అన్నయ్యా ఆవిడ వచ్చేస్తోందిరా"

మురళి ఖంగారు పడిపోతూ ఆవిడనుంచి తప్పించుకునేందుకు దార్లు వెతుకుతూన్నాడు. ఆ గదికి మరో దారిలేదు. టక్కున చాపమీదపడుకుని ముసుగుపెట్టేసుకున్నాడు.

"ఒరే మురళీ! బంగారుబాబూ! ఏం చేస్తూన్నావురా! యింకా చదువుకుంటూన్నావా నాయనా! నా బంగారు తండ్రే.... అరె....నువ్వు చేనూ! మీ అన్న ననకన్నా యేడీవడూ!" అంటూ వచ్చింది.

ఏ కుర్చీలో కూర్చుంటుందో అది విరిగి పోతుందేమో అని భయంగా చూస్తూ అనూరాధ "అన్నయ్యా.... అన్నయ్య —నిద్రపోతన్నాడుగా... బాగా నిద్రకూడా పట్టేసింది కావుడు పిన్ని.'

"నీ కెవరు చెప్పారే ఈ వరస. అది సరేగానీ యింత వరకూ నువ్వూ మీ అన్నయ్యా చెవులు కొరుక్కుంటూనే వున్నారుగా అప్పుడే యెప్పుడు నిద్రపోయాడే....పోనీ నిద్ర పోయాడే అనుకో కాస్త లేపు. వాడితో మాట్లాడాలి."

"అన్నయ్యా. అన్నయ్యది కుంభకర్ణుడినిద్ర అమ్మమ్మా కాదు....బామ్మగారు....కాదు... ..అ ...ఆన్నయ్య నిద్ర పోయాడంటే యింక ఏనుగుతో తొక్కించినా లేవడు.డప్పులు వాయించినా లేవడు. బిందెడు నీళ్ళు గుమ్మరించినా మెలకువ రాదు. పైగా రైలింజన్‌లా శబ్దంకూడా చేస్తాడు."

"అలాగా నువ్వెళ్ళి ఓ బిందెడు నీళ్ళట్టుకురా! లేపుదాం. నాకు ఒర్జెంటు పనే" అనటం విన్న మురళి పెద్దగా గుర్రు పెడు తున్నాడు కానీ ఒకవేళ చన్నీళ్ళు తెచ్చి నిజంగా మీద పోస్తుం దేమో అని లోలోపల భయపడిపోతూన్నాడు.

"నీళ్ళా అమ్మ....బామ్మా! నీళ్ళా. యింకెక్కడివీ అన్నీ నీ స్నానానికి అయిపోయాయిగా!"

అహా సమయస్ఫూర్తికి మురళికి ముచ్చటేసింది.

"ప్చ! ఈ పిలగ్గాడి పోరే కొట్టివుంటుంది. ఈవాళ పైసలు చేసుకునే అవకాశం లేకుండా పోయింది. సరే....తెల్ల వారదూ." అనుకుంటూ అక్కడనించి వెళ్ళిపోగానే మురళి గభాలునలేచి 'చెల్లాయ్' అంటూ చెయ్యి అందించాడు. 'థ్యాంక్యూ' అంటూ.

అహా నవ్వుని బిగపట్టుకుంది. 'అమ్మయ్య' అనుకుని మురళి తెల్లవారకుండానే యే వైపునించి పారిపోవాలో అని ప్లాను వేసుకుంటూ పడుకున్నాడు.

యింక పిలక తాతయ్య కావుడమ్మ యెత్తుకి పైయెత్తు ఎలా వెయ్యాలా అని తీవ్రంగా ఆలోచిస్తూ నిద్రపట్టక ఇటూ అటూ మంచంమీద దొర్లుతున్నాడు.

'యెంత ఆశ ఈ కావుడికి. నేడో రేపో "లా" డిగ్రీ కూడా తీసుకోవటానికి రెడీగావున్న మురళి లాంటివాడు ఈ దేబెముఖంది నాగనాంచారికి మొగుడు కావాలీ! వీల్లేదు. ఇది జరక్కూడదు. ఎటునుంచి నరుక్కురావాలో బాగా ఆలోచించి మరీ దీన్ని ఇంట్లోనించి వెళ్ళగొట్టించాలి.'

అనుకుంటూ ఆ రాత్రి అంతా ఆలోచిస్తూనే ఉన్నాడు.

# 9

"సునందా! ఓ సునందా" వాకిట్లోనించే పెద్దగా కేక పెడుతూ వచ్చాడు మురళి.

"కంగ్రాచులేషన్స్ బాప! యేదీ నోరుతెరు" రెండు మైసూర్ పాకు ముక్కలు పట్టుకుని మరీ వచ్చింది సునంద.

"థాంక్స్! అయితే రిజల్ట్సు ముందే చూశావన్నమాట. అయినా నా నంబర్ నీకెలా తెల్సు."

నిన్నే అడిగి యెప్పుడో "నోట్" చేసుకున్నాను. నువ్వు మర్చిపోయావు అంతే. కాని ముందు యిది తిను" మురళి నోరు తెరిచాడు. సునందకి ఒకటి నోట్లోపెట్టి ఇంద యిదీ తిను అంటూ అందించింది.

"అయితే ఈరోజు నుంచీ మురళీధర్ బి.ఏ., ఎల్. ఎల్. బి అన్నమాట. "అన్నమాటే! ఏదీ నువ్వు నోరు తెరు" అని తనచేతిలోది సునంద నోటికి అందించాడు.

"భలేవాడివి ఇదేంపనీ! కష్టపడి చదివి పరీక్షపాసైంది నువ్వు మధ్య నా కెందుకీ స్వీటు".

"నన్ను చదివించినందుకు. పరీక్ష ఫీజుకట్టినా సరీగా చదవలేకపోయి పరీక్షకి అసలు కూర్చోనని మొండికేస్తే మరేం ఫర్వాలేదని వున్నటైముని వేష్టు చేసుకోకుండా చదివితే తప్పక పాసవుతావని బోలెడంత ధైర్యంచెప్పి పరీక్షకి కూర్చునేలా చేసినందుకు. క్లాసురాకున్నా పాసైనావనే సంతోషంలో పాలు

పంపుతుంటావనీ! ఇందుకు....అబ్బ! సునందా ఈ పరీక్షల మీద విరగడై పోయింది. మెదడుకి ఎంత టెన్షన్....బాపరేవద్దు. ఈ అవస్త" తేలిగ్గా గాలిపీలుస్తూ అన్నాడు. అతనికళ్ళు సంతోషంతో మిలమిలా మెరుస్తున్నాయి. సునందకీ సంతోషంగానే వుంది. వెంటనే తనకిచెప్పి పోవటానికి వచ్చాడని మరీ సంబర పడిపోతోంది.

"కష్టపడకుండా డిగ్రీ తెలావస్తాయి బాబుగారూ!" నవ్వింది సునంద. ఆనవ్వులో శృతికలిపాడు మురళి. ఇంతలో యెక్కడికో వెళ్ళిన ఇందిర వచ్చింది. మురళిని చూస్తూనే హల్లో బావగారూ! కంగ్రాచులేషన్స్. పరీక్ష గొంతెక్క లేదుగా! పాసైనారు గనక ఈరోజు హోటల్లో పార్టీ సినిమా....వగైరా ....వగైరా. పారిపోయేరు. క్షణంలో డ్రెస్ మార్చుకొస్తాగానీ. అక్కా, శ్రీకృష్ణ పరమాత్మని కాస్త జాగ్రత్తగా చూస్తూ వుండవే"

మురళి జవాబుకూడా వినకుండా గ[illegible]లోపలికి పరుగెత్తింది ఇందిర.

చచ్చాం. ఈ పిల్ల పట్టుకుంటే [illegible] వదలదు. అనుకుంటూ ప్యాంటుజేబు తడిమి [illegible] రెండు రూపాయిలూ కాస్త చిల్ల[illegible] [illegible] వుంది. ఎలా యిప్పుడు. ఆలో[illegible]

"సునందా సినిమా[illegible] చేసాను" ఆలోచన కట్టిపెట్టి అన్[illegible]

"ఇవాళ నేరాలేను బావా! మరెప్పు[illegible] [illegible]ండా వసాను. సరేనా."

"నీ యిష్టం. కానీ, ఇందిర....వదిలేలా లేదే"

సునందచెప్పే జవాబు వినపడనీయకుండా రాజేశ్వరి మేనల్లుడిని అభినందిస్తూ సరిగ్గా చదవలేదంటూనే పరీక్ష పాసై నావురా మురళీ" అంటూ వచ్చింది.

"క్లాసు లేదు! పాస్ మాత్రమేగా"

"భలేవాడివిరా! క్లాసు రాకుంటేనేం. కానీ....మీ నాన్న లాగా ప్రాక్టీస్ పెడతావా లేక యల్. యల్. యం చదువు తావా! ఇవేం అక్కరలేదని హాయిగా వుద్యోగం వెతుక్కుంటావా"

"అదేదీ కాదమ్మా! బావ ఐ. ఎ. యస్ కి కట్టి కలెక్ట రవుతాడు."

నవ్వుతూ మురళి ముఖంలోకి చూస్తూ అంది సునంద.

"నిజంరా! అదనే మంచిది. కాస్త కష్టపడాలి అనుకో ...నీకిదా కోరిక. నేనేమో అనుకున్నాను."

"నా కోరిక కాదత్తయ్యా! తాతయ్య కోరిక. ఆయన యెన్నో సంవత్సరాల నుంచీ కంటూన్న కల. అసలు నాన్నని కలెక్టరు చేయాలనే ఆయన కలలుకన్నారు. కానీ నాన్నగారు అవలేకపోయారు. యింక మిగిలిందినేను నేను వెళ్ళనన్నా తాతయ్య వినేలా లేదు. నేని పరీక్షకి ప్రిపేరై వెళ్ళాల్సిందేనే. అశ్రద్ధచేస్తానేమో అని "పరీక్షలెప్పుడో రాయి. నే పల్లెనుంచి వచ్చి దగ్గరుండి చదివిస్తాను!" అని యెన్నోసార్లు చెప్పాడు తాతయ్య. అబ్బ యెంత బరువైన బాధ్యత. యెంత బరువైనదో యిది. అయినా ప్రయత్న లోపం చెయ్యనత్తయ్యా!"

పంపుతుంటావని! ఇందుకు....అబ్బ! సునందా ఈ పరీక్షల పీడ విరగడైపోయింది. మెదడుకి యెంత టెన్షన్....బాప్‌రేవద్దు. ఈ అవస్త" తేలిగ్గా గాలిపీలుస్తూ అన్నాడు. అతనికళ్ళు సంతోషంతో మిలమిలా మెరుస్తున్నాయి. సునందకి సంతోషంగానే వుంది. వెంటనే తనకిచెప్పి పోవటానికి వచ్చాడని మరీ సంబర పడిపోతోంది.

"కష్టపడకుండా డిగ్రీ లెలావస్తాయి బావగారూ!" నవ్వింది సునంద. ఆనవ్వులో శృతికలిపాడు మురళి. ఇంతలో యెక్కడికో వెళ్ళిన ఇందిర వచ్చింది. మురళిని చూస్తూనే హల్లో బావగారూ! కంగ్రాచులేషన్స్. పరీక్ష కొండెక్క లేదుగా! పాసైనారు గనక ఈరోజు హోటల్లో పార్టీ సినీమా....వగైరా ....వగైరా. పారిపోయేరు. క్షణంలో డ్రెస్ మార్చుకొస్తాగానీ. అక్కా, శ్రీకృష్ణ పరమాత్మని కాస్త జాగ్రత్తగా చూస్తూ వుండవే"

మురళి జవాబుకూడా వినకుండా గబగబా లోపలికి పరుగెత్తింది ఇందిర.

చచ్చాం. ఈ పిల్ల పట్టుకుంటే "బంక"లా వదలదు. అనుకుంటూ ప్యాంటుజేబు తడివి చూసుకున్నాడు. అందులో రెండు రూపాయిలూ కాస్త చిల్లరా తప్ప మరేంలేదన్నది గుర్తు వుంది. ఎలా యిప్పుడు. ఆలోచిస్తూన్నాడు మురళి.

"సునందా సినీమాకె సుబ్వారా పోదాం. అనూకి కూడా చెప్తాను" ఆలోచన కట్టిపెట్టి అన్నాడు.

"ఇవాళ నేరాలేను బావా! మరెప్పుడన్నా తప్పకుండా వస్తాను. సరేనా."

"నీ యిష్టం. కానీ, ఇందిర....వదిలేలా లేదే"

సునందచెప్పే జవాబు వినపడనీయకుండా రాజేశ్వరి మేనల్లుడిని అభినందిస్తూ సరిగ్గా చదవలేదంటూనే పరీక్ష పాసైనావురా మురళీ" అంటూ వచ్చింది.

"క్లాసు లేదు! పాస్ మాత్రమేగా"

"భలేవాడివిరా! క్లాసు రాకుంటేనేం. కానీ....మీ నాన్న లాగా ప్రాక్టీస్ పెడతావా లేక యల్. యల్. యం చదువుతావా! ఇవేం అక్కరలేదని హాయిగా వుద్యోగం వెతుక్కుంటావా"

"అదేదీ కాదమ్మా! బావ ఐ. ఎ. యస్ కి కట్టి కలెక్టరవుతాడు."

నవ్వుతూ మురళి ముఖంలోకి చూస్తూ అంది సునంద.

"నిజంరా! ఆపనే మంచిది. కాస్త కష్టపడాలి అనుకో ...నీకిదా కోరిక. నేనేమో అనుకున్నాను."

"నా కోరిక కాదత్తయ్యా! తాతయ్య కోరిక. ఆయన యెన్నో సంవత్సరాల నుంచీ కంటూన్న కల. అసలు నాన్నని కలెక్టరు చేయాలనే ఆయన కలలుకన్నారు. కానీ నాన్నగారు అవలేకపోయారు. యింక మిగిలిందినేను నేను వెళ్ళనన్నా తాతయ్య వినేలా లేడు. నేసి పరీక్షకి ప్రిపేరై వెళ్ళాల్సిందేనే. అశ్రద్ధచేస్తానేమో అని "పరీక్షలెప్పుడో రాయి. నే పల్లెనుంచి వచ్చి దగ్గరుండి చదివిస్తాను!" అని యెన్నోసార్లు చెప్పాడు తాతయ్య. అబ్బ యెంత బరువైన బాధ్యత. యెంత బరువైనదో యిది. అయినా ప్రయత్న లోపం చెయ్యనత్తయ్యా!"

నిట్టూర్చాడు మురళి. ఒకవైపు "లా" పాసైనాడనే సంతోషం వున్నా, మరోవైపు భవిష్యత్తులో ఐ. ఏ. యస్. ఆఫీసర్ కావాలనే తాతగారి కోరిక తనని భయపెడుతోంది. శక్తినంతా ఖర్చుచేసి చదివినా ఫలితం యెలా వుంటుందో! రెండు తరాల కోరిక నా భుజాలమీద వేశాడు తాతయ్య. ఈ కోరికనే తీర్చగలనా! యేమో! భగవంతుడిమీద భారం వేసి ప్రయత్నించటమే తను చేయగలిగింది. తనకి తనే ధైర్యం చెప్పుకున్నాడు మురళి.

"బావా! నే రెడీ"! టిప్‌టాప్‌గా రెడీ అయి వచ్చింది ఇందిర.

"ఇప్పుడు టైము లేదే! మరోసారి తప్పక వెడదాం. నేనిప్పుడు వెళ్ళి అర్జెంటుగా తాతయ్యకీ వార్తచెప్పాలి. ముందు సునందకి చెప్పాలని వచ్చాను. వెళ్ళివస్తానత్తయ్యా."

లేచాడు మురళి.

"నో.....నో! అలా వీల్లేదు. ఇప్పుడు వెళ్ళి తీరాల్సిందే!" మొండికేసింది ఇందిర.

"అరే! సునందేమో యింకా తయారుకాలేదు. మా అనూకి చెప్పలేదు. మరి టైమేదీ"

"ఈ సాకులతో తప్పించుకుంటున్నావు. జేబులో డబ్బు లేదని చెప్పరాదూ! పోనీ పర్సునేతెస్తాలే. స్కూటర్‌లో ఇద్దరం వెడితే టైము సరి పోతుంది. నువ్వు నా వెనక కూర్చో! లేకుంటే నీవెనక నేను కూర్చుంటా! పదా. ముందు పోదాం! ఏమ్మా బావతో సినీమాకెళతానే"

మురళి చెయ్యి పట్టుకుని బలవంతంగా లాగుతోంది. ఇలా చేస్తుందనే ఇందిరంటే వళ్ళుమంట మురళికి. తన యిష్టం కోసం అవతల వాళ్ళని బొమ్మల్లా ఆడించి పని చేయించేస్తుంది. అధొక్కటీకాక యేచిన్నసందు దొరికినా యెదుటి వాళ్ళ నిస్సహాయతని పరిహసించి గర్వంగా నవ్వుతుంది. ఆ సమయాల్లో ఇందిర అందాల బొమ్మలా కాక రాక్షసిలా కన్పిస్తుంది మురళికి. లోలోపల పళ్ళు కొరుక్కున్నాడు.

రాజేశ్వరమ్మ కూతురి గారాబం చూసి మురిసిపోతోంది.

తనచెయ్యి బలవంతంగా వదిలించు కోవాలని ప్రయత్నిస్తున్నా ఇందిర వదలటంలేదు.

"సునందా" అంటూ యేదో చెప్పబోతున్న మురళిని చెయ్యిగుంజి లాక్కు వెళ్ళింది. మురళి యింక తప్పదన్నట్లు స్కూటర్ స్టార్టు చేశాడు. మురళికి స్కూటర్ నడపటం రాదనీ ఈ సాకుతో తన వెనక అతన్ని కూర్చోబెట్టుకుని సినిమాకి వెళ్ళాలనీ ఇందిర కోరిక. అయితే స్నేహితుల స్కూటర్ నడపటం యెప్పుడో నేర్చుకున్న మురళి కూర్చుని స్టార్టు చేసేసరికి వూ-అయ్యగారికి ఈ బందీలోలటం వచ్చన్నమాట. అంతేనా లేక ట్రాఫిక్ పోలీసు మీద యెక్కించేస్తావా! అంటూ నవ్వి వెనక కూర్చుని మురళి భుజంమీద తల పెట్టాలని ప్రయత్నిస్తూ కుడిచెయ్యి అతని నడుంచుట్టూ వేసి మరీ దగ్గరకి అనుకుని కూర్చుంది.

మురళిలో కసిపెరిగిపోతోంది. ఈ పిల్ల యిష్టాయిష్టాలకి నేను తలవంచాలా! చూస్తాను. యే మెడు కాలువలోనైనా

తోసిపారేస్తే! అనే ఆలోచన క్షణం బాగావున్నా ఛీ.... అలా చెయ్యకూడదు. అనుకుని తీవ్రంగా ఆలోచిస్తూన్నాడు. అప్పటికే ఎరుగున్న స్నేహితులిద్దరు దారినిపోతూ మురళినీ వెనక వీపు మీద పడిపోతూన్నట్లు కూర్చున్న ఇందిరనీ క్షణంఆగి మరీ చూసి వెడుతూన్నారు.

స్కూటర్ సినీమాహాలు వైపుకాక మరోదారి పట్టేసరికి ఇందిర "అరె.రె.రె! ఏంటిదంతా! మీ ఇంటివైపుకా .. నేరాను ....రాను." గోలపెడుతూ వీపుమీద చిన్నగా దెబ్బలు వేస్తోంది.

మురళీ జవాబివ్వకుండా ఇందిర గోలభరిస్తూ స్పీడుగా తీసుకొచ్చేస్తూంటే.

"బావా! నీవిలా తీసుకెళ్ళావంటే దూకేస్తా! ఆపుతావా లేదా! చెప్పు. సినీమా హాలుకి లేకుంటే లేకుంటే....దూకేస్తా."

బిగ్గరగానే అంటోంది ఇందిర.

"ఏయ్! దూకుతావా! నీ యిష్టం....కాళ్ళూ చేతులూ సరీగ్గా వుండక్కర్లేదా! కాస్త ఆలోచించుకో! మరదలు పిల్లా" ఇలా యెప్పుడూ చెయ్యలేదు. అసలు చేస్తాడని కూడా అనుకోలేదు ఇందిర. యెంత హటం చేసినా మురళీ రాస్తకూడా జంకలేదు. అంతే ఇల్లురాగానే దిగేసి.

"రండి మరదలుగారూ! కాస్త కాఫీ తాగి వెళ్ళండి. వూ .. మీ పింగారం మా అనూచూ సే చాలదూ....రండి"

ఇందిర ముఖం యెర్రగా కందిపోయింది,

జవాబు చెప్పేలోపలే లోపల్నించి అనూ గట్టిగా కేక పెట్టింది.

"అన్నయ్యా! ఓ అన్నయ్యా తాతయ్య వూరినించి వచ్చాడూ! నీకోసం చూస్తున్నాడూ" అంటూ.

"అరె! తాతయ్య దగ్గరికే నే వెడదాం అనుకుంటే తాతయ్యే వచ్చేశాడా!" ఇందిరని వదిలేసి లోపలికి పరుగు తీశాడు మురళి.

"మా!" తల ఒక్క తిప్పు తిప్పింది ఇందిర. కానీ మెడ నొప్పి పెట్టటం మినహా ప్రయోజనం లేదు. అక్కడెవరన్నా వుంటేగా!

దశరథరామయ్యగారు అప్పుడే వచ్చినట్లున్నారు. నీళ్ళతో కడుక్కున్న ముఖం తుడుచుకోనేలేదు. కోడలు అందించిన మంచినీళ్ళు తాగుతూ మనవడిని ఓరగా చూసి లోలోపల సంతోషం పెల్లుబుకుతున్నా మూతి బిగించి బైటికి తెలియనీయకుండా పడక్కుర్చీలో వెనక్కి వాలి చూస్తూ వూరుకున్నారు.

తనని చూడగానే గభాలున లేచి గట్టిగా కౌగలించుకుంటా డనుకున్న తాతయ్య వుదాశీనంగా వూరుకున్నందుకు ఆశ్చర్య పోతూనే ముందుకొచ్చి కుర్చీ దగ్గరగా మోకాళ్ళ మీద కూర్చుని....

"తాతయ్యా! నే పాసైనానూ" గట్టిగా అరిచాడు.

తాతయ్య మాట్లాడలేదు,

"నీ దోస్తీ కట్" అంది అనూరాధ నవ్వుతూ.

"ఎందుకూ!"

"ఎందుకేమిటి? ఆయన నీ రిజల్ట్సు ఈ రోజు పేపర్లో వస్తాయని తెల్సి యెండలో ఆదుర్దా పడుతూ పల్లెనుంచి ఈ బస్తీకొచ్చి పేపర్ కొనుక్కుని నంబర్ చూసి ఆ పేపర్ పట్టుకుని బస్టాండ్నుంచి పడుతూ, లేస్తూ యింటికొస్తే నువ్వేమో ఇంట్లో లేవు. పైగా...." అనూని యింక చెప్పనివ్వలేదు.

"ఓ....అందుకా....సారీ తాతయ్యా! అసలీరోజు నువ్వు వస్తావనే సునంద దగ్గరనుంచి నేరుగా ఇంటికొచ్చేశాను. 'ఇందిర సినీమాకి వెడదాం' అన్నా అలాగేలే అని మస్కావేసి సగందూరం తీసుకొచ్చి ఆ స్కూటర్ మనింటి వేపు తిప్పేశాను. అరే అనూ ఇందిర లోపలికి రాలేదు, కోపం వచ్చినట్లుంది బాగా! పిలుపు....రమ్మను."

"రానని వెళ్ళిపోయింది అన్నయ్యా" అంది వాకిట్లోనించి అనూరాధ.

"అయ్యో, పాపం" మురళి నొచ్చుకున్నాడు.

దశరథరామయ్యగారి ముఖం యిప్పటికి విప్పారింది. మౌనవ్రతం వదిలేసి మనవడి చెయ్యి పట్టుకుని వళ్ళోకి లాక్కున్నాడు.

మురళి ఆ విసురుకి తాతయ్యగారి వళ్ళో పడ్డాడు.

మురళి క్రాపుని ప్రేమగా నిమురుతూ లెవనెత్తి—

"కంగ్రాచులేషన్ మిష్టర్ మురళీధర్" అంటూ మనవడి

చెయ్యి పట్టుకుని వూపేస్తూన్న ఆయన కళ్ళలోని ఆనందం, వాత్సల్యం అర్థం చేసుకుంటూ అలా చూస్తూనే వున్నాడు.

అలా చూస్తున్న మురళిని మరీ మరీ దగ్గరకిలాక్కున్నా రాయన.

"ఇందిర వెళ్ళిపోయినట్లుందిరా" అన్న పూర్ణమ్మ లోపలి నించే అంటే....

"ఆ స్కూటర్ పిల్ల పోతేపోయిందిలే. (ఇందిరకిస్కూటర్ పిల్ల అని పేరు) అసూ, అన్నయ్యకి కాఫీ, టిఫినూ త్వరగా తీసుకురామ్మా!"

నేనివాళ పల్లెనుంచి వచ్చి బస్‌దిగి పేపర్ కొందాం అని వెడితే....అబ్బ అక్కడ యెంతగోలగా వుందనీ, అప్పుడే అయి పోయినాయి అంటూంటే నే నిజంగా చాలా భయపడిపోయి గుంపులో దూరి యెలాగో ఓ పేపరు కొన్నానా! వాడు రూపాయి తీసుకుని యెంతకీ చిల్లరివ్వడు గుంపులో వాళ్ళు నా చేతిలో పేపరు బ్రతకనివ్వరు.

'ఇప్పుడే యిస్తాంసార్ ఒక్కసారి' అంటే ఒక్కసారి 'తాతగారూ మా అన్నయ్య నంబరు చూస్తాను' అని మరో కుర్రాడూ పోనీ నువ్వూ ఒకటి కొనరాదు అబ్బాయీ అని నేనంటే, ఆ పన్నెండేళ్ళ కుర్రాడూ....

"పేపరు కొనవద్దనీ, మా అన్నయ్య అలాకొని నంబరు చూడటం ఇప్పటికి అయిదోసారనీ, అలా అచ్చిరాలేదనీ చెప్పాడండి"

అసలు రిజల్టు ఈరోజు వస్తాయనేసరికే నిన్నటినించీ చలిజ్వరం పట్టుకుంది. అందుకే ఈ తిరణాలకి నన్ను పంపింది మా అమ్మ అంటూ పేపరు అరుపడిగాడా కుర్రాడు.

"నీకూ ఇస్తాను కానీ, నా మనవడి నంబరు ముందు చూసిం తర్వాత....అని ఆ గుంపులోనించి బైటపడ్డాను." అయితే చేతిలోనే పేపరుంది.

ఆ పేపరులో నీ నంబరుందో, లేదో చూడాలని తహతహ లాడింది.

కాదా? జేబులో నా చత్వారం కళ్ళజోడు లేదే, అది హడావుడిలో మర్చిపోయాను.

నే నెంబరు చెప్తాను. కాస్త ముందు నా నంబరు చూసి పెట్టు అని ఆ కుర్రాడిని బ్రతిమిలాడుతూంటే, ఓ పెద్దాయన వచ్చి ఆ పేపరు కాస్తా లాగేసుకుని—

"ఒక్క క్షణంలో యిస్తా" అంటాడు.

చెప్పద్దూ నా వళ్ళు మండింది.

"ఏమండీ, ఓ పేపరు కొనుక్కోకూడదూ" అన్నాను.

"కాపీలు లేవుటండీ" అన్నాడాయన.

"ఏమీకాదు. బ్లాక్‌లో అమ్ముతున్నారంతే." అన్నాడు మరో ఆయన.

"యేదీ, యేదీ పేపరు....క్షణంలో... ఇచ్చేస్తా" అంటూ ఓ యువకుడు ఆ పేపరు కాస్తా లాక్కు పారిపోతున్నాడు—

అయ్యో, అయ్యో అని పరుగెత్తాను వాడివెంట.

పంచ కుచ్చెళ్ళు అడ్డంపడి బోర్లా పడ్డాను.

మోచేతూలూ, మోకాళ్ళూ గోక్కుపోయాయి.

అయినా ఆ అబ్బాయి అందలేదు.

"దొంగ, దొంగ" అని నేనరుస్తూంటే....

పోలీస్ 'ఎక్కడ, ఎక్కడ ఏం పోయింది' అంటూ పారి పోయే కుర్రాడిని పట్టుకు లాక్కొచ్చి—

"ఏం యెత్తుకుపోతున్నాడూ?" అన్నాడు.

"పేపరు, పేపరు...." అన్నానో లేదో పోలీస్ ముఖం నల్లగా మాడిపోయింది.

"నంబరు చూసి తెచ్చిస్తా అంటే అంత గొంతు చించు కుంటావేం ముసలాయనా" అంటూ నా ముఖాన కొట్టాడు.

అప్పుడా పేపరులో ఆ కుర్రాడి సాయంతో ముందు నీ నంబరు చూసి ఆ కుర్రాడి అన్నయ్య నంబరు వెతుక్కునే వరకూ వుండి....

పాపం ...ఈ సారి అతని నంబరు దొరకలేదు. వచ్చే శాను.

తీరావస్తే నువ్వింటిదగ్గర లేవు. మీనాన్న కోర్టునించి రాడు. మరి నాకు కోపం రాదూ!

అప్పటివరకూ తాతగారు చెప్పేది ఆసక్తిగా విని, నవ్వేస్తూ అనూ లోపలికెళ్ళింది.

టిఫెను తయారుచేస్తోంది అన్నపూర్ణమ్మ.

మురళి తాతగారివైపు తదేకంగా చూస్తున్నాడు.

మోచెయ్యీ, మోకాలూ రక్తం చిముడుస్తున్నది చూసి పౌడరు తెచ్చి అద్దాడు.

"అబ్బబ్బా! ఈ చిన్నదెబ్బలు యేం చేస్తాయిరా నే చెప్పేది శ్రద్ధగా విను" అంటూ మురళి చేతిలోని పౌడరు డబ్బా లాగి ప్రక్కనపెట్టి....

"మురళీ! యిప్పటికి ఒక అంకం ముగిసింది. ఇంక ముందు యేం చేయాలో తెలుసా? అసలు మన ధ్యేయం గుర్తు వుందా?"

"నే మర్చిపోలేదు తాతయ్యా! అన్నం తింటూనే నీళ్ళు పోసుకుంటూన్నా ఆఖరికి నిద్రలోకూడా అదేధ్యాస. ఆ పరీక్షకోసం కొన్ని పుస్తకాలు చదవటం ఎప్పుడో మొదలు పెట్టాను తాతయ్యా."

"నిజం!"

"వూ!"

"నాకు తెల్సురా! నువ్వు నా ఆశల్లో ఆశ. నా మనస్సులో మనస్సు, నా బంగారుకొండ నా మురళీధర్" పొంగిపోతూ అన్నారాయన.

"తాతయ్యా! ఒక్క సంగతి గుర్తు వుంచుకో, నీ కోరిక నెరవేర్చటానికి నా కృషి లోపం చెయ్యను. తర్వాత ఫలితం ...." ఆగిపోయాడు.

"వూ! కృషికి తగిన ఫలితం తప్పకుండా వుంటుంది. నువ్వు కలెక్టరు కావాలి, తర్వాత అందాల బొమ్మలాంటి అయినింటి పిల్లని పెళ్ళి చేసుకుని మన ముత్యాలపల్లకీలో వూరేగాలి

ఆ పల్లకీ ముందు బ్యాండు, సన్నాయిమేళం దానిముందు గర్వం గా నేను జరీ అంచు వుత్తరీయం భుజాని వేసుకుని, వూరేగింపు ముందుకి సాగనిప్వమని అంటూ...."

"ఆ ...ఆ....యింక నే చెప్తా తాతయ్యా"అంటూవచ్చింది అనూరాధ. బడి వీథిలో, గుడి వీధిలో సన్నాయిని జమాయించి వాయించమని చెప్తావు....కదూ, ఇంకా....ఇంకా...." అంటూ నవ్వి—

"సరే యివి తీసుకోండి" అని అందించింది.

మురళి టిఫిను ప్లేటు అందుకుని తింటూ—

"తాతయ్యా, యశోదమ్మ యెలావుంది?" అడిగాడు.

"బాగానే వుందిరా!" నిన్ను చూడాలని కలవరిస్తోంది. నేను తిరిగి ఇంటికి వెళ్ళి ఈ శుభవార్త చెవిన వేసేవరకూ వీధి గడపలోనే కూర్చుని యెదురు చూస్తూ వుంటుంది. అలా అని ఈ రాత్రికే తిరిగి వెళ్ళాలంటే బాగా అలసటగా వుందిరా మురళీ.

"తాతయ్యా! నిజంగా యశోదమ్మ వాకిట్లో ఎదురుచూస్తూ కూర్చుంటుందా?"

"దాని నిరీక్షణ మాటలతో చెప్పలేను. కానీ నువ్వంటే యెందుకోమరి చాలా అభిమానం. నువ్వీ చదువు గొడవలో పడి చాలా రోజులుగా పల్లెకి రాలేదు గుర్తు వుందా? నిన్నోసారి రమ్మని చెప్పమనీ, వుత్తరం రాయమనీ యెంతో చెప్పింది నాకు నీ చదువు పాడైపోతుందని నేను చెప్పలేదు."

"అరె! నాకు తెలియనే లేదే, సరే తాతయ్యా నువ్విక్కడ విశ్రాంతి తీసుకో, నేను యశోదమ్మ దగ్గరకి వెళ్ళి ఈ వార్త చెప్పి వస్తాను. సరేనా."

"నువ్వు యిప్పుడు యశోద దగ్గరికి వెడతావా! నువ్వు పాసైనట్లు మీ నాన్నకింకా చెప్పలేదుగా! ఇప్పుడు వెడితే...."

"మరేం ఫర్వాలేదు. ఇప్పుడు వెళ్ళి తెల్లవారి ఎనిమిది కాకుండానే వచ్చేస్తాను. నాన్నగారు కోర్టుకి వెళ్ళకుండానే తిరిగొస్తాను."

అనూరాధ కాఫీ తెచ్చింది.

కాఫీ త్రాగేసి మురళి లేచాడు.

అన్నపూర్ణమ్మ మామగారిని కుశల ప్రశ్నలు వేస్తోంది.

"అమ్మా! నేను పల్లెకివెళ్ళి రేపు తొమ్మిది కాకుండానే వచ్చేస్తానమ్మా, నాన్నగారొస్తే పాసైనానని చెప్పు. యేం తాతయ్యా మరి వస్తాను."

"అరేయ్....మురళీ నేనూ నీవెంట వస్తా పద. అమ్మా, అన్నపూర్ణా అబ్బాయి వస్తే చెప్పు. మళ్ళీ త్వరలో వస్తాలే" అంటూ లేచి వుత్తరీయం భుజాన వేసుకుంటూంటే.

"అయ్యో, యెండలో వచ్చిన అలసటైనా తీరలేదు. అప్పుడే వెళ్ళగలరా" కోడలు అడ్డు చెప్పింది.

మురళి కూడా 'వద్దు తాతయ్యా' అన్నా ఆయనవినిపించుకోకుండా—

"ఫర్లేదులే, చీకటిపడ్డా నువ్వు వెంట వుంటావుగా"

మురళి చెప్పులు వేసుకుంటూంటే అన్నపూర్ణమ్మ విసుక్కుంది.

అదేదీ గుర్తించనట్లు "అమ్మా, నీకు ఈతపళ్ళూ, తాటి ముంజులూ తెస్తాలే"

"అమ్మా, నాన్నారికి చెప్పు" అంటూన్న మనవడి భుజంమీద చెయ్యివేసి బయలుదేరారు దశరథరామయ్యగారు.

మనవడూ, తాతా ఒకర్ని ఒకరు పట్టుకుని అలా నడిచి వెడుతూంటే చూస్తూ నిల్చిపోయింది అన్నపూర్ణమ్మ.

# 10

మురళి తాతగార్ని వెంటబెట్టుకుని బస్ దిగేసరికే దీపాలు పెట్టేవేళయింది. కాలువ దగ్గరకి వచ్చేసరికి తను మొట్టమొదటిసారి తాతగారితో పల్లెకి రావటం, ఈ కాలువలో తాతగారిభుజా లెక్కి కూర్చుని దాటటం గుర్తుకొచ్చి అలాగే క్షణం నిల్చిపోయాడు. యెండాకాలం అవటంవల్ల కాలువలో యేమంత యెక్కువ నీళ్ళు లేవు. అందుకే అటు వాళ్ళు ఇటూ, ఇటువాళ్ళు అటూ సులభంగా దాంట్లోదిగి దాటిపోతున్నారు. ఆ మొదటిసారి తర్వాత ఈ పల్లెకి చాలా సార్లే వచ్చాడు. బల్లకట్టుమీదయెన్నో సార్లు దాటాడు. కానీ అవంతగా గుర్తులేవు. ఈ రోజీ కాలువ

నిండుగావుంటే యెంత బాగుండేది? తాతయ్య చెయ్యినే పట్టుకుని అవలీలగా అవతలగట్టుకి నేను వచ్చేవాడిని. కానీ అవకాశంలేదు అనుకుంటున్నాడు మురళి.

దశరథరామయ్యగార్ని తెల్సిన యెవరో మురళి చదువు గురించి అడుగుతున్నారు.

"లా! రిజల్ట్సు ఇవాళే వచ్చాయి పాసైనాడు" అంటున్నారాయన.

"అయితే మనవడూ లాయరే అన్నమాట"

"అహహ! కాదు వీడు మా నారాయణలాగా ప్రాక్టీసు పెట్టడు. ఐ.ఏ.యస్ పాసై కలెక్టరవుతాడు. యేదో ఒక రోజున మన జిల్లాకి కలెక్టరుగా రావాలి. ఇదీ నా చిరకాల వాంఛ"

అవతలవ్యక్తి నవ్వుతూ వింటున్నాడు కానీ మురళి గుండె గుభిల్లుమంది.

"ఖర్మ. తాతయ్య యిప్పటినించే చాటింపు ప్రారంభిస్తే యెలా? అసలది జరుగుతుందో, లేదో అనేది దైవాధీనం" అలా చెప్తున్న తాతగారిమీద కోపం వచ్చేస్తోంది.

"ఏరా నాయనా, ఈ కాలువ నన్ను నువ్వు దాటిస్తావా? నిన్ను నేను దాటించాలా?" నవ్వుతూ అన్నారాయన.

"ఏంటలాగంటారు దశరథరామయ్యగారూ? మీ మనవ

డిప్పుడు చిన్నపిల్లాడా? మీ రలా వుండంకి. రెండు చేతుల్లోనూ యెత్తుకుని అవతల ఒడ్డుమీద దించేస్తాడు. అంతేనా మురళి బాబూ."

పల్లెకి వెళ్ళే పోస్టుమాష్టరు నవ్వుతూ అన్నాడు.

"నిజంగా మీరన్నంత పనీ వీడు చేసేలా వున్నాడు. ఒరేయ్....అంతపని వద్దుగానీ, నా చెయ్యి పట్టుకో చాలు. అసలే చీకటి పడుతోంది, చూపు ఆనదు."

మురళి తాతగారిని కాలువ దాటించటమే కాదు. పల్లె వెళ్ళేవరకూ ఆ చెయ్యి వదల్లేదు. చీకటి చిక్కబడింది. కబుర్లు చెప్పుకుంటూ అంతవరకూ నడిచిన మురళి ఇల్లు దగ్గర కాగానే తాతగారి చెయ్యి వదిలి చిన్న పిల్లాడిలా పరుగు తీశాడు.

యశోద వీధి అరుగుమీద కూర్చుని చూస్తోంది. తెల్లటి ప్యాంటు, ఫుల్‌హాండ్స్ షర్టు టక్ చేసి గబగబా తన దగ్గర కొచ్చేసిన మురళిని గుర్తే పట్టలేదు. ఇంకా దారివైపు చూస్తోంది దశరధరామయ్యగారు యెప్పుడు వస్తారో? యేం వార్త చెవిన వేస్తారో అని.

"యశోదమ్మా! నే పాసైనాను" ఒక్క అంగలో మట్టి గడపలు యెక్కి అరుగుమీదకి వచ్చేశాడు.

యశోదమ్మ పులిక్కిపడి యిటు తిరిగింది. వసారాలో తీగకి తగిలించిన లాంతరు వెలుగులో మురళిని క్షణం పరీక్షగా చూసి గుర్తుపట్టి-

"అరె, మురళి బావే.... నువ్వే.... వచ్చేశావా?" అంటోంది సంతోషంతో బిగ్గరగా.

"రావటం కాదు. పరీక్ష వ్రాసై మరీ వచ్చాను. నీకు చెప్పటానికి వచ్చాను."

"నిజంగానా మురళిబావా! నువ్వు పరీక్ష వ్రాసవుతావని అనుకుంటున్నా కానీ చెప్పటానికి నా దగ్గరికి యిప్పుడే వస్తావని అనుకోలేదు సుమా. యేదీ ఇలారా!' అంటూ గట్టిగా మెడ పట్టుకుని వంచి నుదురుమీద ముద్దు పెట్టుకుని చెయ్యి పట్టుకుని గబగబా ఇంట్లోకి లాక్కు వెడుతోంది.

మురళి నిర్ఘాంతపోయాడు. ఏమిటిలా చేస్తోంది యశోదమ్మ! చిన్నప్పుడు ఒకటి, రెండుసార్లు యిలా ముద్దు పెట్టుకోవటం గుర్తు వుంది. కానీ పెద్దవాళ్ళం అయ్యాక యెన్నోసార్లు యిక్కడికి వచ్చినా యిలా యెప్పుడూ చెయ్యలేదు. యశోద చేసిన పనికి మొదట కోపం వచ్చింది కానీ అంతలోనే ఆమె కళ్ళల్లో కన్పించే పుత్రవాత్సల్యం గ్రహించి దాన్ని తను సంబాళించుకున్నాడు.

యశోదమ్మ అప్పుడు 'పప్పు' పిసుకుని మురళి చుట్టూ మూడుసార్లు తిప్పి పెరట్లోవున్న బావిలో పారేసి వచ్చింది. మురళి తెల్లబోతూ....

"ఏంటిదంతా?" అన్నాడు నవ్వుతూనే.

"చెప్పనా!'

"ఊ!"

"అసలే అందగాడివి. అందులో వయస్సులో వున్నావు ఆపైన పరీక్ష వ్రాసైనావు. పెళ్ళికొడుకులా తెల్లని బట్టలు వేస

బట్టలు వేసుకుని పీట వెంట నడిచి వస్తూంటే యెందరాడపిల్లల దృష్టి నీమీద పడిందో అని వొస్త "దిష్టి" తీసేశాను. మురళి బాబూ! నువ్వొ. మీ రాకయ్యా సంతోషంలో తేలిపోతూ అక్కడే మీ ఆత్మీయుల మధ్య వుండిపోతారని అనుకున్నా కానీ యిలా నాకోసం వస్తావని అనుకోలేదు సుమా!"

"మరైతే వాళ్లలో కూర్చుని యెందుకు యెదురు చూస్తున్నావు?"

నవ్వేసింది యశోద. ఆ నవ్వు నేనెప్పుడూ నీకోసం యెదురు చూస్తూనే వుంటానన్నట్లుగా వుంది.

"అయ్యో నా మతి మండిపోనూ, యెప్పుడనగా భోజనం చేశావో, హాయిగా రాజబెడతానుండు. సరి సరి అసలు మంచినీళ్ళివ్వటం కూడా మర్చిపోయాను కదూ!" గబగబా గ్లాసుతో నీళ్ళు తెచ్చి యిచ్చింది.

మురళి నీళ్ళు తాగుతూ గ్లాసుమీదనుంచి యశోదమ్మను పరీక్షగా చూస్తున్నాడు. తను వూరు వచ్చి దాదాపు సంవత్సరం అయింది. ఈ సంవత్సరంలోనూ యశోదమ్మలో చాలా మార్పు కన్పిస్తోంది. బాగా చిక్కిపోవటమే కాక తల పూర్తిగా నెరిసిపోయినట్లుంది. యిదివరకు గబగబా నడిచేది యిప్పుడు మెల్లగా అడుగులు వేస్తోంది. కళ్ళక్రింద నలుపు పెద్దగా కన్పిస్తోంది. ముక్కున వున్న ఒంటిరాయి ముక్కుపుడక మాత్రం యెప్పటిలా మెరుస్తూనే వుంది.

వార్ధక్యం ప్రతి మనిషికీ తప్పదా? యెంత అందమైన శరీరమైనా యిలా ముడతలుపడి.... వదిలినటు అయిపో

వల్సిందేనా? నల్లటి ఒత్తైనజుత్తు యిలా తెల్లగా కావల్సిందే. తాతయ్యలో కూడా చాలా మార్పు కన్పిస్తోంది.

ముప్ఫయ్యేళ్ళ క్రితం యశోదమ్మ యెంత బాగుండేదో, అలాగే తాతయ్య కూడా నేనిప్పుడెలా వున్నానో అప్పుడు ఆయన అలా వుండి వుండవచ్చు. అయితే నేనూ ఓ పాతిక సంవత్సరాల తర్వాత యిలా తాతయ్యలా.... అవుతానా? అవను. అవుతాను. ఈ వార్ధక్యం అనేది ప్రకృతి ధర్మం. అలాంటప్పుడు .... బాధపడటం యెందుకు?.... నిజమే కానీ... నేను....అహ .. ఇంక ఆలోచించను.

మురళి ముఖం అరచేత్తో గట్టిగా తుడుచుకున్నాడో సారి___

యశోదమ్మ వసారాలోకి వెళ్ళి కాళ్ళైనా కడుక్కోకుండా, మంచంమీద పడుకుని కునుకు తీస్తున్న దశరథ రామయ్యగారిని లేపుతూ....

"అప్పుడే నిద్రా! పొయ్యి రాజబెడతాను! కాస్త లేచి వుడకెయ్యండీ" అంది.

"యశోదా! లేవలేనే, నువ్వే మురళికీ రాత్రి యేదో ఒకటి పెట్టు. నాకు ఆకలి లేదు. నిద్ర ముంచుకొస్తోంది. కోడలు దండిగా టిఫను పెట్టిందిలే" అంటూ అటు తిరిగి పడుకున్నారు.

"'ఖర్మ' యింక ఇళ్ళు అంటుకున్నా, మెలుకువ రాదీయనకి" నెత్తిన చేతులు పెట్టుకు కూర్చుండిపోయింది.

మురళికి నవ్వు వస్తోంది ఆ యిద్దరినీ చూస్తూంటే ...

"యశోదమ్మా! తాతయ్య లేచే మూడ్‌లో లేరు. పద ఈరోజు నీచేతి వంట తింటాను"

"మురళిబాబూ! వద్దు....వద్దు.... తెల్లారి సంగతి తెలిస్తే మీ తాతయ్య నన్ను బ్రతకనీయరు"

"మరేం భయంలేదు. నే చెప్తాగా! అసలిప్పుడు వంట చెయ్యనక్కర్లా. నీకోసం వండినది వుంటుందిగా! అదే యిద్దరం పంచుకుందాం. ఏం?"

ఆమాట అనటంలోని దర్పం మురళి ముఖంలో కొట్టవచ్చినట్లు కన్పిస్తుంటే, యశోదమ్మ అతన్ని కన్నార్పకుండా చూస్తూ నిల్చుంది.

"నేనెంత అదృష్టవంతురాలిని మురళిబాబూ" అంటూ చెయ్యి పట్టుకుని తీసుకువెళ్ళి వంటఇంట్లో పీట వాల్చి కూర్చోబెట్టింది. పొయ్యి క్షణంలో అంటించి యెసరు పెట్టింది.

"అయితే సువ్వు అన్నం వండుకోలేదా?" ఆ ఇల్లంతా పరీక్షగా చూస్తూ అడిగాడు.

"మీ తాతగారు వూళ్ళో లేకుంటే అసలు అన్నం సంగతే నాకు గుర్తువుండదు బాబూ....

అంటూ యేదో చేయాలని, పమిటదోపి యిటూ, అటూ హడావుడి పడిపోతూ తిరుగుతున్న యశోదమ్మని మంత్ర ముగ్ధుడిలా చూస్తూ....

"ఇందుకే కాబోలు తాతయ్య యిక్కడికి వచ్చేయటానికంటగా ఆరాట పడిపోతారు. యెంత ఓపిక లేకున్నా

రాత్రికి, పల్లెకి చేరుకోవటంలోని రహస్యం యిదా" అనుకున్నాడు.

కట్టెల పొయ్యి చుర చురా మండుతున్నా, పొగ వస్తూన్నట్లే వుంది. కళ్ళు నీళ్ళతో వూపిరి సలపటంలేదు. ఐనా అలాగే కూర్చుని యశోదమ్మకి ఓపిగ్గా జవాబు లిస్తున్నాడు.

వంట అయిపోయి అరిటాకు లేసి వడ్డించబోతూ ...

"అయ్యో! నీ పైటు ప్యాంటు నే గమనించనే లేదు. వుండు మీ తాతగారి లుంగీ యిస్తా" అంటూ వెళ్ళబోయింది.

"మరేం ఫర్లేదు. టెరీకాట్ ప్యాంటే .... నలగదు .... కానీ ఆకలి మండిపోతోంది" అనటం రవపు ఆకులో వడ్డించింది.

లేత అరిటాకులో గోధుమరంగుతో వున్న దంపుడు బియ్యం అన్నం ఆవిర్లు కక్కుతోంది. పొట్లకాయ కూరచేసి చారు పెట్టింది.

ఇంత రాత్రి అయినా, వయస్సులో పెద్దతనం వచ్చినా, యెంత ఓపిగ్గా చేసిందో అనుకుంటూ అన్నం కలుపుకున్నాడు.

యశోదమ్మ నేతిగిన్నె యెత్తి చేతి నిండుగా వేస్తూంటే....

"అరెరె ....అంత వద్దు .... ఇలా నెయ్యి తింటే అంత లావు అయిపోతాను" అంటున్నా, యశోదమ్మ విన్పించుకోవటంలేదు.

మురళి యశోదమ్మ చేతిలోని గిన్నె తీసుకుని క్రింద పెట్టేశాడు. దగ్గరే పీట వేసుకుని అన్నం తినే మురళిని పరవశురాలై చూస్తోంది. మురళి కూడా యశోదమ్మని చూస్తున్నాడు. నల్లటి ఆమె ముఖంలో కళ్ళలో యేదో చెప్పరేనంత సంతోషంతో కూడిన తృప్తి కన్పిస్తోంటే—

యశోదమ్మా! నేనంటే నీ కెందుకింత యిష్టం! నీ ఈ యిష్టమే నన్ను పట్టి కట్టి లాక్కు లాక్కు వస్తోంది! యేమిటీ విచిత్ర బంధం! దీనికింత శక్తి యెలా వచ్చింది.

తనలో తను అనుకుని పైకి యిలా అన్నాడు.

“యశోదమ్మా! నన్నెందుకింత అభిమానిస్తున్నావ్?”

పెరుగు వంపుతూన్న యశోదమ్మ మురళి ముఖంలోకి పరిశీలనగా చూసి “నేనంటే మరి నీ కెందు కింత యిష్టం?”

ఎదురు ప్రశ్నతో గతుక్కుమన్న మురళి మళ్ళీ తలెత్తకుండా పెరుగు ముదలు మింగేసి లేచి చెయ్యి కడుక్కోవటానికి పెరట్లోకి వెళ్ళాడు.

యశోదమ్మ చెంబుతో నీళ్ళు తెచ్చి మురళి చేతిమీద పోస్తూ చేతికి పోయేందుకు సోపు అందించింది. మురళి నీరియస్‌గా చెయ్యి కడిగేసుకుని వసారాలో తనకి వేసి వుంచిన మంచం మీదకి వచ్చి పడుకుని కళ్ళు మూసుకున్నాడు.

యశోదమ్మ భోజనం చేసి వంటిల్లు సర్దుకుని బైటకి వచ్చి లాంతరు తగ్గించబోతూ మురళి నిద్రపోయాడా లేదా! అని దగ్గరకొచ్చి చూసి “నిద్రపట్టినట్లుంది. చల్లగాలి కూడా

వేస్తోంది" తనలో తను అనుకుంటూ దుప్పటి తెచ్చి కప్పి వెళ్ళబోయింది.

"నాకు నిద్రరావటంలేదు" దుప్పటీ నడుంవరకూ లాగేస్తూ అన్నాడు.

"అయితే యింత సేపటినించీ దొంగ నిద్రనటిస్తూన్నావా! మురళీబాబూ పెద్దవాడివైనా చిన్ననాటి గుణాలు పోనేలేదే" చిన్నప్పుడు మురళి యేగోడచాటునో దాక్కుని హఠాత్తుగా వచ్చి యశోదని భయపెట్టి ఆనందిస్తూ వుండేవాడు. యశోదమ్మ మురళి మంచం దగ్గరగా వచ్చింది.

"నిద్ర రావటం లేదూ"

"కాదు. నే అడిగిన ప్రశ్నకి జవాబు కావాలి!"

"లేచి కూర్చుంటూ అన్నాడు."

"నాకే తెలియదు. నీకేం చెప్పను మురళీబాబూ! నాపిచ్చి మాటలో చెప్పాలంటే ఆరాధన"

"ఆరాధనా?" ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవైనాయి.

"అవును బాబూ! "స్త్రీ" భగవంతుడిని యెంతగా ఆరాధి స్తుందో అలాగే తను ప్రేమించిన వాడిని కూడా ఆరాధిస్తుంది. అయితే ఈ ఆరాధించే వ్యక్తి కేవలం భర్తే కావాలని యెక్క డుంది! స్నేహితులు కావచ్చు, మరెవరన్నా ఆత్మీయులు కావచ్చు యింకా యింకా యెవరైనా కావచ్చు, ఏం ఆశ్చర్యంగా వుందా!"

"యశోదమ్మ కొంత నిజం కొంత హేళనా చెప్తోందేమో అనే అనుమానం వచ్చి నా కింక వినాలని లేదు. నువ్వు పరిహా సంగా మార్చేశావు"

"కాదుబాబూ! నేనో నిజం చెప్పనా! మనిషి దేన్నైనా తప్పించుకోగలడు కానీ మనస్ఫూర్తిగా ఆరాధించే వ్యక్తుల నుంచి తప్పించుకుని దూరంగా పారిపోలేడు. ఆ శక్తి నిన్ను నా దగ్గరకి లాక్కొచ్చింది." అంతే నా కింక చెప్పటం చేత కాదు.

"అయితే నిన్ను వెతుక్కుంటూ వచ్చినందుకేం యిస్తావు?"

"ఏది కావాలన్నా సరే"

"నేను నిద్రపోవటానికి ప్రయత్నిస్తాను. నా మంచం దగ్గరే కూర్చుని చిన్నప్పటి పాట నిదురపో చిన్నికృష్ణయ్యా పాడాలి"

యశోద ముఖంలో యేదో వెలుగు కన్పించింది మురళికి.

చిరునవ్వు నవ్వుతూ మంచం దగ్గర నేల మీద కూర్చుని మురళి క్రాపులోకి వేళ్ళుపోనిచ్చి మెల్లగా సర్దుతూ ముంచెయ్యి వీపు మీద వేసి తడుతూ యెన్నో సంవత్సరాల తర్వాత గొంతెత్తి ఆ పాట పాడుతోంది యశోదమ్మ.

ఆమె పాటకి ప్రకృతే పరవశించినట్లు చల్లటిగాలి తెరలు తెరలుగా వీస్తోంది. నిశ్శబ్దంగా వున్న ఆ రాత్రి సమయంలో పరవశురాలై పాటపాడే యశోదమ్మ అలనాటి రేపల్లెలోని యశోదమ్మనే గుర్తుకు తెస్తోంది మురళికి.

"లాలీ చిన్నికృష్ణా నిదురపో .... బాబూ నిదురపో"

ఆ పాటలోని మాధుర్యానికి అలా అలా నిదురముంచుకు వచ్చే సింది మురళికి.

ఆ పాట పాడే ఆమె యశోదమ్మలా కాక ఎవరో తల్లి అన్నపూర్ణమ్మలా కన్పిస్తోంది. కాదు అనిపిస్తోంది. మురళి నిద్ర లోకి జారిపోయాడు కాని దశరథరామయ్యగారు మాత్రం లేచి కూర్చున్నాడు ఆ పాట వింటూ యశోదనీ మురళిని మార్చి మార్చి చూస్తుంటే ఎందుకో ఆయన కళ్లలో ఆనంద బాష్పాలు జలజలారాలాయి. ఆయన కింక నిద్ర పట్టలేదు కాని అలా పాడుతూనే యశోదమ్మ నిద్ర పోయింది.

మురళికి తెల్లవారు ఝామున మెలకువ వచ్చి కళ్ళు తెరచి చూశాడు. అప్పటికీ యశోదమ్మ మంచం పట్టెమీద తలపెట్టుకుని క్రింద కూర్చుని నిద్రపోతూనే వుంది.

స్త్రీ....అంటే ....అమ్మా. అనూరాధ .... రాజేశ్వరత్తయ్యా!. సునందా! ఒక్కొక్కరూ ఒక్కొక్కరకంగా వున్నారు. కాని యశోదమ్మ....మనస్సా ప్రపంచమైనా ఎంత చిత్రమైనది! ఏదో అమూల్యమైనదేదో దాగొట్టుకుని వుంటుంది! అదేమిటో! అర్థం కావటం లేదు.... అనుకుంటూ తనకి కప్పిన దుప్పటి తీసి మెల్లగా యశోదమ్మకి కప్పి కళ్ళు మూసుకు పడుకుని తెల్లవారి ఏడుగంటలకి లేచాడు.

"అరె! అప్పుడే ఏడు దాటింది తాతయ్యా! నాన్నారు కోర్టుకి వెళ్ళకముందు వెళ్ళిపోవాలి" అంటూ ముఖం కడుక్కుంటూనే యశోదమ్మ అందించిన చిక్కటి కాఫీ తాగేసి" మరి వెళ్ళిరానా యశోదమ్మాకి" అంటూ తాత

గారికి మళ్ళీ చెప్పే సందు మలుపు తిరిగే వరకూ వెనక్కి తిరిగి చూస్తూ యింక నడకవేగం హెచ్చించేశాడు మురళి.

# 11

నారాయణరావు కొడుకుతో

"ఎవరి దగ్గరన్నా జూనియర్‌గా చేరి ప్రాక్టీసు ప్రారంభిస్తే బాగుంటుందిరా మురళీ! నా ఈ "లా" పుస్తకాలూ అవీ నీకు పనికి వస్తాయి. నేనూ చూస్తూ వుంటానుగా బోలెడంత భవిష్యత్తు వుంటుంది"

అని యెన్ని విధాల చెప్పినా మురళి ఒప్పుకోలేదు.

నాకు ప్రాక్టీసు చేయాలంటే యిష్టంలేదు. ముందు ఐ ఏ యస్ పరీక్షకి కూర్చుంటాను. సెలెక్టు అయితే సరే లేకుంటే ఆ తర్వాత యేదైనా వుద్యోగ ప్రయత్నం చేస్తాను అంతే "అని ఖచ్చితంగా చెప్పేశాడు."

ఇంక తను పరీక్షకి కావల్సిన చదువులో మునిగి పోయాడు. అనూరాధ బి. ఏ. కూడా అయిపోయింది. రాజేశ్వరమ్మ కొడుకు గిరిధర్ చదువు పూర్తై యింటి కొచ్చేశాడు. వుద్యోగ ప్రయత్నా లేవీ కల్సిరావటం లేదు.

సునందకి యే సంబంధం కుదరకున్నా ప్రసాదరావు కూతురుపెళ్ళి ప్రయత్నాలు మానలేదు. వయస్సులో మురళి కంటే సునంద కొన్ని నెలలు మాత్రం పెద్దది.

ఇంత ఇందిరకి ఈ వూరు పూర్తిగా పాతబడిపోయింది. కొత్త కొత్త స్నేహితులతో పరిచయం యేర్పడింది. సతీష్ అనే యువకుడితో తరుచుగా సినిమాలకీ షికార్లకీ అంటూ తిరుగుతోంది. రాజేశ్వరమ్మ పూర్తిగా వేదాంత చర్చల్లో మునిగిపోయి చిన్న కూతురి ప్రవర్తన పట్టించుకోవటం మానేసింది.

సునంద అసలే మితభాషి. ఈ మధ్య మరీ మితభాషి అయిపోయింది. మురళి సలహా పాటిస్తూ పుస్తకాలు చదవటంలో మునిగిపోతోంది.

మురళి చదివి చదివి తలవేడెక్కినప్పుడల్లా సునంద దగ్గరకి కాలక్షేపం కోసం వస్తూ వుంటాడు. ఇద్దరూ ఓ గంట సేపు యెన్నెన్నో కబుర్లు చెప్పుకుంటారు. ఇద్దరి మధ్యా సంభాషణ తరుచుగా నేటి సాహిత్యం, రచయితలూ వాళ్ళు తీసుకునే విషయాలూ వాటి మీద పరదేశీ సాహిత్య ప్రభావం వగైరా వగైరా వాళ్ళతూవుండి మధ్య మధ్య రాజకీయాలు కూడా చోటు చేసుకుంటూ వుంటాయి. ఇలా సంభాషణలో పడితే యిద్దరికీ టైమే తెలియదు. ఇందిర యెప్పుడన్నా వచ్చి కూర్చున్నా "అబ్బ! బోర్" వెళ్ళిపోతుంది.

ఈ రోజు మురళి మేనత్తగారి ఇంటికి వెళ్ళేసరికి అలవాటుకి విరుద్ధంగా రాజేశ్వరమ్మ ఇంట్లోనే వుంది.

"రారా మురళీ! ఏమిటి కబుర్లు" అంటూ ఆహ్వానించింది.

"ఈ రోజు మీ స్వాములవారి ప్రవన్యాసం వగైరా ఏం లేదా అత్తయ్యా!" అంటూ సైకిల్ లాక్ చేసి వచ్చి కూర్చున్నాడు.

"మా స్వాముల వార్ని పోలీసులు శ్రీ కృష్ణ జన్మ స్థానానికి పట్టుకుపోయారా అంది విచారంగా ముఖంపెట్టి."

"ఎందుకు?" కుతూహలంగా అడిగాడు.

"ఆయన జన్మరహస్యం చాలా నిగూఢం. అయినా బైటకి లాగారెవరో. రెండు మూడు హత్యల్లో కూడా ప్రత్యక్ష ప్రమేయం వున్నదట. యింకా యింకా చాలా కేసులే బనాయించారు పోలీసులు. ఆయన్ని గురించి యెన్నో కథలూ చెప్తూన్నారు బావగారూ"

సునంద నవ్వేస్తూ అంది. రాజేశ్వరమ్మ ముఖం చిన్న బుచ్చుకుని పోనివ్వవే అదంతా యెందుకు కానీ గీతా రహస్యం అరటిపండు వలిచి చేతికిచ్చినట్లు చెప్తూవుండేవారు. ఎన్నాళ్ళుగానో ఆయిన దగ్గరకి వెడుతూన్నాం, మాట్లాడు తూన్నాం కానీ యింత గ్రంథం వెనక వున్న మనిషి అని యే మాత్రం అనుమానించలేక పోయాంరా మురళీ. ఆయన చెప్పిన మాటలు విని యెందరో ముముక్షువులు బాగానే చెల్లించుకున్నారుట. కాసి నే నల్లాయిచ్చింది. రెండు వందలే ... మీ మామయ్యగారు మరి జన్మలో స్వాముల వార్లని నమ్మను వీళ్ళ చూట్టూ తిరగటం కంటే తీర్థయాత్రలు మంచివి అంటూన్నారు."

"యేది యేమైనా త్వరలోనే మేలుకున్నందుకు సంతోషం." మురళి ఇలా అంటూండగానే ఇందిర నలుగురు

స్నేహితురాళ్ళని వెంటేసుకుని వస్తూనే వాకిట్లో మురళి పాత సైకిల్ చూసి—

"అమ్మో! ఈ పుష్పకవిమానం యిక్కడ వుంది బావగా రొచ్చారా"

అంటూ వచ్చి మురళిని చూసి "ఓ....బావా! గుడీవెనింగ్. వీళ్ళు నా ఫ్రెండ్స్. అమల జడ్జీగారి యేకైక పుత్రిక. ఇంక ఈ సిమి పోలీస్ ఆఫీసర్ గారి అమ్మాయి. ఈమె సోఫీ. అంటే పెట్టిన ముద్దు పేరు. తల్లి వుంది కానీ తండ్రి లేడు. అయితే నేం. మూడు తరాలకి సరిపోను ఆస్తి మూడు కార్లూ నాలుగు బంగాళాలూ అయిదు కుక్కపిల్లలూ నాలుగు పడతపిల్లటూ ఓ జింక పిల్లా పెంపుడు జంతువు లున్నాయి.

ఏం అలా చూస్తారే! అవి ఆస్తి క్రిందరావా! మరో ముఖ్య విషయం ఈ సోఫీకి రెడీమేడ్ మొగుడు అమెరికాలో వున్నాడు. త్వరలో ఇండియా వసాడు.

వాళ్ళ పరిచయం అయిన తర్వాత "ఇతను మా బావ మురళీధర్ బి. ఏ. యల్. యల్. బి...." అంటూ పరిచయం. చేస్తూంటే వాళ్ళందరూ "నమస్తే" అంటూ సుతారంగా చేతులు జోడించారు. మురళి కూడా "నమస్తే" అనటం తడవు ఇందిర వాళ్ళని తన గదిలోకి తీసుకువెళ్ళింది.

గదిలో అడుగుపెడుతూ మరోసారి వెనక్కి తిరిగి చూసి మరీ వెళ్ళారు. వాళ్ళ వస్త్రధారణా హెయిర్‌స్టైయిలూ రకరకాలుగా వుంది. వాళ్ళతో పోటీ పడుతూ వుంది.

ఇందిర అలంకరణ. ఇలాంటి అలంకరణలంటే దొత్తిగా నచ్చవు మురళికి.

"మురళీ రాపుడు పెన్ని పళ్ళీ పూరునించి వచ్చిందటగా మనవరాలని కూడా వెంటతీసుకు వచ్చి తిష్ట వేసిందటగా" రాజేశ్వరమ్మ నవ్వి అడిగింది.

"ఆ....ఆ....వచ్చింది. ఆవిడ గుండెదడ రోగానికి ఈ పూళ్ళో డాక్టరుగానీ మందివ్వలేడట. ఇంక ఆ నాగ నాంచారి అబ్బబ్బా! సినిమా డైలాగులతో నా ప్రాణం తీసేస్తోంది. చాలా విసుగ్గా వుంది అత్తయ్యా. అసలు ఇంట్లో వుండాలంటేనే భయం వేస్తోంది. చదువు సాగటంలేదు. వీళ్ళిప్పట్లో తిరిగి వెళ్ళేలాలేరు. అమ్మా నాన్నా పరువూ మర్యాదా అంటూ వాళ్ళకి వెళ్ళమని చెప్పలేరు. నన్ను చెప్పనివ్వరు. ఈ వచ్చిన చుట్టాలు యింత తిని వాళ్ళ పని చేసుకుని వెళ్ళిపోతే ఫర్లేదు కానీ ఇంట్లో తిని యింటి వాసాలు లెక్కపెడతారు ఎలా చచ్చేది. నిన్న ఏమైందనుకున్నావు!

అమ్మకి వంట్లో బాగాలేదు. అయినా మడికట్టి వంట చేయబోతూంటే ఆ రావుడమ్మ "అయ్యో అన్నపూర్ణా! నేనుండగా నీ కెందుకమ్మా అంత కష్టం వంట నేచేస్తాలే." అని చెప్పి పంపు దగ్గర స్నానం చేసి రెండు గంటలు జాగు చేసింది. పంపు బంద్ అయింది. ఇంక మడి విషయం దేవుడికి తెల్సు అసలు ఇంట్లో తానేందుకు నీళ్ళ మక్కర్లేదు.

ఇల్లంతా ఒకటే గొడవ. అనూని తడి చీరె కట్టుకుని మా రోడ్డు చివరనున్న నూతినించి నీళ్ళు తెమ్మని ఒకటేగోల అది పడలేక అమ్మ అనూ వెళ్ళ నని గోల చేసినా యెలాగో మందలించి పంపింది. అప్పుడేనాన్నారు. ఫ్లైటనించి వస్తూ అనూని చూసి ఇంటి కొచ్చి ఇల్లు యెగిరిపోయేలా అరిచారు.

కావుడమ్మసీ కేకలు పెట్టారు. నీళ్ళ బిందె దింపకముందే చెల్లాయికి జలుబు ప్రారంభమైంది. తడి చీరె కట్టు కోవటం అలవాటు లేక. తుమ్ములు. టాన్సిల్స్‌తో గొంతు వాచి ఒకటే

కావుడమ్మ పిల్లిలా మళ్ళీ మాట్లాడలేదు. అబ్బ. ఈ కావుడమ్మా నాగనాంచారి యమబోర్ కొట్టించేస్తూన్నారు."

సునంద పెదవులు బిగపట్టి వచ్చే నవ్వు ఆపుకుంటోంది. "పాపం బావగారు" అందిసానుభూతిగా చూస్తూ. "బావా! ఆ నాగనాంచారిని సినిమాకి షికార్లకి తిప్ప మంటుందటగా ఆ కావుడమ్మ. అలా పెట్టకూడదూ"

"సినిమాకేం ఖర్మ. అమెరికాకికూడా తీసుకెళ్ళ మంటుంది. ఆ పిల్ల అసలు ఆడపిల్లకాదు సునందా! లంఖిణి. రాక్షసి....నన్ను అన్నం తిననీయదు స్నానం చేయనీయదు. తల దువ్వు కోనీయదు....అబ్బబ్బా....యేం మాటలు. అవి మాటలు కావు. సినిమా డైలాగులే అన్నీ. అసలు ఆ పిల్లా ఆ వస్త్ర ధారణా అంతా సరిలీ తనమే. అబ్బ...." వికారంగా ముఖం పెట్టాడు.

రాజేశ్వరమ్మ పగలబడి నవ్వి పాతిక సంవత్సరాల క్రితం ఆడపిల్లలూ, పెళ్ళి చూపులూ, పెళ్ళిళ్ళు ఎలా జరిగేవో వాటిని గురించికథలూ చెప్పటం మొదలెట్టింది. ఆవిడ చెప్పేది చాలా కుతూహలంగా వింటూన్నారు. సునందా మురళి.

"ఈ కాపుడమ్మ కూతురు అంటే నాగనాంచారి తల్లి అన్నమాట. నేనూ వెళ్లాను వాళ్ళ వూరికి.అక్కడ జరిగిన విషయాలు తల్చుకుంటే ఇప్పటికీ నవ్వు వస్తుంది. ఆ పెళ్ళికి చుట్టాలు చాలా మందే వచ్చారు. వాళ్ళలో ఓ ఇద్దరు అక్క చెల్లెళ్ళు భర్తలలో సహా వచ్చారు.

వాళ్ళిద్దరిదీ ఒకటే పోలిక. పైగా మాసిగానే ఎప్పుడూ కెపలో గుడ్డ పట్టటం ఇష్టం. ఇది వాళ్ళభర్తలకి చాలా ఇబ్బందిగా ఉండేది. ఓ రోజు రాత్రి చిన్నమ్మాయి మొగుడు పదినగార్ని చూసి భార్య అనుకున్నాడుట చీకట్లో, దాంతో పెద్ద గాలీదుమారం లేచింది.

"కావాలనే తప్పు కన్పించకకాదు" పెద్దామె భర్త అంటూ తోడల్లుడు ఒకూ పడి అప్పటికప్పుడు పెట్టెలు పట్టుకుని భార్యలని తీసుకుని వెళ్ళిపోయారు.

ఇలాంటివి చెప్పాలంటే ఎన్నో సంఘటనలు.... అప్పటికే అయిదు రోజుల పెళ్ళిళ్ళు పోయినా ఈ కాపుడమ్మ గారాబాల ఏకైక పుత్రిక అయిదెకరాల సుక్షేత్రమైన మాగాణి పొలం అమ్మి అయిదు రోజుల పెళ్ళి వైభవంగా చేసి చుట్ట పక్కాల చేత 'సెభాష్' అన్పించుకుంది. ఇంక

అటు కూతురు అత్తవారింటికి వెళ్ళింది. ఇటు ఇల్లు కూడా వేలం వెయ్యటం అయిపోయింది.

ఆవిడకి నిలవనీడ లేక అల్లుడి పంచన చేరినా ఆనాడు తన కూతురు పెళ్ళి ఎంత ఆర్భాటంగా చేసిందో ఇప్పటికీ చెప్తూనే వుంటుంది. అలా చెయ్యమని సలహా యిస్తుంది. చేయలేని వాళ్ళని చూసి నవ్వుతుంది.

ఈనాగనాంబారిపుట్టగానేఅల్లుడువాస్తానుటుక్కుమన్నాడు. ఇంక కూతురి ఇంట్లో రావుడప్పు మాటకి తిరుగులేదు. ఈవిడ పట్టు ఉల్లాకపు పట్టు. మీ నాన్నా అమ్మా ఏం చేగలరురా మురళీ. నువ్వు వాళ్ళ వుచ్చు లోసించి ఎలా విప్పుకుంటావో నాయనా!

"రాజేశ్వరమ్మగారూ" అని వాకిట్లోకి యెవరో రావటంతో ఆవిడ లేచి వెళ్ళింది.

"బావా! నిన్ను చూస్తుంటే బోలెడంత జాలి వేస్తోంది."

సునంద జాలిగా చూసింది.

"ప్చ్! నువ్వేం జాలి పడక్కర్లేదు. చూస్తూ వుండు సునందా! రెండే రోజుల్లో రావుడప్పునీ ఆవిడ కూతుర్నీ వెనక్కి తిరిగి చూడకుండా పరుగెత్తేలా చేస్తాను. ఇందుకు ఓ ప్లాను సిద్ధం చేసుకున్నాను."

"ఏమిటది?"

"రహస్యం. చెప్పకూడదు"

"నే యెవరికీ చెప్పనుగా"

"ఫూహూ! లాభంలేదు"

"బావా! నువ్వు చాలా మంచి వాడివి కదూ! అసలు ఆ ప్లానేమిటో నేనూ తెల్సుకుంటే ఇంకేమైనా కావాలంటే సలహా ఇస్తానుగా"

సునంద హుషారుగా అంది.

"లాభంలేదు. అమ్మాయిగారూ !"

"అబ్బ! నీది గుండేనా! బండరాయా !"

"నువ్వెలా అనుకున్నా ఫర్వాలేదు. మరింక శెలవా" లేచాడు.

"ఆ....ఆ .. కూర్చో కాఫీ తెస్తా"

"వద్దు.. మళ్ళీ వస్తాలే....చాలా పైమయింది"

మురళి ఇంటికి బయలు దేరాడు.

## 12

అన్నపూర్ణమ్మ కూతురు పెళ్ళి చేయాలని భర్తని పోరుతోంది. ఒకసారి దశరధరామయ్యగారు పల్లెనుంచి వచ్చినప్పుడు అనూరాధ పెళ్ళి ప్రస్తావన తెచ్చి "చిన్నాన్నా!" రాజేశ్వరక్కయ్య కొడుకు గిరిధర్‌ని యిచ్చి అనూకి పెళ్ళి చేస్తే బాగుంటుందని ఇదివరకోసారి అన్నావుగా. గిరి మన మురళి కంటే కాస్త పెద్దవాడైనా అనూకి ఈడూ జోడూ సరిగా ఉంటుంది.

అందులో ఉద్యోగం కూడా చేస్తున్నాడయ్యె. వాడు దూరంలో వున్నా త్వరలో శలవు పెట్టి వస్తూన్నట్లు ఉత్తరం రాశాడట. మరి వాడు వచ్చేలోపల అక్కయ్యనీ, బావగారినీ వప్పిస్తే....బాగుంటుంది. ఈ పని మీరే సానుకూల పడేలా చేయాలి" అన్నాడు నారాయణరావు.

"అవన్నీ తర్వాత అసలు గిరిని చేసుకోవటం మన అనూకి ఇష్టమేనా ! అది తెల్సుకో!"

అంటూండగానే అనూరాధ కాఫీ గ్లాసుతో అక్కడికి వచ్చింది. తాతగారు అన్నమాట వింటూనే సిగ్గుతో కళ్ళు వాలి పోయాయి. గ్లాసు అందించి వెళ్ళి పోయింది.

నారాయణరావు మాట్లాడలేదు. అన్నపూర్ణమ్మ మాత్రం "మనమాట కాదంటుందా! అదీ కాక మీరే అడిగి తెల్సుకోండి" అంది కాస్తదూరంలో నిల్చుని.

"అక్కరలేదు. గిరిలాంటి బావని యేమరదలు కాదంటుంది. వాడికేం దొరబాబులాఉంటే. ఫైనాన్షియర్ ఇంజనీర్. ఈ వ్యవహారంలో మీరెవ్వరు వస్తు లెందుకు. నేనే స్వయంగా కనుక్కుంటాను. ఇప్పుడే వెళ్ళి రాజేశ్వరితో మాట్లాడివస్తా" అంటూ ఉత్తరీయం భుజాన వేసుకుని నారాయణరావు వస్తానన్నా వద్దని ఆయన ఒక్కరే రాజేశ్వరమ్మ ఇంటికి వెళ్లారు. మురళి ఇంట్లో లేడు.

తాతగారు మేనత్త ఇంటికి వెళ్ళిన దగ్గర నుంచీ అనూరాధ మనస్సు మనస్సులో లేదు. గిరిధర్ అందగాడూ,

తెలివైనవాడూ చలాకీగా కబుర్లు చెప్తూ అనూ మనస్సుని యెప్పుడో ఆక్రమించేశాడు.

పుణ్యోవున్నప్పుడు ప్రతిరోజూ మేనమామగారి ఇంటికి వస్తూ అనూరాధతో కబుర్లు చెప్తూ అప్పుడప్పుడూ సినీమాలకి ఆహ్వానిస్తూ ఉండే గిరి బావ అంటే చాలా చాలా యిష్టం ఏర్పడింది అనూకి. అసలు గిరిధర్ మురళీ కాస్త యెంచు మించుగా ఒకే పోలికల్లో ఉంటారు.

ఒకసారి ఇందిర అనూరాధని వాళ్ళ ఇంటికి రమ్మని తీసుకు వెళ్ళి తన చీరెలూ నగలూ అన్నీ చూపిస్తూ ఫోటోల 'అల్బం' కూడా చూపించింది. దాంట్లో యెన్నో గిరిధర్ ఫోటోలు వున్నాయి. ఇందిరవీ వున్నాయి.

కానీ సునందది ఒక్కటీ లేదు. అసలు సునందకి ఫోటో తీయించుకోవటం బొత్తిగా ఇష్టం ఉండదని చెప్పింది ఇందిర. గిరిధర్ ఫోటోలన్నింటిలోకీ ఒకటి చాలా నచ్చింది. గిరిధర్ కళ్ళలో యేదో తెలియని ఆకర్షణ అనూని బందీ చేసింది. ఇందిర చూడకుండా ఆ ఫోటో దాచేసుకుని ఇంటికి తెచ్చేసుకుంది. అయితే వచ్చిన దగ్గర నుంచీ ఇందిర గుర్తిస్తే యేమనుకుం టుందో అని సిగ్గు. అంత పరీక్ష వుండదులే అనే ధైర్యం.

ఆ ఫోటోని యేకాంతంగా ఎన్ని సార్లు చూసినా తనివి తీరదు. అలా ఆ ఫొటో వైపు తదేకంగా చూస్తూ తన్మయ త్వంలో పరిసరాలని మర్చిపోయి ఒకసారి అన్నగారికి పట్టుబడి పోయింది.

మురళి చెల్లెలి ఏకాగ్రతకి కారణం తెలియక వెనక్కి వెళ్ళి చూశాడు. చెల్లెలి చేతిలోని గిరిధర్ ఫొటో చూశాడు. అడుగుల చప్పుడుకి అనూ పులిక్కిపడి వెనక్కి తిరిగి అన్న గారిని చూస్తూనే పట్టుబడిన దొంగలా నేల చూపులు చూస్తూబావ ఫొటో వెనక్కి దాచుకుంది.

మురళి మౌనంగా వుండి అతి మామూలుగా బట్టలు మార్చుకుని తువ్వాలు పైన వేసుకుని స్నానానికి వెళ్ళిపోతుంటే అన్నగారి ముఖంలో ఎలాంటి భావం వుందో గ్రహించలేకపో యింది. స్నానం చేసి వచ్చి నిలదీసి అడుగుతాడనుకున్న అనూరాధకి మళ్ళీ నిరాశేయెదురైంది.

ఎంత చిన్న విషయమైనా ముఖంమీద అడిగెయ్యటం అలవాటున్న అన్నయ్య ఇలా ఎందుకు వూరుకున్నట్లు! అసలు అడిగితే ఏమని జవాబివ్వాలో అని ఆలోచిస్తూన్న అనూరాధకి ఎంత ఆలోచించినా అర్థం కాలేదు. అయితే చెల్లెలి మనస్సు గిరిధర్ దొంగిలించాడనే సత్యం మురళి ఎప్పుడో గ్రహించా డని పాపం పిచ్చి అనూరాధకి తెలియదు.

తాతగారు పెళ్ళి మాటల కోసం అత్త ఇంటికి వెడుతూ తన దగ్గరకొచ్చి "ఏం అనూ గిరిబావ అంటే నీ కిష్టమేనా?" అని అడగాలనీ అలా అడిగి జవాబు చెప్పించుకు వెడతాడనీ అనుకుంది. కానీ తను అనుకున్నట్లు ఒక్కటీ జరగటంలేదు. వీళ్ళందరికీ నే బావనే పెళ్ళి చేసుకుంటానని డప్పు పట్టుకుని చాటింపు వేశానా? లేకుంటే యేమిటిదంతా! తాతయ్య ఓ నవ్వు పారేసి చూసేసి వెళ్ళిపోయాడు.

పోనివ్వు యిదీ మంచిదే. లేకుంటే బైట సంబంధాలు చూస్తూ పెళ్ళి కొడుకుల ఇంటర్వ్యూలని యేర్పాటు చేస్తే "నా కిష్టం లేదు! గిరిబాబుని తప్ప మరొకర్ని చస్తే చేసుకోను" అని చెప్పవల్సిన అవసరం లేకుండా పోయింది. ఇంత వరకూ బాగానే ఉంది. కానీ అత్తయ్యా వాళ్ళు యేమని జవాబు చెప్తారో!

అప్పుడప్పుడూ కబుర్లలో బంధువులూ స్నేహితులూ "అనూరాధ రాజేశ్వరమ్మ కోడలేగా" అన్నా ఆమె అవుననీ కాదనీ అనలేదు. నవ్వేసి వూరుకునేది. ఇది అత్తయ్యకి అంగీకారమే అని తన ధైర్యం.

"అయితే తాతగారు వచ్చి ఏ వార్త చెప్తారో" అని ఆయన రాక కోసం వీధి వాకిలి వద్ద 'పహరా' కాస్తోంది అనూరాధ.

దశరథరామయ్యగారు ఎంత సేపటికీ రాలేదు. నారాయణ రావు "పని వుంది త్వరగా వస్తాలే" అంటూ బైటకి వెళ్ళాడు. అనూరాధ వరండాలో ఇటూ అటూ పచార్లు చేస్తోంది.

"నేనింత ఆతురత చెందినా తాతయ్య వచ్చి నేరుగా జరిగింది నాకు చెప్పడే. అడగాలంటే యెగతాళి పట్టిస్తే. ఇలా పరిపరి విధాలపోతూన్న మనస్సుని అదిమి పట్టుకుని వాకిట్లో యెవరివో చెప్పులు చప్పుడవటంవిని "తాతయ్య వచ్చేశారు" అనుకుంటూ గభాలున గదిలోకి పారిపోయింది.

వాకిట్లో చెప్పుల చప్పుడు వరండా వరకూ వచ్చి ఆగిపోయింది.

క్షణం నిశ్శబ్దం. ప్రాణం బిగపట్టి వూపిరి వదులుతున్న అనూకి 'లాయరుగారూ!' అన్న బొంగురు గొంతు విన్పించింది.

"ఫీ! !" అనుకుని వాకిట్లోకి వచ్చి "ఓ గంట తర్వాత వస్తారు నన్నారు."

ఇంటిలో లేరు "అంది విసుగ్గా" అతను వెళ్ళిపోగానే నీరసంగా వచ్చి మంచం మీద వాలిపోయింది. ఓ అర్ధగంట తర్వాత మురళీ, నారాయణరావూ, దశరథరామయ్యగారూ కాస్త వ్యవధానంగా ఒకేసారి ఇల్లు చేరారు.

"భోజనాలకి రండి" అన్నపూర్ణమ్మ భర్తకీ, మామ గారికీ, పిల్లలకీ వడ్డించింది.

"చిన్నాన్నా ! ఏమయింది ?" మెల్లగా కదలేశాడు విషయం.

"ఇంకాస్త కూరకావాలా" అంటూన్న కోడలితో "వద్దమ్మా" అంటూ చెయ్యి అడ్డు పెట్టి ప్రక్కనే వుంచిన స్టీలు మరచెంబులో నీళ్ళు గడగడా తాగి నుదురికి పట్టిన చెమటని పైమీది తువ్వాలుతో తుడుచుకుంటూంటే అనూరాధ వూపిరి బిగపట్టి తాతగారు చెప్పబోయే విషయం కోసం నిరీక్షిస్తోంది. మురళి ఫుల్‌హాండ్స్ షర్టు కుడిచెయ్యి కఫ్స్ విప్పి మోచేతి వరకూ మడిచి అమ్మ వేసిన పెరుగు కలుపుకుని తింటూన్నాడు.

"రాజేశ్వరి" 'లిటిగేషన్' షనిపిరా నారాయణా! ఒక వైపు "నువ్వు చెప్పినదానికి సరే చినాన్నా" అంటూనే చిన్న తిరకాసు పెట్టింది.

అత్తయ్య "సరే అంది" అన్నమాట విన్న అనూరాధ ఆనందంతో అలా గాలిలా తేలిపోతూ ఆ పైన తాతగారు ఏం చేస్తున్నారో విన్పించుకోకుండా పెరుగన్నం తినేసి చెయ్యి కడిగేసుకుని ఒక్క పరుగులో గదిలోకి వచ్చేసింది. అక్కడే కూర్చుంటే తన ముఖంలోని సంతోషం అందరూ గుర్తిస్తారేమో అనే భయంతో వచ్చేసి ఈ ఆనందంలో నాట్యం చెయ్యాలనీ, గొంతెత్తి పాట పాడాలనీ ఏదో ఏదో చేసేయాలన్పిస్తోంది. భద్రంగా దాచుకున్న దాప భాగంలోని ఒకసారి చేతిలోకి తీసుకుని గిర్రున తిరిగి గుండెల దగ్గర దాచేసుకుంది.

ఇంక భోజనాల దగ్గర దశరథరామయ్యగారు కొడుకుతో మెల్లగా యిలా చెప్పారు.

"ఇందిరని మురళికి చేసుకుని అనూని వాళ్ళ అబ్బాయికి యివ్వాలట. ఈ రెండు శుభకార్యాలకి వీలైనంత తొందరలో లగ్నాలు పెట్టించెయ్యమని అంది! ఇరువైపులా ముఖ్యుడివి నీవేగా చిన్నాన్నా, అని గుర్తు చేసింది."

చెల్లెలి పెళ్ళి విషయం తాతగారూ తండ్రీ మాట్లాడుకుంటూ వుంటే సావధానంగా వింటూన్న మురళికి 'ఇందిరని చేసుకుని' అన్నమాట నెత్తిమీద పిడుగు పడినట్లయింది. ఏమిటీ! నేనా ఇందిరనా! పెళ్ళి చేసుకోవాలా! లేకుంటే....

అనూని గిరికి చేసుకోరూ! ఇదేమిటి! పురుషుని పిడుగు, ఇందిరని చేసుకోవటం జరగని పని. అందగత్తె కావచ్చు. చదువుకుని నలుగురిలో నాగరికంగా తిరగొచ్చు. హుషారుగా వుండచ్చు. కాని ఆ అమ్మాయి అలవాట్లూ మాట్లాడే తీరూ వేసుకునే డ్రెస్సూ వచ్చినా నచ్చవు పైజామాలాల్చీ, లుంగీ షర్టూ.... బెల్బాటం ప్యాంటూ ఇంకా ఇంకా ఎన్నో ఫాషన్లు. అవన్నీ తనకి నచ్చవుగాక నచ్చవు.

తన చెల్లెలిని అలాంటి డ్రెస్ వేసుకోనియడు. "బాజు" మన స్త్రీత్వం అన్నా భరిస్తాడు కానీ ఆడపిల్లలు అలా అలంకరించుకోవటం అంటే తగని అసహ్యం మురళికి.

అసలు అనూ లంగా ఓణీ యిప్పుడు అందమైన డిజైన్లలో వున్న చీరలు కట్టుకుంటుంది. ఏ పండగ కానీ, పుట్టిన రోజు కానీ చెల్లాయికి మాత్రం సామాన్యంగా మురళే చీరెలు బజారు నుంచి తెస్తాడు. యెన్నోరకాలు చూసి సరికొత్త డిజైన్లు తెస్తూంటాడు. అన్నయ్య తెచ్చిన చీరె సంగారించి అనూ తెగ మురిసిపోతుంది. ఆ కొత్త చీరె కట్టుకు కాలేజీకి వెడితే—

"అబ్బ! ఎంత బాగుంటోయ్ అనూరాధా. ఎక్కడకొన్నావ్ ఖరీదెంత ? ఇంకా ఇలాంటి చీరలున్నాయా. బోర్డర్ చాలా బాగుంది. కలర్‌కి కరెక్ట్‌మాచ్ అయింది." అంటూ స్నేహితులు చుట్టుముడితే అప్పుడు అనూ కళ్ళు గర్వంతో మెరుస్తాయి. "మా బ్రదర్ సెలక్షన్" అంటుంది

నిటారుగా నిల్చుని చీరె బోర్డర్ సుతారంగా వేళ్ళతో సర్దు కుంటూ___

"ఈజిట్! మగాళ్ళకి అందులో బ్రహ్మచారికి యింత అందమైన చీరె సెలక్షన్ తెల్సునంటే మంచిదే" అంటూ సాగదీస్తారు.

అసలు మురళి ఎలాంటి చీరె తెచ్చినా అనూకి బాగా నచ్చుతుంది.

ఇంక రోజుకోరకం డ్రెస్ అయి హద్దులులేనట్లు బాయ్ ఫ్రెండ్స్‌తో సినిమాలూ షికార్లూ చేసే ఇందిర అంటే మురళికి కొస్త కూడా సదభిప్రాయంలేదు. ఒక్కొక్కప్పుడు అనుకుంటాడు. అసలు ఇందిర అలా తిరుగు తూంటే గిరి ఎలా ఊరుకోగలు తున్నాడు. ఇందిరే నా చెల్లెలు అయితేనా! చెంపలు వాయించి హద్దులో వుంచే వాడినని. కానీ అత్తయ్య కూతురైపోయింది.

అసలు ఆడపిల్ల అంటే చూడగానే ఎదటి వ్యక్తికి గౌరవ భావం కలగాలి అనే మనస్తత్వం మురళిది. "మా చెల్లెలు" అని ఎందరిలోనైనా చూపించగల విధంగా వుంటుందిఅనూరాధ. తన చెల్లెల్ని చూసుకుని ఏసరంత గర్వ పడతాడు కూడా అప్పు డప్పుడూ. అసలు ఇందిర కంటే సునంద అంటే గౌరవముంది, ఏదిఏమైనా ఇందిరని పెళ్ళి చేసుకోవటం కలలోని విషయం.

తనలో తను అనుకుని తండ్రికి చెప్పేయాలని తొందర పడిపోతూన్నాడు.

దశరథరామయ్యగారు చెప్పిన విషయం అంతా విన్న నారాయణరావు మరేం మాట్లాడలేదు కానీ అన్నపూర్ణమ్మ ముఖం వివర్ణమైంది.

"మామగారూ! మన పిల్లని వాళ్ళబ్బాయికి యివ్వటం ఆచారంగానే వాళ్ళ పిల్లని చేసుకోవటం యెదురు మేనరికంకదూ! ఈ ఆచారం మనకి లేదు పైగా కుండ మార్పు పెళ్ళిళ్ళుఅవవూ" అంది.

"అవునమ్మా! నేనూ ఇది ఆచారం కాదు రాజేశ్వరీ అన్నాను. అయితేనేం రాజేశ్వరి నవ్వి "అ....అదేం చేయరానంత తప్పుకాదు" అంది.

"అయితే మరి ఇప్పుడేం చేయాలి?" నారాయణరావు వొడిగా అన్నాడు.

"అదే నేనూ ఆలోచిస్తూన్నాను. రాణీ గుణం తెల్సిందేగా! మాట అన్నదంటే జరిగే వరకూ నిద్రపోదు. చిన్నప్పటి నించీ దానివరస అంతే. నే లేచి యింటికి వచ్చేస్తూంటే" కూడా "చిన్నాన్నా ఇది జరిగితేనే అది జరుగుతుంది" "అనిగట్టిగామరీ చెప్పింది' అంటూ చెయ్యికడుక్కోనేందుకు లేచారాయన. మురళి చివాలున లేచి—

"తాతయ్యా! ఇప్పుడే చెప్తూన్నాను. నేనిప్పుడప్పుడే పెళ్ళి చేసుకోను.

ఇందిరని అసలు చేసుకోను. అత్తయ్య అనూని కోడలుగా చేసుకుంటుందో లేదో గట్టిగా అడిగేసెయ్యండి. కాదంటే మరో సంబంధం దొరక్కపోతుందా! దేశం గొడ్డు

పోయిందా! ఇంతే...." అంటూ చరచరా తమ చదువుల గది లోకి వెళ్ళిపోయాడు."

నారాయణరావు ఇంత పెద్దవాడైనా ఈనాటికీ పినతండ్రి ఎదురుగా ఔననీ కాదనీ చెప్పడు. చెప్పే అలవాటులేదు కూడా—

ఆయన అంటే వుండే అభిమానంతో మాత్రమే. ఆ గౌరవం అంతే. ఇదే ఈనాటి యువకుల్లో కొరవడింది. మురళి అన్ని విషయాల్లో తండ్రి మాట కాదనకున్నా తన అభిప్రాయాలు నచ్చని వాటిల్లో యే మాత్రం సంకోచించక నిష్కర్షగా చెప్పేస్తాడు. ఖచ్చితంగా మాట్లాడే అలవాటు తాతగారి దగ్గర పుణికి పుచ్చుకున్నాడు అంటారు బంధువు లందరూ—

"ఇలా అయితే అనూ పెళ్ళి యెలా జరిగేట్లు" భయపడుతోంది అన్నపూర్ణమ్మ "అనూ అందమైనదీ చదువున్నదీ. ఇంక కట్న కానుకల్లో ఏ మంతలోపం చెయ్యం కనుక అటూ రాజేశ్వరమ్మ కోడలే" అని యిన్నాళ్ళూ అనుకున్నారు.

తీరా సమయం వచ్చేసరికి మురళికి ఇందిరని చేసుకోమని మెలికె పెడుతుందని ఎవరూ వూహించలేదు. పోనీ మురళి అయినా మారం ఆలోచించకుండా 'నేనిందిరని చస్తే చేసుకోను' అని ఖచ్చితంగా చెప్పేశాడయ్యె. ఇంక ఈ పెళ్ళి జరిగేదెలా! అన్నపూర్ణమ్మ ఆలోచనలో

పడిపోయింది. ఆవిడే కాదు అందరూ ఆలోచనల్లో మునిగి పోయారు.

"అత్తయ్య అనూని చేసుకోవటానికి వప్పుకుంది" అన్నమాట విన్నసంతోషం పొంగు తగ్గక ముందే అన్నగారి గొంతు "నే చస్తే ఇందిరని చేసుకోను" అన్నమాట విన్న అనూరాధ కాళ్ళు వణికాయి. "మళ్ళీ ఇదేమిటి!" అనుకుని తర్వాత తల్లిదండ్రులూ తాతగారూ అనుకునే మాటలు శ్రద్ధగా వింది. ఇంతవరకూ తను కట్టుకున్న వూహాసౌధపు పునాదులు కదిలిపోతూన్నట్లు భయపడి ఒలుపుని అంటి పెట్టుకుని నిల్చిపోయింది అనూరాధ.

విసురుగా గదిలోకి వచ్చిన మురళి చెల్లెలిని క్షణం చూసి తల తిప్పి వెళ్ళి టేబిల్ లైటు వేసుకుని చదువులో నిమగ్నుడవటానికి విశ్వప్రయత్నం చేస్తూన్నాడు. కానీ సాధ్యం కావడంలేదు. టైము పన్నెండు గంటలు దాటినా ఆ గదిలోనే మంచం మీద పడుకున్న అనూరాధ ఇటూ అటూ కదులుతూనే వుంది.

వరండాలో తాతగారు మంచినీళ్ళు తాగి మళ్ళీ పడుకున్నా నిద్రపట్టలేదని మాటి మాటికీ కిర్రు కిర్రు మంటూన్న మంచం చప్పుడు తెల్పుతోంది. మురళి ఇంక చదువు సాగదని లైటు తీసి వరండాలోకి వచ్చాడు. తాతగారు మురళిని పల్కరించలేదు. ఒక ప్రక్కకి వత్తిగిలి పడుకున్నాడు. ఆఫీసు రూములో ఇంకా లైటు వెలుగుతూనే ఉంది "నాన్నారింకా ఫైల్సు చూసు కుంటూన్నారా" అనుకుని గది వాకిట్లోకి వెళ్ళి లోపలికి తొంగి చూశాడు.

నారాయణరావు రెండు చేతులతోనూ తల పట్టుకుని కదలక మెదలక అలాగే కూర్చున్నాడు. తండ్రిని అలా చూసే సరికి మురళి మనస్సు కలత చెందింది. గిర్రున వెనక్కి తిరిగి గదిలోకి వచ్చి కిటికీ తలుపులన్నీ తెరిచి పడుకోబోతూ చెల్లెలివైపు చూశాడు.

అనూరాధ గోడవైపు తిరిగి పడుకుంది .... మురళి పడుకుని కళ్ళు మూసుకున్నాడు. ఆలోచనలు సాగిపోతూన్నాయి.

అత్తయ్య ఈ కొత్త సమస్యని యెందుకు సృష్టించినట్లు! అసలు వాళ్ళకిలాంటి కోరిక ఉన్నట్లే తెలియదే! అమాయకరాలైన అనూ మనస్సులోని కోరిక పెంచి కొడుకుని ఎరగా పెట్టి నన్ను తన అల్లుడిగా చేసుకోవాలనా ఆవిడ కోరిక.

తనకు కాబోయే భార్యకి చదువుతోబాటు సంస్కారం వుండాలి.

అణకువ వుండాలి. ఉద్యోగం చేస్తాననీ క్లబ్బులూ, మహిళా సమాజాలూ అంటూ తిరిగే అమ్మాయి అక్కర లేదు.

ఇల్లాలు అంటే ఇంటికి మహాసామ్రాజ్ఞి. కుటుంబ సభ్యులకి ప్రేమా వాత్సల్యం పంచుతూ అమృతమూర్తిగా వుండాలి. భర్త బైట ఎంత కష్టపడి బాధ్యతలు నిర్వహించి వచ్చినా ప్రశాంతంగా వున్న ఇల్లునీ చిరునవ్వుతో ఎదురొచ్చే ఇల్లాలినీ చూస్తూనే తన శ్రమమర్చిపోయి హాయిగా ఆనందంగా గంతులేసేటట్టు తేలికపడాలి మనస్సు అంతే కానీ

స్త్రీని కూడా ఉద్యోగం అంటూ యంత్రంలా తయారు చేస్తే యింక గృహస్థుకి శాంతి ఎక్కడ లభిస్తుంది. పిల్లలకి క్రమ శిక్షణ యెలా వస్తుంది!

తప్పని సరైన పరిస్థితుల్లోనే స్త్రీ ఉద్యోగ బాధ్యతలని మీద వేసుకోవాలి.

ఇలా సాగిపోతున్నాయి మురళి ఆలోచనలు. ఎందరు ఎన్ని విధాల పత్తిడి తెచ్చినా ఇందిరని పెళ్ళి చేసుకోవటం అసంభవం. మరోసారి దృఢ నిశ్చయం చేసుకుని నిద్రపోవాలని ప్రయత్నిస్తూన్నా లాభం లేకుండాఉంది.

నాన్నగారిని ఎదిరించానని అమ్మ లోలోపల బాధపడు తోంది. కానీ నన్ను అర్థం చేసుకోదు. కాలం మారిపోతోంది. స్వతంత్ర భావాలున్న నేను సూటిగా చెప్పకుండా ఉండలేను. ఇలా చెప్పటం నాన్నగారిని అగౌరవపర్చటం కాదు.

"అనూరాధంటే నా కుండే ప్రేమా అభిమానం ఏ మాటల్లో వ్యక్తీకరించగలను."

"బహుశా తాతయ్యతో గూడా తగూ వస్తుందేమో! అసూ ఆయనకి గారాబాల పసుపరాలు. ఏం చెయ్యాలి. ఈ పరీక్ష నుంచి బెట పడేదెలా!"

మురళి కళ్ళు గట్టిగా మూసుకున్నాడు. తెరిచిన కిటికీలోనుంచి చల్లటిగాలి రివ్వున వీస్తోంది. గోడగడియారం

ఠంగ్ ఠంగ్న రెండు గంటలుకొట్టింది అయినా మురళిని నిద్రా దేవి కరుణించలేదు. కళ్ళు మంటలు పెడ్తున్నాయి.

"భగవాన్...." అనుకుని నిట్టూర్చాడు. దుప్పటీ తీసి క్రింద నించి మీదకి ముసుగు బిగించేశాడు.

# 13

కాలం గడిచిపోతోంది. రోజులూ, వారాలూ, నెలలూ, చకచకా జరిగిపోతున్నాయి. దశరథరామయ్య గారు రాజేశ్వరికి ఏవిషయం తర్వాత కబురు చేస్తాం అని చెప్పి పల్లెకి వెళ్ళారు. చాలా రోజులైనా తిరిగిరాలేదు.

"నారాయణరావు ఉత్తరం రాసినా 'వీలు చూసుకు వస్తా' అని జవాబురాశారు."

మురళి ఐ. ఎ. యస్. పరీక్షలు రాశాడు. బాగానే రాసినా మనస్సులో ఆవేదన. ఫలితాలు ఎలా వుంటాయో! అని. ఇవి తెలిసేవరకూ దూరంగా ఎక్కడికన్నా పారిపోవాలన్పిస్తోంది. రోజులు చాలా అశాంతిగా గడిపేస్తున్నాడు.

మురళి వరండాలో కూచ్చుని పేపరు తిరగేస్తున్నాడు. అన్నపూర్ణమ్మ లోపల ఏదో పని చేసుకుంటోంది. నారాయణ రావు ఇంకా కోర్టునించి రాలేదు.

వాకిట్లోనించి "పోస్ట్" అన్నకేకకి తలెత్తి చూశాడు. రెండు కవర్లు అందించి వెళ్ళిపోయాడు పోస్టుమేన్.

కవర్లు తిప్పి అడ్రస్ చూశాడు. ఒకటి తండ్రికి మరోటి అనూరాధకి.

అను ఉత్తరాలు రాసేంత స్నేహితులెవరు. వెనక్కి తిప్పి చూశాడు.

గిరిధర్ అడ్రెస్ వుంది. మురళి కనుబొమ్మలు క్షణం ముడిపడ్డాయి. తండ్రి ఉత్తరం ఆఫీసు రూములో పెట్టి ఆగదిలో నించి బైటకి వస్తూండగా అనూరాధ వరండాలోకి వచ్చింది. అన్నగారి చేతిలో కవరుని క్షణం చూసి చటుక్కున గదిలోకి వెళ్ళిపోయింది.

గిరిధర్ ఉద్యోగం జెంషెడ్‌పూర్‌లో. అక్కడనుంచే ఉత్తరం రాశాడు. మురళికి ఆ ఉత్తరం చెల్లెలికివ్వాలన్పించ లేదు. ఆలోచిస్తూ అలాగే నిల్చున్నాడు. అన్నగారు ఎక్కడికో వెళ్ళిపోయివుంటాడని మళ్ళీ బైటికి రాబోతూ గది గడపలోనే ఆగిపోయింది.

"అనూరాధ" మురళి మౌనంగా ఆ కవరు చెల్లెలికిచ్చి గబగబా బట్టలు వేసేసుకుని స్కూటర్ తీసుకుని ఓ గమ్యం అంటూ లేకుండా స్పీడ్‌గా పోనిస్తున్నాడు. అసలు ఆ స్కూటరు అనూరాధకి గమ్మత్తుగా ఓ లాటరీలో వచ్చింది.

ఒకసారి ఇరుగూ పొరుగూ అమ్మలక్కలు లాటరీ టిక్కెట్లు కొంటూ అన్నపూర్ణమ్మని ఒకటి కొనమని వేధించారు. లాటరీలంటే వ్యామోహం లేని అన్నపూర్ణమ్మ

పడని యింటి వారించినా వినకుండా మీ అను పేరు 'లక్కీ' అండీ ఈ పేరుతో ఒక్కటి తీసుకోండి అని అనూ పేరు రాసి టికెట్టు అంటగట్టి మరీ వెళ్ళారు.

"అనవసరంగా రూపాయి దండగ" అంటూ అన్నపూర్ణమ్మ ఆ పూటంతా వ్యాకులపడింది. భర్తకి పొరుగావిడ ఇలా చేసిందని నాలుగుసార్లు చెప్పింది.

"అబ్బ ఒక్కసారి కాఫీ పెడితే పది రూపాయలు అరిపోతాయి. పోనివ్వు ఒక్క రూపాయేగా ఒక వేళ అనూ అదృష్టం కల్సివస్తే లక్షలు రావచ్చు. పోయినా [illegible]. అంతేగా" "అంటూ తేలికగా మాట్లాడే సరికి అన్నపూర్ణమ్మ మనస్సు అప్పటికి కాస్త తేలికపడింది. ఇది జరిగిన రెండు నెలల తర్వాత ఒకరోజు ప్రక్కయింటి మీనాక్షమ్మ పడుతూ లేస్తూ పరుగెట్టుకు వచ్చి" "విన్నారా, ఓ అన్నపూర్ణమ్మ వదినగారూ అదృష్టం అంటే అనూదానిదే నండీ....ఆ లాటరీలో అనూకి స్కూటరు వొచ్చిందట! మా వారు చెప్పారు"

అంటూ వగరుస్తూ పెద్ద గ్లాసుడు నీళ్ళు తాగి ఆ తర్వాత కాఫీ యిస్తే కాని వీల్లేదని కాయించుకుని మరీ తాగి ఇంటి కెళ్ళిందావిడ. ఆవిడ భర్తకి ఈ లాటరీ టిక్కెట్ల కంపెనీలోనే వుద్యోగం.

"ఎందరికో అదృష్టాన్ని పంచిపెడుతూన్న ఆయనకి మాత్రం ఒక్కసారి కల్సిరాలేదు." అంటుంది మీనాక్షమ్మ. అనూకి స్కూటర్ వచ్చింది. మీనాక్షమ్మ మొగుడు అమ్మిన

టిక్కెట్టు కొంటే అని తెల్సిన తర్వాత ఆ బజారు ఆడవాళ్ళంతా పదీపరకా టికెట్లు కొనేస్తున్నారు విసుగు లేకుండా —

"ఈసారైనా అదృష్టం కల్సిరాకపోతోందా! అదే గనక కల్సివస్తే స్కూటరేం ఖర్మ అయిదు లక్షలే వస్తాయో అంబాసిడర్ కారే వస్తుందో. హైదరాబాదులో ఇల్లు స్థలమే వస్తుందో ఎవరు చెప్పొచ్చారు." అంటూ రాబోయే అదృష్టాన్ని రంగురంగుల కలలు కంటూన్నారు పాపం వాళ్ళందరూ. అయితే ఎన్ని 'డ్రా' లైనా వీరెవరికీ ఆఖరి ప్రైజన్నా వచ్చినట్లు తెలియలేదు మరి.

"నా పేరుతో వచ్చింది స్కూటర్ నాదే" అంటూ పేచీ పెట్టింది అనూరాధ.

"ప్చ్ పాపం . పేరు నీదే అయినా డబ్బు నాన్నారిచ్చిందేగా! అది నీది కాదు నాది. పోనీ నువ్వేం ఆ ఇందిర లాగా స్కూటరెక్కి తిరిగితే అంతా నవ్వుతారు. ఎప్పుడన్నా మేట్నీకి షాపింగ్‌కీ నే తీసుకు వెడతాలే" అంటాడు మురళి.

"అదేం కాదు. దాని పెళ్ళి అయేవరకూ నీది స్కూటరు ఆ తర్వాత దాని మొగుడిది" అంటూ దశరథ రామయ్యగారు సర్దారిప్పుడు. ఏదిఏమైనా స్కూటర్ మాత్రం మురళి వాడుకుంటూన్నాడు.

"లాటరీలో వచ్చేది లక్షరూపాయలో కనీసం అంబాసడర్ కారో అయినా వచ్చింది కాదు ఈ స్కూటరొస్తే మనకేం ప్రయోజనం. కుర్రతనమైనా అయితే నిన్ను వెనక కూర్చో

బెట్టుకుని సినీమాలకీ షికార్లకీ తిరిగే పని. యింత పెద్ద వాళ్ళం అయిన తర్వాత అలా వెళ్ళాలని మనస్సులో వున్నా చూసే వాళ్ళకివాగుండదుగా!" అని నవ్వాడు నారాయణరావు.

"పూ! ఇంకా మనమే కోరికలంటూ కూర్చుంటే అయినట్టే! అల్లుడూ, కోడలూ వచ్చే వయస్సు వచ్చినా" అని మూతి తిప్పుకుంటుంది అన్నపూర్ణమ్మ.

మురళి స్కూటర్ మీద తిప్పుక పోతూ ఆలోచిస్తున్నాడు.

గిరి అనూకి ఇలా ఉత్తరాలు రాయటం యెప్పటి నించీ మొదలెట్టాడు.

అసలు అనూకి కాస్త కూడా బుద్ధిలేదు. ఆలోచన అంతకంటే లేదు. పెళ్ళి సెటిల్ కాక ముందే ఇలాంటివి చేస్తే ఎలా! వద్దని మాత్రం ఎలా చెప్పటం చెల్లెలికి.

ఇవన్నీ ఆలోచిస్తూంటే మురళికి చాలా చికాకుగా వుంది. ఆ చికాకులో వేగంగా వూరుదాటి చాలా దూరంగా వచ్చేసినట్లు గుర్తించే సరికి ఆకాశంలో మబ్బులు పట్టి చినుకులు ప్రారంభ మైనాయి. చూస్తూండగానే వర్షం పెద్దదైంది. ఓ చెట్టుకింద ఆగిపోయి స్కూటరి దిగి కర్చీఫ్‌తో తడిసిన తలనీ ముఖాన్నీ తుడుచుకుంటూన్నాడు. వర్షం కురుస్తూనే వుంది."

"ఆ రోడ్డు వెంట అప్పుడప్పుడూ కార్లూ, లారీలూ, వెడుతూన్నాయి."

"లాభం లేదు. ఈ వర్షం తగ్గేలా లేదు" అనుకుంటూ స్కూటర్ ఎక్కి బయలుదేరబోతూండగా మరో స్కూటర్

ప్రక్కనించి స్పీడుగా దూసుకుపోతూంటే యెందుకో పరీక్షగా చూశాడు."

యెవరో యువకుడు. అతని ముఖం సరిగా కన్పించ లేదు. కానీ అతన్ని గట్టిగా పట్టుకుని వెనకకూర్చున్న ఇందిరని గుర్తించి నిర్ఘాంతపోయాడు. తను వెంటనే బయలుదేరినా ముందు వెళ్ళే స్కూటర్ యే రోడ్డు మలుపుతిరిగిందో కానీ కన్పించలేదు.

ఎవరతను. ఇందిర అతనితో యింత దూరం ఈ వర్షంలో ఎందు కొచ్చినట్లు! మనస్సులో ఎన్నో ఆలోచనలు కందిరీగల్లా ముసురుతూన్నాయి.

అలాగే తడుస్తూ ఇంటికి వచ్చేశాడు. స్కూటర్ వరండాలో పెడుతూ వుంటే తన గదిలోనించి నవ్వులు విన్పిస్తూనాయి. అతనికి చిరాకు మరీ యెక్కువైంది. మళ్ళీ [illegible]లు దిగలేదుకదా! అనుకుంటూ తడిసిన బట్టలు మార్చుకోవటానికి టవల్ [illegible] గదిలోకి వచ్చాడు.

సునంద మురళి చదువుకునే టేబిల్ దగ్గర కుర్చీలో కూర్చుని అతను మధ్యలో వదిలిన పేజీ తీసి చదువుతోంది. [illegible] వరకూ కబుర్లు చెప్పిన అనూరాధ వంటగదిలోకి [illegible]ంది.

'అరె సునందా నువ్వా! [illegible] పట్టాదెవరన్నా వగబడ్డారేమో అనుకున్నా. ఏమిటీ ఇవాళ నువ్వే మాయింటికి వచ్చావు. వూరకరారు మహాత్ములు ఉండు బట్టలు మార్చుకుని వస్తాను." అని పాంటూ, షర్టూ వదిలి లుంగీ కట్టుకుని షర్టు

వేసుకుని తువ్వాలుతో మరోసారి క్రాఫు తుడుచుకుంటూ కాస్త చికాకు తగ్గి నవ్వుతూ కుర్చీలాక్కుని కూర్చుంటూ అడిగాడు.

"దేవిగారి రాకకి కారణం ఏమిటి!"

"ఆ విషయం చెప్పాలి గానీ ముందు ఇంత వర్షంలో నీ వెక్కడికి వెళ్ళినట్లు?"

"బోర్ కొట్టి అలా అలా తిరగటానికి వెడితే వరుణ దేవుడు ఇలా కరుణించాడు సరేగానీ ఎంత సేపయింది వచ్చి"

"అర్ధగంట .... అత్తయ్యగారు గుడికి వెళ్ళారట. అనూ కబుర్లు చెప్పి నీ స్కూటర్ శబ్దం విని 'టీ' చేస్తా వదినా అని వంట గదిలోకి పారిపోయింది. అవునూ బోర్ ఎందుకూ"

"ఏం చెప్పను సునందా! కాస్త కూడా తోచటం లేదు. పిచ్చిపట్టినట్లు అవుతోంది. చదువుపూర్తి అయితే 'రిలీఫ్' దొరుకు తుందనుకున్నా గానీ"

"ఏం మనసుకి చికాకు పరిచే విషయాలున్నాయా! చిత్రమే!" నవ్వింది సునంద—

"దాంపత్యాలు అర్ధం కావటమే శాంతిలేక పోవటం"

"ఔను. వప్పుకుంటాను" సునంద ముఖంలో నవ్వు మాయమై గాంభీర్యం చోటు చేసుకుంది.

"అనూ! టీ కాలేదింకా" కేకపెట్టాడు.

"ఆ! తెస్తున్నా"

"నువ్వీ రోజు మా ఇంటికి వస్తావని తెలిస్తే ఎక్కడికీ వెళ్ళకుండా వుండిపోయేవాడిని సునందా"

"మురళీ! నీతో ఏకాంతంగా అతి ముఖ్య విషయం మాట్లాడాలి. రేపు పార్కు దగ్గరికి తప్పకుండా వస్తావా!"

"నాతోనా! ఏకాంతంగా అతి ముఖ్య విషయం మాట్లాడాలా! ఏం ఇక్కడే చెప్పకూడదూ!"

"ఊహూ! ఏల్లేదు." అంటూండగానే అనూరాధ బిస్కెట్లూ టీ తెచ్చింది.

ముగ్గురూ టీ తాగారు, "అబ్బ చాలా టైమయింది మరి నే వెళ్ళి వస్తాను. ఉత్తరయ్య వస్తే చెప్పు. వర్షం కూడా వెలిసింది. మురళీ ఏదైనా రిక్షా మాట్లాడవూ" అంది.

మురళి రిక్షా మాట్లాడు కొచ్చి "పద నిన్ను ఇంటి దగ్గర దింపి వస్తాను ..." అన్నా సునంద అక్కరలేదని చెప్పి వెళ్ళి పోయింది. మురళి సునందని పంపి లోపలికి వచ్చాడే కానీ ఆలోచనలతో మెదడువేడెక్కి పోతోంది. సునంద నాతో మాట్లాడవల్సినంత ముఖ్య విషయం ఏమైవుంటుంది!

ఆ రాత్రి సరిగ్గా నిద్రపట్టలేదు మురళికి.

# 14

సునందకి మాట ఇచ్చిన ప్రకారం మరుసటి రోజు సాయంత్రం పార్కుకి వచ్చాడు మురళి. అప్పటికే పదినిమిషాల ముందు వచ్చి వెయిట్ చేస్తోంది సునంద.

"అరె! నాదే లేటా! అయినా అన్నింటిలోనూ లేడీస్ ఫస్టు కదూ!"

అంటూ సునందకి కాస్త దగ్గరలో పచ్చగడ్డి మీద కర్చీఫ్ పర్చి కూర్చున్నాడు.

ఆ చుట్టుపట్ల చాలా మంది పిల్లలు యేవేవో ఆటలు ఆడుతూ గల్లంతు చేస్తున్నారు. చల్లగా వీచేగాలికి మురళి క్రాపు చెదిరి ముఖం మీద పడుతోంటే ఎడంచేత్తో సరి చేసుకుంటూన్నాడు.

సునంద మురళి వేసుకున్న బట్టలని పరీక్షిస్తోంది. బ్లాక్ టెరీకాట్ ప్యాంటూ వైటు షర్టూ. అసలు మురళి యెలాంటి బట్టలు వేసుకున్నా బాగానే వున్నట్లు అన్పిస్తుంది. సునందకి. సునంద తనే మాట్లాడుతుందని నిరీక్షించి దూరంగాఆడే పిల్లలని చూస్తూ "అసలు నేను రావటమే ఆలశ్యం అయిందనుకుంటే నువ్వు చెప్పటం మరీ ఆలశ్యం చేస్తున్నావు" హెచ్చరించాడు.

"మన ఇద్దరినీ ఇక్కడ ఇలా పంటరిగా చూస్తే ఎవరైనా ఏమనుకుంటారు"

ఈ మాటలకి మురళి సునంద మీదకి దృష్టి మళ్ళించి "ఏమనుకుంటారు ?" ఎదురు ప్రశ్న వేశాడు.

"ప్రశ్నకి ప్రశ్నా ! అసలు వయస్సులో మగాడు ఎంత పెద్ద అయినా ఆలోచించటంలో ఆడవాళ్ళంత ముందు చూపు వుండదు"

నే ఉద్యోగంలో స్థిరపడిందిర్వాత ఎలాంటి అమ్మాయి కావాలో
అప్పుడు చెప్తాను సరేనా! ఇంక చెప్పు"

"ఊ!.... సరే! అసూయా ఆరాధన అంటే అర్థం ?"

"అబ్బ! ఇది అడగటానికా సన్నింత దూరం లేస్తు
న్నది. అది కాక నా కిలాంటి విషయాలు అంతగా తెలియవు"
ముఖంచిట్లించేశాడు.

"పోని నే చెప్తాను. వింటావా!"

"ఓ రెడీ! చెప్పు"

"భారతం చదివావు కదూ!"

"కొంత వరకూ"

"సామాన్యంగా భారతం పేరు చెప్పగానే అందరికీ
వెంటనే గుర్తు వచ్చే శ్రీకృష్ణుడూ అర్జునుడూ భీముడూ.
అసలు అర్జునుడు గుర్తున్నంత మరెవరూ వుండరు కదూ!
కానీ యిందులో అపురూపమైన వ్యక్తిత్వం కలిగిన వీరో
యిదరున్నారు. ఉదాత్తమైన వ్యక్తిత్వమే కాక నిస్వార్థులు
అయినా వీరిద్దరికీ భారతంలో రావల్సినంత గుర్తింపురాలేదేమో
అన్పిస్తూ వుంటుంది నాకు. చరిత్రలో...." అని ఇంకా ఏదో
చెప్పబోయి మురళి సరిగా వింటున్నాడా లేదా అని చూసింది.

"ఎవరు వాళ్ళిద్దరూ?"

"భీష్ముడూ కర్ణుడూ. వీరిద్దరి జీవితాలూ పరిశీలించి
చూస్తే యెంత ఆనందం కలుగుతుందో నాకు. గొప్ప

వ్యక్తిత్వం గల ఈ ఇద్దరికీ జీవితంలోనే కాక చరిత్రలో కూడా అన్యాయం జరిగింది అని బాధకల్గుతుంది.

యెంత ధైర్యవంతులు ! యెంతవుదారులు! యెంతటి నిస్వార్థులు! వాళ్ళకంటూ మిగుల్చుకున్నదేమైనా వుందా! భీష్ముడంటే నా కెంతో యిష్టం. కర్ణుడంటే మరీ మరి ఇష్టం. నిజంగా మురళీ ....

అంటూ ఇంకా ఏదో చెప్పబోతూన్న సునందని ఆపేసూ-

"అయితే ఇంతకీ నీ ఆరాధన అంతా ....?" నవ్వేశాడు.

"ఔను. నేనీ ఇద్దరినీ చాలా చాలా ఆరాధిస్తాను."

ఆవేశంగా చెప్తున్న సునంద నల్లటి ముఖం యెఱ్ఱరంగు పులుముకున్నట్లయింది. మురళి తేలిగ్గా పూరి పీల్చి 'అమ్మయ్యో' అన్నాడు.

సునందలోని ఆవేశం మురళి 'అమ్మయ్యో' ఁనటంతో చప్పగా చల్లారినట్లయి నువ్వేం అనుకున్నావ్?' చిరుకోపంతో అడిగింది.

"నేనేం అనుకోలేదు కాని ఇంకా ఏదో చెప్తావని రాత్రంతా నిస్పృహతో నిద్రపట్టక చచ్చాను. యేదైనా సీరియస్ విషయం చెప్తే నన్ను యిరుకున పెడతావనీ చెమట పట్టించేస్తావనీ భయపడాను అంతే...." అంటూ నవ్వాడు. కానీ ఆ మాట సునంద నమ్మలేదు.

"అంతేకాదు. నువ్వు మరేదో వూహించావు. మరోటి చెప్పి దారి తప్పించేస్తున్నావు."

"కాదు. నిజం."

"కాదు"

టపటపా వర్షపు చినుకులు ఇద్దరి నెత్తిమీదా పడిన తర్వాతగానీ ఆకాశం మేఘావృతమైనది గుర్తించలేదు. "అమ్మో! వర్షం వచ్చేలా ఉంది" అని లేచింది సునంద.

"అసలు విషయం ఏమిటో చెప్పకుండానే వెళ్ళిపోతావా సునందా!"

"నిజమే. చెప్పాలనుకున్నది. ఎలా చెప్పాలో తెలియకే ఏవేవో మాటలు ప్రారంభించాను. ఆ మాటల్లో ఎలాగో చెప్పేద్దాం అనే అనుకున్నాను. కానీ మురళీ క్షమించు యిప్పుడు చెప్పలేను. మరోసారి సమయం చూసుకుని చెప్తాను. నీకు బాధ కల్గితే క్షమించు. నే చెప్పేది చాలా చిన్న విషయమే.

అనవసరంగా ఆలోచించి బుర్రపాడు చేసుకోకు సుమా. రిక్షా పిలుస్తావా?"

సునంద పమిట తలమీదుగా కప్పుకుని 'పదపోదాం' అంది.

మురళి లేచి కర్చీఫ్ తీసుకుని ముఖాన పడిన చినుకులని తుడుచుకుంటూ—

సునందా, నువ్వు చెప్పాలన్న విషయం చెప్పకున్నా నేనో విషయం నీకు చెప్పకతప్పదు. ఇందిరని కాస్త హాస్టల్లో పెట్టటం మంచిది. ఇలా చెప్పవల్సిరావటం చాలా బాధగానే వుంది. అయినా తప్పదు.

"సునందా, మీరిద్దరూ నా మేనత్త కూతుళ్ళు. ఇందిర భవిష్యత్తు బాగుండాలనే నా కోరిక. ఇందిర బైట ఎలా వుంటోందో మీరు పట్టించుకోవటం లేదు—"

"మురళీ ?"

"ప్లీజ్! నన్ను అర్థం చేసుకో సునందా. ఇందిర అంటే అభిమానం వుంది. అందుకే హెచ్చరిస్తున్నాను. ఇంకపైన నీ ఇష్టం.సారీ సునందా"

ప్యాంట్ జేబులో చేతులుంచి తలవంచుకుని చెప్తున్న మురళిని చూస్తూ సునంద ఆవేశాన్ని అదుపు చేసుకుంటూ అడిగింది.

"మురళీ! అసలేం జరిగింది. వివరంగా చెప్పు."

ఏదో జరగరానిది జరిగిందనీ అదంతా నాకు తెల్సుననీ నే చెప్పటం లేదు. నిజంగా నాకేం తెలియదు. అయితే నిన్న సాయంకాలం పూరికి ఒంటిగా షికారు వెళ్ళాను. స్కూటర్ పైన తిరిగి సిటీలోకి వస్తోండగా చూశాను...."

"ఎవరతను?"

నాకు తెలియదు. అతని వెనక కూర్చున్న ఇందిరని గుర్తించాను కానీ అతని ముఖం కన్పించలేదు. సునందా యిలాంటి విషయాలు చెప్పవల్సిరావటం చాలా బాధ కల్గిస్తోంది. అయితే....తెలిసీ తెలియని వయస్సులో ఏ చిన్న పొరపాటు చేసినా జీవితాంతం అనుభవించవల్సి వస్తుందిగా!"

"నిజమే ...అందులోనూ ఆడపిల్ల"

." మురళి మాట్లాడలేదు. ఇదరూ నడుస్తూ పార్కుగేటు సమీపించారు.

వర్షం మరీ పెద్దదైంది.

"[illegible]

అక్కరలేదు. నే వెళ్ళగలను మురళీ ఇంటికి ఒట్టి అమాయకురాలు. [illegible] అర్థం చేసుకోదు. [illegible] తగని అహంభావం. [illegible] చెప్పనా.... [illegible] వినవూ!"

"ఇప్పుడు కాదు సునందా! వర్షం పెద్దదైపోతోంది అదిగో రిక్షా"

మాట్లాడాడు మురళి. సునంద మరేంమాట్లాడకుండా ఎక్కింది.

సునందా ఎలాంటి విషయం అయినా నాతో స్వేచ్ఛగా చెప్పగలచనువు నీకుంది. నాకూ వుంది నిన్ను వత్తిడిచేసి విషయం రాబట్టాలనే ఉద్దేశ్యం నాకు లేదు. అయితే సందేహించవలసిన [illegible] లేదు. [illegible] మాత్రమే చెప్తున్నాను. సరేవెళ్ళు మళ్ళీ రేపు వీలుంటే [illegible] ఇంటికి నేనే వస్తాను."

"అలాగే" అంటూండగానే రిక్షా వెళ్ళిపోయింది. మురళి వర్షంలో తడుస్తూ రెండు నిమిషాలు అలాగే నిల్చున్నాడు. వాన మరీ పెద్దదైంది. స్కూటర్ తీసుకుని

యింటి వైపు బయలుదేరుతూంటే ఆ వర్షంలో పూర్తిగా తడిసి మరో ఇద్దరు అమ్మాయిలతో వస్తూన్న ఇందిర ఆగి చూసింది. కోపంతో ఆ అమ్మాయి కళ్ళు యెర్రబడి పోయాయి.

"ఇందిరా! పిరిచరికీ ఈ పాపుల్లో షికారు చేయటం ఎప్పటినుంచీ అలవాటు" ఓ స్నేహితురాలు వెక్కిరింపు మూతి ముఖం పెట్టింది. మరో అమ్మాయి అరె! అతను నీ కాబోయే భర్తగారు కదూ! నిన్ను వదిలి వదినగారితో కబుర్లెంటి చాలా చిత్రంగా వుందే" అంది.

"ఇంటికి వెళ్ళి విషయం ఏమిటో ఇప్పుడే తేల్చేస్తాను" ఇందిర ఆ ఇద్దరినీ వదిలేసి మరో రిక్షా మాట్లాడి అందులో యెక్కి కూర్చుని 'పద' అంది రోషంగా ముఖం పెట్టి.

ఇంట్లో అడుగు పెడుతూనే అక్క చెల్లెళ్ళు ఇద్దరూ ఒకరి ముఖంలో ఒకరు మిరుమిరా చూసుకున్నారు. క్షణం ఇందిర యేదేదో మాట్లాడేయాలని అనుకునీ ఒక్క ఆగిపోయి ఆలోచిస్తూ వుండిపోయింది

# 15

ఈ రోజు ఇందిర పుట్టినరోజు స్నేహితులందరినీ పార్టీకి పిల్చింది. మురళినీ అనూరాధనీ ప్రత్యేకంగా "తప్పక రావాలనీ" మరీ మరీ చెప్పింది.

ఆరోజు పోస్టులోనే దశరథరామయ్యగారి దగ్గర నుంచి నారాయణరావుకి ఉత్తరం వచ్చింది. మురళికి ఆలోచించుకోవటానికీ కాస్త టైము యివ్వటం మంచిదనీ త్వరలోనే తను వస్తూన్నాననీ అప్పుడు అన్ని విషయాలూ మాట్లాడ వచ్చనీ" రాశారు.

గిరిధర్ ప్రత్యేకంగా చెల్లెలి పుట్టిన రోజుకోసం నాలుగు రోజులు సెలవు పెట్టి వచ్చాడు గిరికి సునంద అన్నా చాలా ప్రేమ.

ఇందిర అభ్యుదయాపటం వల్ల తల్లిదండ్రులకే కాకఅన్నకీ అభిమానం. వస్తూ రెండు వందల రూపాయలు పెట్టి ఫారెన్ నైలెక్స్ జరీ ఎంబ్రాయిడరీ చీరె తెచ్చాడు. ముదురు నీలం రంగున్న ఆ చీరె కట్టుకుని అదే రంగు జాకెట్టు వేసుకుని మెడలో ముత్యాల నెక్లెసూ, చేతులకి ముత్యాల గాజులూ పెట్టుకుని ముత్యాలనే చెవులకి లోలాలు పెట్టుకుని అందంగా అలంకరించుకుని అన్నగారికి తల్లిదండ్రులకీ నమస్కరించింది.

చెల్లెలిని చూసుకుంటూ గిరిధర్ అనుకున్నాడు.

"ఇందిర చదువులో, ఆటల్లో, అందంలో అన్నింటిలోనూ బాగున్నా మురళి కెందుకు నచ్చటం లేదు" అనుకున్నాడు మనస్సులో. ఏం కాదు పైకి త్వరపడి చెప్పటంలేదేమో! అని కూడా అనుకున్నాడు.

సాయంత్రం అయిదు గంటలు అవుతూండగానే ఇందిర స్నేహితులు వచ్చారు. మురళి అనూరాధని తీసుకుని

వచ్చారు. ఇందిర తన స్నేహితులని తల్లిదండ్రులకీ అన్నగారికీ పరిచయం చేసిన తర్వాత మురళిని పరిచయం చేసింది. మురళి వాళ్ళనందరినీ పరీక్షగా చూస్తున్నాడు.

ఆ రోజు స్కూటర్ మీద కన్పించిన యువకుడి ముఖాన్ని గుర్తించటానికి ప్రయత్నిస్తూ—

అందరూ టిఫెను తిని 'టీ' త్రాగుతుండగా అనూరాధని పాటపాడమని బలవంతం చేసింది ఇందిర. సునందా అదే అంది.

మురళి చెల్లెలి ముఖంలోకి చూశాడు.

ఆమె పెదవి కదపబోయినట్లే ఆగిపోయింది. గిరిధర్ గ్రహించాడు. ముఖం చిట్లించి చూస్తూ "అనూ! నే అడుగు తున్నాను పాడితీరాలి" అతని కంఠంలో ఎంతో అధికారం కూడా ధ్వనించింది.

అనూరాధ ఇబ్బందిగా చూసింది. కాని పెదవి కదపలేదు. గిరిధర్ కోపాన్ని అణుచుకుంటూ అక్కడ నుంచి దూరంగా వెళ్ళి కూర్చున్న ఇందిర ఫ్రెండుని అడిగాడు.

అతను ఓ హిందీ సాంగ్ పాడాడు. తర్వాత కూడా అనూ పాట పాడలేదు. తాను తను తెచ్చిన ప్రెజంటేషన్ ఇందిర కిచ్చింది.

పార్టీ పూర్తి అయిపోయింది. అందరూ వెళ్ళిపోయారు. మురళి మేనత్త దగ్గరకి వెళ్ళి 'మేం వెళ్ళివస్తాం అత్తయ్యా' అన్నాడు స్కూటర్ తాళం చేతిలోకి తీసుకుంటూ—

"వీల్లేదు. మీ రిద్దరూ ఈరాత్రికి ఇక్కడే భోజనం చేసి వెళ్ళాలి"

రాజేశ్వరమ్మ అన్నది 'అంతే' అన్నారు సునందా ఇందిరా—

"పని ఉంది వెళ్ళాలి" అన్నమురళితో—

"నీకంత పని ఉంటే అనూని వదిలి వెళ్ళు. రేపు నేను తీసుకువచ్చి దించేస్తాను. గిరిధర్ అలా అంటూంటే మురళికి లోపల మండిపోయింది.

బలవంతంగా మింగేసుకున్నాడా కోపాన్ని. రాజేశ్వరమ్మ మరీ పట్టుబట్టటంతో ఇంక మురళికి వుండక తప్పలేదు. గిరిధర్ చాలా చనువుగా అనూరాధతో కబుర్లు చెప్తూ భోజనాల సమయంలో ప్రక్కనే కూర్చున్నాడు. ఇందిర మురళి ప్రక్కగా వచ్చి కూర్చుంది.

ప్రసాదరావు తన సర్వీసులో జరిగిన సంగతులు చెప్తూ నవ్విస్తున్నాడు. రాజేశ్వరమ్మ మురళికీ, అనూరాధకీ కొసరి కొసరి వడ్డిస్తోంది.

గిరిధర్ అనూరాధపై చూపే అధికారం చనువూ మురళికి నచ్చకపోయినా పెదవి కదపక కూర్చున్నాడే కానీ అసలు ఇక్కడికి రావటమే శుద్ధతప్పు. అనూని తీసుకు రావటం రెండో తప్పు. అనుకున్నాడు.

అంతలోనే మళ్ళీ ఏమిటి! నేనింత సంకుచితంగా ఆలోచిస్తున్నాను—

ఛీ ఛీ ! ! అని సిగ్గుపడిపోయాడు. కబుర్లతో

నవ్వులతో హోరెత్తి పోయింది. డైనింగ్ హాలు. భోజనాలు పూర్తి అయిపోయాయి.

"యింక లాభం లేదు అల్లుడూ నిద్రముంచు కొస్తోంది. నాకింక శలవు ఇప్పించాలి" అని ప్రసాదరావు మురళికి చెప్పి మేడమీద పడక గదిలోకి వెళ్ళిపోయాడు. ప్రసాదరావు ఈ మధ్య మురళిని పేరుతో కాక 'అల్లుడూ' అంటూన్నాడు. ఇది మురళికి మరీ విసుగు కల్గిస్తోంది.

రాజేశ్వరమ్మ తన కొడుకూ కూతుళ్ళనీ మురళీ అనూ రాధనీ దగ్గర కూర్చో బెట్టుకుని కబుర్లు చెప్పటం మొదలెట్టింది. ఇలా ఆవిడ కబుర్లు చెప్పటం వీళ్ళందరూ మంత్ర ముగ్ధుల్లా వినటం అప్పుడప్పుడూ అలవాటు ఈరోజు కబుర్లలో రాజేశ్వ రమ్మ చిన్నప్పటి సంగతులు మొదలెట్టింది.

ఆ నాటి సమిష్టి సంసారాలూ, పాడిపంటా, పుట్టాలూ, పశ్నాలూ, పెళ్ళి పేరంటాలూ, ఎలా వుండే వాటూ! యెలా చేసే వారూ అన్నీ చెప్తూవుంటే ఆశ్చర్యంగా వింటూ కూర్చు న్నారు. మురళికి చాలా ఆశ్చర్యంగా కూడా వుండేవి. ఈ రోజు ఆ కబుర్లు అలా అలా తిరిగి దశరథరామయ్యగారి మీదకి మళ్ళాయి.

దశరథరామయ్య అన్నదమ్ములు ముగ్గురు. పెద్దాయన రాజేశ్వరి తండ్రి. మరొకాయన నారాయణరావు తండ్రి ఆఖరు వాడు దశరథరామయ్యగారు.

రాజేశ్వరమ్మ చెప్పటం వింటూ నవ్వింది సునంద ఎందుకంటే —

"మా చిన్నప్పుడు ఈ దశరథ చిన్నాన్న 'హీరో' లావుండేవాడు. మాంచి పర్సనాలిటీ. అందంగా ఆరోగ్యంగా హుషారుగా నవ్వుతూ. నవ్విస్తూ బలేసరదాగా వుండేవాడు. అసలు ఆకాలమే వేరు. వాళ్ళ పద్దతులేవేరు. నీతీ నిజాయితీకి ఆ కాలం వాళ్ళిచ్చినంత విలువ ఈ కాలం వాళ్ళు యివ్వటం లేదు." క్షణం ఆగింది రాజేశ్వరమ్మ.

"అత్తయ్యా! తాతయ్య పెళ్ళి యెందుకు చేసుకోలేదు"

"అడిగాడు మురళి. ఆవిడ చెప్పేది అందరూ శ్రద్ధగా వింటూన్నారు."

"మీకీ విషయాలు ఒక విధంగా చెప్పకూడదనుకో. అయినా చెప్పటం కూడా అవసరమే... అసలు యశోదచిన్నాన్న జీవితంలో యేనాడు అడుగెట్టిందో ఆనాటినించే ఆయన అదృష్టం మారిపోయింది.

"అసలు వీళ్ళిద్దరికీ పరిచయం ఎలా జరిగింది. యశోదమ్మ మన కులం కూడా కాదు గదా!"

"మా చిన్నాన్న హైస్కూలు చదువు పూర్తి చేసి పట్నంలో కాలేజీ చదువులో చేరాడు. చదువులో బాగా వస్తూన్నాడనీ పెద్ద చదువు చెప్పించి ఇంగ్లండు పంపి బారిష్టర్ చేయాలి. అంటూండేవాడు మా నాన్న. ఆనాడు చిన్నాన్నతోబాటు చదివిన ఎందరో యీనాడు చాలా పెద్ద చదువులు చదివి పెద్ద పొజిషన్లలో వున్నారు."

చిన్నాన్న జీవితమే ఇలా రాహువు అడ్డుపడి

నట్లయింది. చిన్నాన్న పట్నంలో కాలేజీలో చదువుతూ బలేషా షన్‌గా వుండేవాడు. శలవుల్లో యింటికి వచ్చేవాడు.

ఒకసారి నాకు బాగా గుర్తువుంది. తిరణాలకి వెళ్ళాం. చిన్నాన్న, మా నాన్నా నేనూ, అమ్మా యింకా కొందరు బంధువులున్నూ, అక్కడ చూశాడు ఈ యశోదని. యశోదది మా పల్లెప్రక్కనే ఉన్న మరో చిన్నపాలెం. తెల్లవారిన దగ్గర నుంచీ అక్కడి వాళ్ళు మా పల్లెకి వచ్చిపోతూనే వుంటారు. యశోద ఓ పేద రైతు కూతురు అప్పటికి పదహారేళ్ళ వయస్సులో వుంది.

అందగాడయిన మా చిన్నాన్న మీద పడింది. దాని కన్ను. నల్లగా వున్నా అప్పుడు అందంగానే ఉండేది. మంచి యవ్వనపు పొంగులో ఉన్న యిద్దరూ ఆకర్షితులై అక్కడక్కడా కల్సుకుంటూ ప్రేమాయణంలో పడ్డారు.

చాలా రోజులు రహస్యంగా జరిగిపోయాయి. కానీ ఆలశ్యంగా తెల్సుకున్న మా నాన్న చిన్నాన్నకి పెళ్ళి చేసేయాలని ఎన్నో సంబంధాలు చూశారు. ఎందరో అందమైన ఆడపిల్లలని చూపించినా ఏదేదో ఒంక పెట్టి ప్రతి సంబంధం వద్దని పెళ్ళిని వాయిదా వేయించేవాడు చిన్నాన్న —

ఇంక మా నాన్న లాభంలేదని బలవంతంగా ఒక సంబంధం ఖాయం చేశారు. యశోద తండ్రిని పిల్చి నీ పిల్లని అదుపులో పెట్టుకోలేకుంటే "జాగ్రత్త" అని గట్టిగా వార్నింగ్ యిచ్చేశారు.

"సామాన్యరైతు అయిన యశోద తండ్రి అవమానంతో తలవంచుకున్నాడు. కూతురు చేసే పని భరించలేక ఆ పిల్లని ఏమీ అనసూలేక ఏలాగో కష్టపడి ఓ సంబంధం వెతుక్కున్నాడు. మానాన్న షరతుపెట్టారు."

"ముందు యశోద పెళ్ళి జరిగిపోయి అత్తవారింటికి పంపేయాలని. అది చిన్నాన్న పెళ్ళి లగ్నానికి ముందే జరగాలనీ."

అయితే ఆ పెళ్ళి యశోద చేసుకోలేదు. తండ్రికి ఎదురు తిరిగినా లాభం లేక అర్ధరాత్రి లేచి చిన్నాన్న దగ్గరికి వచ్చేసింది.

చిన్నాన్న ఆమెకి ఆశ్రయం ఇచ్చాడు. అంతే. ఆమెనిఈ నాటికీ ఎవ్వరూ. యేమీ చెయ్యలేకపోయారు. తను పెళ్ళి వేరే చేసుకోనని మొదటి నించీ గట్టిగా చెప్పటంవల్ల కుదిర్చిన సంబంధం విషయం ఇంక నాన్నారే మాటలుపడి అవమానాన్ని భరించి తప్పించుకున్నారు. ఆ దిగులుతోనే మానాన్న మంచం పట్టి ఆరు నెలలు తిరక్కుండా కాలంచేశారు. మా అమ్మఅంతకు ముందే చచ్చిపోయింది. ఇంక నారాయణ తల్లిదండ్రులు'మసూచి సోకి' నారాయణకి నాలుగేళ్ళ వయస్సులోనే పోయారు.

వాడిని ఇంత వాడిని అంతగా చేసింది నిజంగా చిన్నాన్నే.

"చిన్నాన్న యశోద కిచ్చిన మాట కోసం మరో పెళ్ళి

చేసుకోలేదు. ఆమెకి అన్యాయం చెయ్యలేదు. ఒక విధంగా యశోద అదృష్టవంతురాలు. లేకుంటే ఆ వయస్సులో తెలియక చేసిన పొరబాటుకి జీవితం అంతా వృధా చేసుకుంటారా! చిన్నాన్న మనస్సు వెన్న లాంటిది. యశోద ఆయనకి ఆరో ప్రాణం. అంతగా ప్రేమిస్తున్నా ఇద్దరూ అప్పుడప్పుడూ, 'తగూ' పడుతూనే వుంటారు. యశోదని చాలా సంవత్సరాలు వేరే యింట్లో వుంచినా మా నాన్న ఇంకో చినాన్నా పోయిన తర్వాత ఇంట్లోనే వుంచుకున్నాడు."

"అయితే యశోద మొదటినించీ మీ ఇంట్లో లేదన్న మాట" ఇందిర నవ్వి అడిగింది.

"అమ్మయ్యో అలా యెలా జరుగుతుంది. అవన్నీసరే మరో విషయం చెప్పనా. చిన్నాన్న యశోద చేతి వంట ఇప్పటికీ తినడు. తన ఆరోగ్యం ఎంతబాగుండకున్నా తనే వండుకుని ఇంత తింటాడు. మిగతా పనిఅంతా యశోదచేస్తుంది."

"తాతగారి ఆరోగ్యం బాగులేకుంటే భోజనం లేనట్లేనా"

సునంద కుతూహలంగా అడిగింది.

"పస్తే"

ఇందిరా గిరిధర్ ఫక్కున నవ్వాడు. "కులంపోతుందని భయమా అమ్మా" అంటూ—

"కావచ్చు" రాజేశ్వరి అంది.

"నాన్సెన్స్! భార్యగా జీవితాంతం పంచుకుంటే పోని కులం ఆవిడ చేతి వంట తింటే పోతుందా ! ఇందుకే తాతయ్య ఆచారాలంటే నా కసహ్యం. చేసేవి మాఘ స్నానాలూ....

గిరిధర్ ముఖం చిట్లించి అన్నాడు. అనూరాధ అత్త చెప్పేవి వినటం మాని గిరిధర్‌ని తనివి తీరా చూస్తోంది. మురళికి కోపం వస్తోంది.

అసలు తాతగారి పేరు ఎప్పుడు చెప్పినా యేదో ఒకటి అనటం గిరికి అలవాటు. అది సహించలేదు మురళి.

"నువ్వేన్నన్నా చెప్పమ్మా! ఆతరం వాళ్ళ అలవాట్లూ అభిరుచులూ కన్న ఈతరం వాళ్ళ నిర్ణయాలే బాగుంటాయి. ఈతరం వాళ్ళ మీద మీలాంటి పెద్దవాళ్ళకి గౌరవం నమ్మకం లేదు. కానీ మేం యేంచేసినా ధైర్యంగా నిలుస్తున్నాం. ఆచారాలు అన్నయ్యలూ, అమ్మలూ, నాన్నలూ, అనే ముసుగుల్లో దాక్కోవటానికి ప్రయత్నించం సూటిగా చెప్పటం చేయటం మా కున్న మంచి అలవాట్లలో కొన్ని అని వప్పుకుంటావా!"

"ఈ రెండూ మంచివే అయినా చెడు లక్షణాలు లెక్క-పెట్టి చెప్ప"ని రాజేశ్వరి నవ్వి బిగపట్టి అంది.

"వద్దు ....వద్దు .. నువ్వు చెప్పబోయే లిస్టు మాకు తెల్సు. కానీ తర్వాతి సంగతులు చెప్పు" ఇందిర ఆ మాటని మార్చేస్తూ అంది.

"అమ్మా! మరి తాతయ్య ఆస్తి అంతా నారాయణ రావు మామయ్య చదువుకే అయిపోయిందనీ ఇల్లు తప్ప మరేంలేదనీ యశోదకి తండ్రి యిచ్చిన పొలం స్వంతంగా

వ్యవసాయం చేస్తూ ఆ పంటలో ఇద్దరూ బ్రతుకు తున్నారని కాపుదమ్మ చెప్పింది నిజమేనా" సునంద అడిగింది.

"నిజమే"

"మరి యశోదమ్మ ఆస్తి తింటూ కూడా యింకా కులం నిలుపుకుంటున్న తాతయ్య అంటే మీకు గౌరవం. ఆయనో పెద్ద ఆదర్శ పురుషుడిలా మాట్లాడతాడు. అందుకే నాకు నచ్చడు."

గిరిధర్‌కి తాతగారి మీద కోపం బైటకి వెళ్ళగక్కేందుకు అవకాశం దొరికింది. అనూ పెళ్ళి విషయం తేల్చి చెప్పటంలేదనీ మురళిని ఇందిరను చేసుకోమని ఆయనే గనక చెప్తే ఈ రెండు పెళ్ళిళ్ళూ క్షణంలో జరిగి పోతాయని గిరిధర్ ఆలోచన. అలా చెప్పని తాతగారంటే కోపం. అనూని నీకోడల్ని చేసుకోమని చెప్పిన వాడు ఇందిరని చేసుకోమని ఎందుకు చెప్పడు! అని పట్టుదల.

తాతగార్ని గిరి అలా తేలిగ్గా మాట్లాడే సరికి మురళి కస్సున లేచాడు.

గిరిధర్‌కి మరీ మండిపోయింది.

"మురళీ! తాతయ్య నీ ఒక్కడికే కాదు. ఆయన నాకూ తాతగారే! ఆయన్ని గురించి నేను మాట్లాడటానికైనా నాకు హక్కు వుంది. తెలుసా!"

మురళి మరీ విసురుగా జవాబిస్తుంటే సునంద కంగారు పడిపోయి ఇద్దరినీ సర్దేస్తూ "అబ్బబ్బ ...

మీరెందుకురా వివాదపడతారూ. అమ్మ చెప్పేది విందాం....వుండండి. బావా అదిగో అమ్మ మరో ముఖ్య విషయం చెప్తోంది విను" అంటూ తొందర చేసింది.

"అమ్మా! ఆస్తి అంతా పోయినా ఆ ముత్యాలపల్లకీ మాత్రం తాతయ్య ప్రాణప్రదంగా కాపాడు తూన్నాడట కదూ"

ఇందిర కుతూహలంగా అడిగింది.

"అవునమ్మా! అసలా పల్లకీకి చాలా చరిత్ర వుంది. గిరీ మురళీ నే చెప్పేది శ్రద్ధగా వింటూన్నారా! జీవితంలో వివాహం అతి ముఖ్యమైన అందమైన అనుభవం. ఇది ప్రతి వ్యక్తికీ ఒకే ఒక్కసారి వస్తుంది. దీని విలువ అనుభవించిన వాళ్ళకంటే లేని వాళ్ళకే ఎక్కువ తెలుస్తుంది.

ఆఖరి తమ్ముడు అంటే చిన్నాన్న పెళ్ళికోసం మా నాన్నగారు ప్రత్యేకంగా తయారు చేయించారు. ఆ పల్లకీని.కాని ఆ పల్లకీలో ఎక్కి వూరేగే అదృష్టం చిన్నాన్న నిర్లక్ష్యంగా పోగొట్టుకున్నాడు. కనుక నే దానిని ప్రాణప్రదంగాచూసుకుంటూ నారాయణ అన్నయ్యని ఎక్కిద్దామని అనుకున్నాడు. అదీ జరగ లేదు. అప్పుడే చిన్నాన్న ఆశలు కూలి పోయాయి. అయినా నీమీద ఆశలు పెంచుకుని నీ పెళ్ళి కోసం ఎదురుచూస్తూన్నాడు. మురళీ నీవైనా కనీసం తాతయ్య కోర్కెతీర్చు."

మురళి కళ్ళలో ఆ ముత్యాల పల్లకీ కదులాడుతోంది.

పెళ్ళి పూరేగింపు సన్నాయిమేళం డేంకుమేళం ఎప్పుడుఎక్కడ విన్నా మురళికి తన ముత్యాల పల్లకీయే కన్పిస్తుంది. అంతే కాదు. అందులో తను పెళ్ళికొడుకై ఎక్కి పూరేగుతూన్నట్లు ఎదురుగా పెళ్ళి కూతురు తల వంచుకుని కూర్చున్నట్లు ఆ పిల్ల ముఖాన్ని పరీక్షగా చూడటానికి ప్రయత్నిస్తూన్నట్లు ఆ ముఖం ఎలా ఉందో కన్పడదు గానీ పెళ్ళి పూరేగింపు సాగిపోతూన్నట్లు అనుభూతి కల్గుతూ వుంటుంది.

అవే రకరకాలుగా కలలుగా కూడా వస్తూ మురళిని ఉక్కిరి బిక్కిరి చేస్తూ వుంటాయి. అసలు తాతిగారు తన పెళ్ళి కోసం ఎంత కలలు కంటూన్నాడో కూడా తెల్సు. అలాంటి వన్ని పూహించుకోవటానికి వాగానేవున్నట్లు అన్పించినా ఒక్కొక్కప్పుడు. బంగారు గొలుసులతో బంధించినట్లు అన్పిస్తూం టుంది. నా పెళ్ళి నా ఇష్టం వచ్చినట్లు ఏ రిజిష్టర్ మారేజో చేసుకునేందుకు వీలులేకుండా ఇన్నితరాల కోరికలు తీర్చటం కోసం మనస్సుని చంపుకుని బొమ్మగా ఎందుకవాలి! అని అన్పిస్తుంది.

మళ్ళీ తాతయ్య జీవితం గుర్తుకొస్తుంది. చిన్న తప్పు కోసం యశోదమ్మని జీవితాంతం భరిస్తూన్నాడు. వదాశీసంగా కాదు మనస్ఫూర్తిగా—

యశోదమ్మ కూడా తాతయ్యనే నమ్మి తన పొలం పంటా అంతా యిచ్చేస్తోంది. అంతేకాదు. ఆ ఇల్లూ పొలం నాలుగెకరాలూ తదనంతరం మనవడికీ మనవ

రాలికీ చెందాలని 'వీలునామా' కూడా రాయించేసింది. యశోద మ్మని చూస్తే ఆమె చిన్నప్పుడు తెలియక తప్పు చేసిందని నిరసన దృష్టితో చూడ బుద్ధి కాదు. ఆమె ముఖంలోని పవి త్రతా, ప్రశాంతతా ఎవని ముగ్ధుడిని చేస్తుంది. కేవలం మంగళ సూత్రం కడితేనేనా భార్యా భర్తలు! మనసులు కలిస్తేనే భార్యా భర్తలుగాని. ఏమైనా సరే తాతయ్య కోరిక తీర్చాలి.తీరుస్తాను.

"అప్పుడు తాతయ్య కళ్ళలో కన్పదేతృప్తినీ గర్వంతో మెరిసిపోయే ఆయన కళ్ళనీ చూడాలని కోరిగా వుంది. అసలు ఆ అందమైన ముత్యాలపల్లకీ ఎక్కాలనే కోరిక తనకి తెలియ కుండానే వయస్సుతో బాటు పెరిగి పెద్దదై మనస్సంతా ఆక్ర మించుకుంది.

రాజేశ్వరి మరో కొత్త సంగతి చెప్తూంటే తన ఆలోచ నలు కట్టి పెట్టాడు.

"మురళీ! నేనోసారి పల్లెవెళ్ళాను. ఒక నెలరోజులు వుండాల్సి వచ్చింది. అప్పుడు తుఫాను వచ్చింది. గాలీవానా తీవ్రమై నీరు పెరడునిండి ఇంట్లోకి రావటం మొదలైంది. కాస్త కాస్తగా రెండు మూడు అడుగుల వరకూ పెరిగింది. చాలా భయపడిపోయాం అనుకో. అప్పుడు సామాను ఎలాగో పైకి సర్దేస్తూన్నాను నేను. పాలేరు నీటిని బైటకి ఎలా పంపటమా అని చూస్తూన్నాడు.

విలువైన అన్ని వస్తువులూ వదిలి చిన్నాన్న ముత్యాలపల్లకీ తడిసి పోతుందని భయపడిపోతూ దానిపైన ఎన్నో గుడ్డలు కప్పి అటువైపు యశోదమ్మని పట్టుకోమని

మరోవైపు తను భుజం మీదకి ఎత్తుకుని ఆ నీళ్ళలో మూడు గంటలైనా అలాగే నిల్చున్నాడు. ఆయన ఆజ్ఞ అణువంతైనా మీరక యశోదమ్మ అలాగే నిల్చుండి పోయింది.

ఆ ముత్యాలపల్లకీ అంటే యెంత అపురూపమో మీరే అర్థం చేసుకోండి. ఆ తర్వాత నీరుని బైటకి పోయేలా చేశాం అనుకో"

సునంద "చాలా చిత్రమైన విషయం కదూ బావా" అంది "ఔను" అన్నాడు యింకా ఆలోచిస్తూనే మురళి.

"నాకింక నిద్దరొస్తోందమ్మా" అంటూ ఇందిర లేచేసరికి అందరూ లేచారు. చాలా పొద్దుపోయింది. ఇక్కడే పడుకుని తెల్లవారి కాఫీ తాగి వెళ్ళండి అని రాజేశ్వరి అనటంతో సునంద మురళికి వరండాలో మంచం వేసి పక్క యేర్పాటు చేసింది.

అనూరాధ ఇందిర గదిలో వెళ్ళిపడుకుంది. మురళి మంచం మీద పడుకున్నాడు. కానీ నిద్రరావటంలేదు. గిరిధర్ తన గదిలోకి వెళ్ళిపోయాడు.

ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. వెన్నెల తన మంచం మీద పడుతోంది. కాస్త దూరంలో వున్న సన్నజాజుల పరిమళం చల్ల గాలిలో తేలితేలి వస్తోంది. మురళికి ఆ ఇంట్లో పడుకోవటం కొత్తకొత్తగా వుంది. లనూకి యేం అన్పించలేదు కాబోలు లపురిస్తూ వెళ్ళింది. బహుశా ఈ పాటికి నిద్రపోయి వుంటుంది. ఇంటి దగ్గర అమ్మ ఎదురు చూసి చూసి—

"అబ్బాయి వస్తే తలుపు తెరవండి" అని ఇంకా ఫైల్సు చూసుకునే నాన్నగారికి చెప్పి నిద్రపోతుంది. ఆయనా చాలా సేపు చూస్తారు.

ఆ తర్వాత అక్క జలపంతం చేసుంటుంది. అయినా మురళి వుండబే అనుకుంటూ లైటు తీయకుండానే పడుకుంటాడు

మురళికి నవ్వొచ్చింది. ఈఆలోచనరాగానే.తల్లిదండ్రులు వాళ్ళ మమకారం అదీ ఏమిటో! అనుకుంటూ అంతక్రితం మేనత్త చెప్పిన విషయాలు గుర్తు తెచ్చుకుంటూన్నాడు. అలా అలా ఆలోచిస్తూ వుండగానే నిద్రవచ్చేసింది. ఆ నిద్రలో కల. తను పెళ్ళి కొడుకై ముత్యాలపల్లకీ ఎక్కి పూరేగుతూన్నట్లు సన్నాయి శ్రావ్యంగా విన్పిస్తోంది.

తాతగారు జరీ కండువా భుజంమీద వేసుకుని పల్లకీ ముందు గర్వంగా ముఖం పెట్టి మెల్లగా హుందాగా నడుస్తూ న్నాడు.

తను మాత్రం పల్లకీలో ఎదురుగా తలవంచుకు కూర్చున్న పెళ్ళికూతురు ముఖం చూడాలని విశ్వప్రయత్నం చేస్తూన్నా ఆ అమ్మాయి తలయెత్తటంలేదు చివరికి కోపంవచ్చి ఏదో అనేస్తూండగా మెలుకువ వచ్చేసింది.

అదంతా కల అని తెల్సుకుని అత్తగారి ఇంట్లో పడుకున్న విషయం గుర్తుకొచ్చి తనలో తనే నవ్వుకుంటూ

వత్తికిలిపడుకున్నాడు. ఇంతలో ఏదో హిందీ సినీమా పాట సన్నగా విన్పిస్తోంది. ఎవరిదాగొంతు. ఎక్కడినించీ ఆ పాట! ఇంత బాగా పాడగలిగిన ఆ గొంతు పరిచయమైనదే కాని.... ఎవరు! కళ్ళు తెరిచి చుట్టూ చూశాడు.

సునంద పువ్వుల మొక్కల మధ్య కట్టి వున్న సిమెంటు బెంచీ మీద కూర్చుని సన్నగా పాడుకుంటోంది, ఆకాశంలో చందమామ మబ్బులతో దోబూచులాడు తూన్నాడు. మురళికి ఆ ప్రకృతీ, ఆ ఇల్లూ అంతా కొత్తగా యేదోలా వుంది. సునంద అంత బాగా పాడగలదని అసలు తనకి తెలియనే తెలియదు.

ఓహో! భగవంతుడి సృష్టి యెంత విచిత్రం. అందం వున్న చోట అహంభావం పెంచుతాడు. సామాన్యంగా యిలాగే జరుగుతుంది.

అనాకారీలకి అందమైన మనస్సు యివ్వటమే కాక ఏదో ఒక ప్రత్యేకత ప్రసాదిస్తాడు.

మురళి లేచి కూచ్చున్నాడు సునంద దగ్గరకి వెళ్ళి ఏమైనా కబుర్లు చెప్పాలనీ, మరో రెండు పాటలు పాడించి వినాలని అన్పిస్తోంది.

కానీ మనస్సుని నిగ్రహించుకున్నాడు. అర్ధరాత్రి ఏం బాగుంటుందీ! అని.

సునంద అలా పాడుకుంటూనే ఆ సిమెంటు బెంచీ మీద పడుకుని నిద్రపోయింది. కానీ మురళికి నిద్ర రాలేదు.

# 16

"సునందా! ఓ సునందా! గుడ్‌న్యూస్" స్కూటర్ వాకిట్లో వదిలి లోపలికి పరుగున వచ్చాడు. మురళి. లోపల ఎక్కడో వున్న సునంద మురళి గొంతు వింటూనే పరుగున వస్తూ చీరెకుచ్చెళ్ళు అడ్డుపడి తూలిపడిపోదోయి నిలదొక్కుకుం టూంటే—

"అరెరె.........నెమ్మది సునందా!" అంటూ గభాలున వెళ్ళి పట్టుకున్నాడు. సునంద నవ్వు ముఖంతో "నే చెప్పనా గుడ్ న్యూస్" అంది.

"కాదు ...ముందు నే చెప్తా'

"కాదు ...నే చెప్తా"

"ఏం....ఏదైనా హిందీ పరీక్షల రిజల్ట్సు వచ్చాయా చంపేస్తున్నావు బాబూ నే చెప్పేది కాస్త విను."

"వుహూ! ముందు నువ్వు విను."

"నా ఆనందాన్ని ఖూనీ చేస్తూన్నావే?"

"నువ్వు"

"నువ్వు"

"అబ్బబ్బా! సునందా!

"ప్లీజ్! బావా నే చెప్పేది విను. ముందు కంగ్రాచు లేషన్స్ అందుకో. నే ముందే చెప్పాగా నీకు ముందే ఇంటర్వ్యూ తప్పక వస్తుందనీ...."

"అరె! నువ్వు మరోటి చెప్తున్నావనుకున్నా. సరేగానీ ఎలా తెల్సింది!

"నీ పిలుపులో....నీ ముఖంలో...."

"ఇంకా....చెప్పు ఆపేస్తావేం."

"ఇప్పటికి యింక చాలు."

"నాకు చాలా సంతోషంగా ఉంది కానీ సునందా! ఇల్లు అలకగానే పండగైపోయిందా! ఇంటర్వ్యూ వస్తేనేం. తర్వాత సెలక్షన్ రావద్దూ"

"చూస్తూ వుండు. అదీ అయిపోతుంది. ఇంటర్వ్యూలో శ్రీశ్రీ మురళీధర్‌కి సెలక్షనే వస్తుంది. ట్రైనింగ్ అవుతాడు. ఏ జిల్లాకో డిప్యూటీ కలెక్టర్‌గా ఆర్డర్స్ వస్తాయి. ఆ తర్వాత.... తర్వాత....పెళ్ళి చేసుకుని మీ తాతయ్య కోర్కె తీర్చటానికి ముత్యాలపల్లకీ ఎక్కి....

అంటూ పకపకా నవ్వే సునంద ముఖంలోకి హుషారుగా చూస్తూ—

"ఓయ్! పిచ్చి సునందా! నీ వన్నట్లు ఇంటర్వ్యూ వచ్చింది. అందులో సెలెక్టవొచ్చు. ట్రైనింగ్ అయి డ్యూటీలో జాయిన్ కావచ్చు.

సరే యింక మిగిలింది పెళ్ళి. పెళ్ళికి ముత్యాలపల్లకీ రెడీగా వుంది కానీ అందులో ఊరేగే పెళ్ళికూతురు ఎక్కడా కన్పించటంలేదే!

చిలిపిగా నవ్వుతూ అన్నాడు.

"ఇదిగో బావగారూ! నే చెప్పేది కాస్త వింటారా"

"నిరభ్యంతరంగా!"

"అయితే వినండి! కలెక్టర్ అయిపోయారంటే పెళ్ళి కూతుర్ని ఎంచుకోవటం కష్టం. ఎందుకైనా మంచిది. పెళ్ళి కూతుర్ని ఎంచుకుని ఉంచుకోండి. లేకుంటే అవివాహితులైన ఐ. ఎ. యస్. ఆఫీసర్ అమ్మాయిలు నిన్ను ఎగరేసుకుపోతారు. ఆ అమ్మాయిలని చేసుకుని నీ వంతగా సుఖపడలేవ నా నమ్మకం. బోలెడంత కట్నం ఇచ్చి కొనుక్కునేందుకు శ్రీమంతులు పోటీ పడతారు. బంగారు పంజరంలో బందీవి అయిపోతావు బావా! నే చెప్పినట్లు విని ఓ అమ్మాయిని సిద్ధంగా ఉంచుకో. ట్రైనింగ్ అవగానే ముత్యాలపల్లకీ ఎక్కించేద్దువుగాని. అయ్యో! మర్చిపోయాను. ముందు క్షణంలో 'టీ' తీసుకొస్తాను."

"అత్తయ్యా! ఇందిరా లేరా యింట్లో"

"గిరి అన్నయ్య పూరు వెళ్ళింతర్వాత పుత్తరం రాశాడు కులాసాగా చేరానని. ఇంక అమ్మానాన్నా ఇందిరా ఎవరిహాబీల్లో వారున్నారు.

అయ్యో టీ నీళ్ళు మరిగి పోతున్నాయి" లోపలికి పరుగు తీసింది సునంద.

అయిదు నిమిషాల్లోనే టీ తెచ్చి మురళికి ఒక కప్పు అందించి తను ఒక కప్పు తీసుకుని తాగుతూ—

"బావా! నాలుగు రోజుల క్రితం ఇంగ్లీషు పిక్చర్ మాట్నీలో కన్పించి 'నమస్తే' చెప్పిన అమ్మాయి యెవరు.

ఆరోజు నేనూ ఇంట్లో బోర్! అన్పించి పంటరిగా సినిమాకొచ్చానులే. అప్పుడు చూశాను."

"ఔను! మరి నాకు కన్పించలేదేం. ఆ అమ్మాయిని గురించి కదూ అడిగావు. ఆ అమ్మాయి వివరాలు తెలియవు. కానీ ఒక రోజు రాత్రియెనిమిది గంటలు దాటి వుంటుంది. వంటరిగా ఆటోలో ఫ్రెండ్ ఇంటినించి తన ఇంటికి వెడుతూన్నదట. వాడేమో దారి తప్పించేశాడు. ఆ అమ్మాయి గట్టిగా కేకలు వేస్తూన్నా వాడు 'ఆటో' ఆపటంలేదు. ఆ రోడున కూడా అంతగా జనంలేరు. సరిగ్గా అప్పుడు నేను ఓ ఫ్రెండ్ ఇంటి నుంచి ఇంటికి వెడుతూ చూశాను.

ఆగి "ఆటో" ఆపించాను. ఆ అమ్మాయి గభాలున క్రిందికి దిగి జరిగింది చెప్పింది కన్నీళ్ళతో వణికిపోతూ. తర్వాత అంతా మామూలేగా. ఆ అమ్మాయిని నే వెరుగున్న ఓ రిక్షాలో యెక్కించి పంపేశాను అంతే. కృతజ్ఞత చెప్పి వెళ్ళిపోయింది. మళ్ళీ కన్పించలేదు. ఆ మాట్నీలో కన్పించి నన్ను గుర్తు పట్టింది. కానీ నేను వాస్సేపటి వరకూ గుర్తుపట్టలేదు. యిదీ మా పరిచయం"

"ఒకరి అడ్రెస్ ఒకరు తీసుకోలేదూ!"

"ఎందుకు?"

"నా తలకాయకి. సరేగానీ సినిమాలో చాలాసేపేమాట్లాడింది నీతో"

"ఔను. తన ఫ్రెండ్‌తో వచ్చిందని ఆ అమ్మాయిని పరిచయం చేసింది. నా అడ్రెస్ అడిగింది."

"మరి నువ్వ?"

"నేనూ అడిగాను. అడ్రెస్ కాదు. ఆ అమ్మాయి పేరు."

"ఏమిటిట"

"నీరజ"

"నా క్కిష్టమైన పేరు. సరే ఆ నీరజకి అమ్మా నాన్నా. అన్నా చెల్లీ వగైరా వున్నారా!"

"తెలియదు"

"పోనీ యేం చదువు తోందిట"

"తెలియదు"

"మరేం తెల్సు"

"నీతో కబుర్లు చెప్పటం"

"వూ! నువ్వ పనికిరావు మురళీ. సరే యింతకీ ఆ అమ్మాయి వివరాలు తెల్సుకునేదెలా"

ఈసారి కన్పించినప్పుడు అడుగుతాను"

"ఎందుకంటే!"

"మా సునంద అడగమంది అంటాను." అంటూ నవ్వాడు.

"వూ! ఈసారి కన్పిస్తే కులం గోత్రం చదువూ సంధ్యా పనీ గినీ ఆటా పాటా .... వివరాలు అడుగు. పిల్ల అందంగానే వుంది. అయినింటి అమ్మాయి అని కట్టూబొట్టూ చెప్తోందిలే. తప్పక అడుగు. యివన్నీ సరే గానీ నాకు పార్టీ ఎప్పుడు. ఇంటర్వ్యూ వస్తే ఇస్తానన్నావు"

"ఇప్పుడే రా మా ఇంటికి. నీకభ్యంతరం లేకుంటే స్కూటర్లో తీసుకెడతాను."

"నిజంగా తీసుకువెడతావా మురళీ."

"యస్! మాట నమ్మకపోతే నీ ఇష్టం."

సునంద తృప్తిగా నిట్టూర్చింది. అంతవరకూ సంతోషంగా వున్న మురళి సునంద నిట్టూర్పు గ్రహించి పులిక్కిపడినట్లయి .. సద్దుకుంటూ "సునందా!" అన్నాడు ఆ అమ్మాయి కళ్ళలోకి పరీక్షగా చూస్తూ —

"సునంద కళ్ళు వాల్చేసి ఆ మాటని మార్చేస్తూ—

"మురళీ! ఈ మధ్య వచ్చి విడిది చేసిన కాపుదమ్మ ఆమె కూతుర్ని వారం తిరక్కుండా వచ్చినదారి పట్టించావు. నీ ప్లాను ఏమిటో నాకు తెలియదు కానీ అది ఎదురు తిరిగితే....చాలా ప్రమాదం సుమా!"

"నా కేం భయంలేదు. నా ప్లాను పని చేసింది అంతే చాలు—

"ఆవిడ నీ మీద చాలా విషప్రచారం ప్రారంభించింది"

"అవన్నీ నన్నేం చెయ్యలేవుగానీ వస్తే త్వరగా రెడీ అవు. వెడదాం"

"అలాగే వస్తాను, ఈ లోపల ఈ పేపర్లు చూడు" అంటూ సునంద లోపలికి వెళ్ళింది.

మురళి ఫిలిమ్‌ఫేర్ తిరగేస్తున్నాడే గాని లోపల చాలా ఆశ్చర్యంగా వుంది. గడ్డం క్రింద చేతులు పెట్టుకుని పుస్తకంలోకి చూస్తూ ఆలోచిస్తున్న మురళిని అయిదు

నిముషాలు అలాగే చూసింది సునంద. చెయ్యి పట్టుకుని లేవ నెత్తుతూంటే ....

"అరె! అప్పుడే రెడీ అయిపోయావా!" అన్నాడు లేస్తూ.

"ఆ! అప్పుడే ఆఫీసరు లక్షణాలు వచ్చేసినట్లున్నాయి. పరధ్యాన చిత్తగిస్తున్నారు. పదండి వెడదాం బావగారూ" అంటూ నౌకరు కుర్రాడితో —

"మామయ్యగారింటికి వెళ్ళానని అమ్మకి చెప్పు. జాగ్రత్తగా వుండు" అని బయలుదేరింది.

మురళి స్కూటర్ స్టార్టు చేశాడు.

సునంద ఒదిగి కూర్చున్నా గాలికి పమిట యెగురుతూ టపటపా శబ్దం చేస్తూ మురళికి తగులుతోంది.

"అరె!" అంటూ సునంద పమిటని తిప్పి నడుం దగ్గర గట్టిగా అదిమి పట్టుకుంది.

స్కూటర్‌ని స్పీడుగా పోనిస్తున్నాడు మురళి.

"మురళి మీ ఇంటికి కాదు. మరెక్కడికన్నా తీసుకు వెళ్ళు. ఎవరూ లేని చోటికి. నీతో యేకాంతంగా మాట్లాడాలి"

"మురళి కాస్త నెమ్మదిగా పోనిస్తూ ...

"ఏం.... ఆ రోజు పార్కులోలా చెయ్యటానికా!"

"కాదు బావా! ప్లీజ్! పరిహాసం కాదు. నాకు మళ్ళీ ఇలాంటి అవకాశం దొరక్కపోవచ్చు" సునంద కంఠం

వణకటం గుర్తించిన మురళి పరిహాసం కట్టిపెట్టి స్కూటర్ మరో వైపుకి తిప్పాడు.

ఊరికి దూరంగా పెద్ద కాలువ. దానిమీద వంతెన. దాని ప్రక్కన కూర్చునేందుకు వీలుందని అని స్కూటర్ లాక్ చేశాడు.

ఆ చుట్టుపట్ల అంతా నిశ్శబ్దంగా వుంది.

అప్పుడప్పుడూ ఏవో బండీలు, లారీలూ, వెడుతూ వస్తూన్నాయి.

సాయంకాలం ఆరు గంటలు కావస్తోంది.

ఆ పరిసరం అంతా నచ్చింది సునందకి.

చుట్టూ చూస్తూ

"అబ్బ! ఎంత బాగుంది మురళీ! నే నెప్పుడూ యిటు వైపు రాలేదు"

ఇద్దరూ కూర్చున్నారు.

అయిదు నిమిషాలు గడిచిపోయాయి.

"సునందా! అప్పుడే అయిదు నిమిషాలు గడిచి పోయాయి" గడియారంలోకి చూస్తూ అన్నాడు.

"వూ! అది సరేకానీ, ఈ ప్రదేశాలన్నీ కెలా తెల్సు? యెప్పుడన్నా యే ఆడపిల్లనన్నా స్కూటర్‌లో షికారు తీసుకొచ్చావా?"

"వూ! తీసుకొచ్చాను. రాజేశ్వరి అత్తయ్య పెద్ద కూతుర్ని"

సునంద నవ్వింది.

ఏదో చెప్పాలని చెప్పటం చేతకాక మరేదో మాట్లాడేస్తోందనేది గ్రహించేశాడు మురళి.

వాతావరణం అనుకూల పర్చుకుంటోందా? లేక ఆరోజు పార్కులోలా "ఏం లేదు పద పోదాం" అంటుందా?

అయినా విషయం చెప్పటానికే యింత సందేహించే విషయం ఏమైవుంటుంది?

మురళి మాట్లాడుతూ వున్నాడే కానీ మెదడు తీవ్రంగా పని చేస్తోంది.

"అది కాదు మురళీ! అసలీ రోడ్లన్నీ ఎప్పుడు సర్వే చేశావని?"

"ఇదిగో ఈ నా జీవనసారథి (స్కూటర్) వచ్చిన తర్వాత సాయంకాలాలు దీన్ని ఎక్కి స్పీడుగా ప్రయాణించటం అలవాటైపోయింది. ఇంక మనస్సులో చికాకుగా వుంటే మరీ సిటీకి దూరంగా వెడతాను. ఆలోచనలన్నీ ఈ ప్రయాణంలో ఆఖరై తిరిగి ఇంటికి వచ్చేసరికి మనస్సు తేలిగ్గా దూదిపింజలా ఎగిరి పోతూ ఉంటుంది. ఇదీ సంగతి."

"మంచి అలవాటే" నవ్వింది సునంద.

"ఊ! పది నిమిషాలు" తన ఎడంచెయ్యి సునంద కళ్ళ దగ్గరకి చాచాడు.

"ఊ! అసలు విషయంలోకే వస్తున్నాను. సూటిగా అడిగేస్తాను. కాదు చెప్పేస్తాను. బావా! నన్ను చాలా అభిమానిస్తావుకదూ"

'అవును.'

"నేనోమాట చెప్తాను వింటావా?"

"చెప్పు"

"ఇందిరని గురించి నీ అభిప్రాయం ఏమిటి? జవాబు సూటిగా చెప్పాలి"

"అభిప్రాయం ఏర్పరుచుకునేంతగా ఇందిరని గురించి ఆలోచించలేదెప్పుడూ! అయినా నువ్వు అడిగావు గనక చెప్తున్నాను"

"ఇందిర అంటే అత్తయ్య కూతురనే అభిమానం వుంది. అయితే ఆ అమ్మాయి వేషభాషలు నచ్చవు. అతి స్వేచ్ఛాప్రియత్వం నేను హర్షించలేను సునందా!"

"అతి స్వేచ్ఛ నీ కిష్టం లేకుంటే అదుపులో వుంచుకో వచ్చుగా! అనూరాధ గిరికి భార్య కావాలంటే నువ్వు ఇందిరని చేసుకోక తప్పదు మురళీ!"

మురళి జవాబివ్వలేదు. కానీ ముఖం ఎర్రబడి పోవటం గుర్తించింది సునంద.

అయినా తను చెప్పదల్చుకున్నది చెప్పేస్తూ....

"మురళీ! గిరీ, అనూరాధల మనస్సులు ఎప్పుడో కల్సి పోయాయి. నీ పెంకెతనంతో వాళ్ళ పెళ్ళికి ఆటంకం ఏమంత మంచిదికాదు. శాస్త్రోత్తరం ఆలోచించు మురళీ! ఈ రెండు వివాహాలూ జరిగితే మన రెండు కుటుంబాలూ ఇప్పటిలా కల్సి వుంటాయి. లేకుంటే....ఎన్నో కలతలు, కావేషాలు."

"సునందా! నువ్వూ ఇలాగే మాట్లాడుతున్నావా! అనూ పెళ్ళి నా పెళ్ళితో ముడిపెట్టటం చాలా అసహ్యంగా ఉంది. ఇంకా చెప్పాలంటే పరమ దరిద్రంగా వుంది."

ఇదిగో సునందా ముసుగులో గుద్దులాట వద్దు—

"నేను ఇందిరని పెళ్ళి చేసుకోపటం కల్లోని మాట. పోతే 'మా అనూని' మీ అన్నయ్యకి చేసుకుంటారా లేదా? అనే విషయం తెల్సుకోవటానికి త్వరలోనే తాతయ్య మీ ఇంటికి వస్తాడు. నేనింకేం చెప్పలేను."

మురళి ఆవేశం పెరిగిపోతుందని తెల్సి ఈ విషయం మాట్లాడక తప్పలేదు సునందకి.

మురళి మొండిగా ఇచ్చే జవాబుకి బాధ పడిపోతూ ....

"మురళీ! అనూరాధ నీకు ఆరో ప్రాణం కాదా? అయినప్పుడు నీ చెలాయి భవిష్యత్తు కోసం జీవితంతో రాజీ పడలేవూ?"

"సునందా! ఇది ఒకరోజు సమస్య కాదు. నూరేళ్ళ పంట. అందుకే నే రాజీపడను."

మురళి ఖచ్చితమైన జవాబులు వింటూ లోలోపల భయపడి పోతోంది సునంద.

"మురళీ! పెళ్ళి జరిగిన తర్వాత నీ ఉద్దేశ్యాల ప్రకారం ఇందిరని చాలా సులువుగా మార్చుకోగలవు. అసలు అది నిన్ను చాలా ప్రేమిస్తోంది మురళీ"

"అసలు చేసుకో నంటూంటే .... ఆ .... ఏమిటీ కొ త

మాట చెప్తూన్నావు? ఇందిర నన్ను .... ప్రేమిస్తోందా?.... పట్టిది" నమ్మలేనట్లు చూశాడు.

"నిజం మురళీ! యదార్థం చెప్తూన్నాను."

"కావచ్చు. కానీ నేను ఇందిరని ప్రేమించలేదు."

"మురళీ! ఆవేశపడకు. ఆలోచించు. అనూ భవిష్యత్తు దృష్టిలో పెట్టుకుని మరీ ఆలోచించు. నిన్ను నే చెప్పినట్లు చెయ్యమని బలవంతం చెయ్యను. కానీ .... ఆలోచించమనీ, అర్థంచేసుకోమనీ అర్థిస్తూన్నాను"

"సునందా! ఇందిర నిన్ను ద్వేషిస్తోంది. ఐనా అయినా నువ్వు ఆమెని ప్రేమిస్తున్నావు .... ఎంత విచిత్రం."

"బావా! ఇందిర ఒట్టి అమాయకురాలు. నన్ను ప్రేమి స్తోంది కనకనే ద్వేషిస్తోందేమో."

"ఇదంతా సరేకానీ నువ్వు తనని తిరస్కరిస్తూన్నావనే కోపంతో ఆవేశంలో ఏదేదో చేయరాని పనులు చేసేసి జీవితాన్ని పాడుచేసుకుంటుందేమో అని భయపడుతున్నాను."

"మురళీ! నేనింతే చెప్పదల్చుకున్నది. ఇంకేం చెప్ప లేను కూడా"

"ఇంతేనా మరేమైనా వుందా?"

"ఏం లేదు."

"సునందా! నీకేనా ఇప్పటి పరిస్థితి లాంటిది వచ్చి ఇష్టంలేని పెళ్ళి చేసుకోవల్సివస్తే ఏం చేస్తావ్" తీవ్రంగా చూస్తూ అడిగాడు.

"రాజీ పడటానికి ప్రయత్నిస్తాను" మురళి ముఖంలోకి చూస్తూ అంది.

"నేనంత నిస్వార్థపరుడిని కాను. ఇష్టంలేని పెళ్ళి చేసుకున్నా ఇందిరని సుఖపెట్టలేను. నేనూ సుఖపడలేను. సంసారం నరకంగా మారిపోతుంది"

సునంద జవాబు చెప్పకుండా వింటూ కూర్చుంది.

"సునందా! మనిషికి కావల్సింది బాహ్య సౌందర్యం ఒక్కటే కాదు. నా ఆలోచనలూ, అభిప్రాయాలూ ఇదివరకే ఎన్నోసార్లు చెప్పాను. మళ్ళీ చెప్పి బాధ పెడ్తున్నాంటే క్షమించు సునందా!"

"లేదు బావా! నేను నీవైపునుంచీ ఆలోచిస్తున్నాను. కనకనే వత్తిడి చేయలేకుండా వున్నాను"

"నా బాధంతా అనూరాధ గురించే"

"సరే చాలా టైము అయింది పద పోదాం" లేచింది సునంద —

మురళి స్కూటర్ తీసుకున్నాడు. సునందని రాజేశ్వరమ్మ ఇంటి దగ్గర వదిలి యింటికి వచ్చేశాడు.

అసలు వాళ్ళ ఇంటికి వెళ్ళేప్పుడున్నంత హుషారు అంతా అంతా ఆవిరై పోయింది.

బట్టలన్నా మార్చుకోకుండానే మంచానికి అడ్డంగా పడుకున్నాడు.

మెదడు తీవ్రంగా పని చేస్తోంది.

భవిష్యత్తులో పరిస్థితులు ఎలా మార్పు చెందుతాయో. అని.

# 17

సునందని స్కూటర్‌లో మురళి దించి లోపలకి రాకుండా వెళ్ళిపోవటం ఇందిర చూసింది.

ఆ అమ్మాయి మనసంతా అసూయతో 'భగ్' మంది.

రాజేశ్వరమ్మా, ప్రసాదరావూ కూడా యింటికి వచ్చేసి హాలులోనే కూర్చున్నారు.

లోపలికి వస్తూన్న సునందని ప్రశ్నార్థకంగా చూసింది రాజేశ్వరమ్మ.

ఇందిర నిగ్రహించుకోలేక అసూయని వెళ్ళకక్కుతూ,

"అమ్మా! అక్కయ్య ఎక్కడికి వెళ్ళిందో అడుగు?" అంది.

"మామయ్య ఇంటికి వెడుతున్నానని చెప్పి మరెక్కడ షికార్లు కొట్టివచ్చినట్లు?"

చెల్లెలు ఇలా అనేసరికి సునంద ముఖం పాలిపోయింది.

"ఎక్కడికి వెళ్ళావమ్మా?" తండ్రి కూడా నిలదీసినట్లు అడిగాడు.

"నేను.... నేను.... మురళితో...."

"మురళితో....ఏమిటే చెప్పేది సరిగా చెప్పలేవూ తల్లి గట్టిగా అడుగుతూంటే...."

సునంద చెల్లెలివైపు ఒక క్షణం చూసి నిటారుగా నిల్చుని మురళితో మాట్లాడాల్సిన పని వుంది అందుకే వెళ్ళాను బైటకి"

"ఇంటి దగ్గర గంటల తరబడి మాట్లాడేది చాల్లేదూ!"

"ఏదో అతి ముఖ్య విషయమే అయివుంటుందమ్మా! లేకుంటే బావ అలా చల్లగాలికి స్కూటర్‌లో అక్కయ్యని షికారు తీసుకు వెడతాడా!

అని వ్యంగ్యంగా నవ్వేసి ఎప్పుడైనా చెప్పండి అక్కయ్య అంటే ప్రత్యేకమైన అభిమానం కాదనటానికి వీలులేదు.

అయినా అమ్మా నేను స్వేచ్ఛగా తిరుగుతున్నానని ప్రతి రోజూ ఈ మధ్య కోపగించుకుంటూన్నావు కదా!

మరి అక్కయ్యి కది వర్తించదా!

సునందకి కోపం ఉద్రేకం వెల్లువుతున్నా అదిమి పెడుతూ—

"ఇందిరా" అంది గటిగా.

"ఏం! నన్ను భయపెట్టి నోరు మూయిస్తావా! నాన్నారూ అక్కచేత సరైన జవాబు చెప్పించండి"

ప్రసాదరావు ఇరకాటపడిపోయాడు. ఇన్నాళ్ళుగా చిన్న కూతురికి యిచ్చిన స్వాతంత్ర్యం యిలా వుపయోగించుకుని

తననే నిలదీస్తున్నట్లు మాట్లాడుతున్న ఇందిర 'సారీమమ్మీ' అన్నా వూరుకునేలా లేదు. పెద్ద కూతురి మీద ఎంత సదభి ప్రాయం వున్నా చెప్పలేనంత విషయం మురళితో మాట్లాడేది ఏం వుంటుంది అని ఆయన ఆలోచన. సరిగ్గా ఇందిర ఈ అవ కాశాన్ని పోగొట్టుకోకుండా అక్క ప్రవర్తనకి అపార్థాలు తీస్తోంది. అదీ గాక ఇంతకీ గంటన్నరకి ఇందిర ఎక్కడెక్కడో తిరిగి వచ్చిందని తల్లిదండ్రులు గోపగించారు.

ఇందిర ఇలా తిరగటం కట్టిపెట్టటం చేమురళిభార్యకావటం కష్టం అనేది భార్యాభర్తలు గ్రహించి ఇప్పుడు చిన్న కూతుర్ని అదుపులో వుంచటానికి ప్రయత్నిస్తున్నారు. కానీ చిన్నప్పటి నించీ స్వేచ్ఛగా తిరగటం అలవాటైన ఇందిరకి ఇప్పుడు కట్టడి చేయటం భరించలేక ఏదో ఒక సాకుతో అక్కమైన తప్పు లెన్నుతూ తన ప్రవర్తనని సమర్థించుకోవటానికి ప్రయత్ని స్తోంది.

"నీ కంత చెప్పాలనిపించకపోతే ఫర్వాలేదులేమ్మా" అన్న తండ్రిమాటకి సునంద కళ్ళలో నీళ్ళు తిరిగాయి. వణుకు తూన్న కంఠంతో—

"నాన్నగారూ నేనిలా ఎందుకు బావతో బైటికి వెళ్ళానో ఇప్పుడు చెప్పలేను కానీ మరోసారి తప్పక చెప్తాను" అనేసి గదిలోకి వెళ్ళిపోయింది.

"ముఖం కప్పుకుని అలాగే కూర్చుంది. తండ్రికి తన మీద వున్న అభిమానం సంగతెలావున్నా నమ్మకానికి

ఒకవైపు తృప్తిగా వున్నా మరోవైపు ఇందిర ప్రవర్తనకి మనస్సంతా చేదుతిన్నట్లు అయిపోయింది. తన ఆరవ ప్రాణం ఇందిర. చిన్నప్పుడు ఎంతో అలాగే అక్కని గౌరవించినా ఈ మధ్య ఎందుకో చిరచిరలాడిపోతూ ప్రతి మాటకీ అపార్థం తీస్తోంది. ఇందిర నన్ను అపార్థం చేసుకోవటం యెంత దురదృష్టం."

తనతో తనే కుమిలిపోతూ అలా [illegible] పోయింది సునంద.

"ఇందిర తండ్రి అలా అక్కగారిని సమర్థించేసరికి మండిపడిపోతూ ఏం చెయ్యలేక విసురుగా గదిలోకి వెళ్ళి విసురుగా తలుపులు మూసుకుంది."

"రాజేశ్వరమ్మా ప్రసాదరావూ అలా విగ్రహాల్లా కూర్చుండి పోయారు.

"లాభంలేదు. ఇందిర చాలా మొరటుగా ప్రవర్తిస్తోంది. ఈ లాంటి ఆడపిల్లని చేసుకోవటానికి యెవరు ముందు వొస్తారు. ఒక వేళ పెళ్ళి జరిగినా సుఖపడలేరు. మురళే దీన్ని సరైన దారికి తేగలిగినవాడు.

ఎలాగో ఒకలాగ ఈ రెండు పెళ్ళిళ్ళూ కలిసివచ్చేలా దయచూడు భగవంతుడా. అని లోలోపల దేవుడికి మొక్కుకుంది రాజేశ్వరమ్మ.

"గారాబం చేసి నేనే ఇలా పాడు చేశానా" అని ప్రసాదరావు లోలోపల విచారిస్తున్నాడు "ఆలోచిస్తున్న భర్తతో మెల్లగా" "చిన్నాన్నా మళ్ళీ వచ్చి మాట్లాడుతా" అని వెళ్ళిన వాడు రానేలేదు.

'ఇప్పుడు చేయవల్సినదేమిటో అర్థం కావటంలేదు. ఇందిర పెళ్ళి ఎలా జరుగుతుందో అసలే పెద్దపిల్ల పెళ్ళి కాకుండా ఇంట్లో వుందనే ఇరుగూ పొరుగూ చెవులు. కొరుక్కుంటున్నారు. ఇంక ఇందిర పెళ్ళి ఎలా అవుతుందో ఏమిటో....'' దిగులుగా అంది.

"సునంద ఇంక సంబంధాలు వెదకవద్దనీ అసలు తను ఇప్పట్లో పెళ్ళి చేసుకోననీ టీచరు ట్రైనింగ్‌కి వెడతాననీ గట్టిగా చెప్పిందిగా...."

"తన పెళ్ళితో ఇందిర పెళ్ళి లంకె పెట్టవద్దని కూడా చెప్పిందిగా. మరి మనం యేం చెయ్యగలం. అది దృఢనిశ్చయానికి వచ్చే మనతో చెప్పింది."

టీచరు వుద్యోగం చేస్తూ వున్నా యే తనకి నచ్చినవాడు తనని కావాలనుకునేవాడు ఎప్పటికైనా వస్తే అప్పుడు ఆలోచిస్తుందట. రాజీ ఏదీ మన చేతుల్లో లేదు. అనవసరంగా బాధ పడకు మీ చిన్నాన్నని రమ్మని పోనీ నువ్వు వుత్తరం రాయ కూడదూ!

"నేనూ అదే ఆలోచిస్తున్నాను. వుత్తరం రాస్తాను. గానీ సునంద విషయం అలా వదిలేస్తే ఎలాగండీ. గిరి చేత నచ్చ చెప్పిస్తే"

"లాభంలేదు రాజీ ...సునంద చాలా తెలివైంది. పైగా వివేకంగా ఆలోచించగలదు కూడా. మనం యిన్ని సంబంధాలు తెచ్చి చూపటం వాళ్ళు నిరాకరించటం కూడా సునంద మనస్సుని గాయపర్చింది.

అందుకే లలిత పెళ్ళి వద్దు అంటోంది. వాళ్ళు మనం పూనుకోవటమే మంచిది."

"అన్నీ మన చేతిలో లేవనీ భగవంతుడి యిచ్ఛ అనీ చెప్తూన్నానా. ఇంక ఆ విషయాలు వదిలెయ్యి."

ప్రసాదరావు విసుగ్గా వాడిగా మాట్లాడటంతో రాజేశ్వరమ్మ ఇంకేం మాట్లాడలేకపోయింది.

# 18

మురళి ఇంటర్వ్యూ అయింది. సెలెక్టు అవుతాననే ధైర్యం ఉన్నా ఫలితం కోసం ఎదురు చూస్తుంటే కాలం గడవనట్లేవుంది.

రాజేశ్వరమ్మ తమ్ముడికి కబురు పంపింది ఇలా—

"గిరిజకి పెళ్ళి సంబంధాలు వస్తున్నాయి. మీరేం జవాబు చెప్పలేదు. చిన్నాన్నకి ఉత్తరం రాసి పిలిపించవల్సింది. రెండు పెళ్ళిళ్ళూ సాధ్యమైనంత త్వరలో జరిపేయాలని మా ఉద్దేశ్యం." అని

నారాయణరావు ఖంగారు పడిపోయి మురళిని పిల్చి "తాతయ్యని వెంటనే తీసుకురా! ఎన్ని ఉత్తరాలు రాసినా జవాబులేదు." అని కొడుకుని పల్లెకి పంపాడు. మురళి పల్లెకి వచ్చాడు.

ఎప్పటిలా ఆ పురాతన ప్రహరీ గోడ లోపల సగం

కూలిన పసారా ముంగిలిలో యశోద సవ్వ్వతూ కన్పించలేదు. వాకిలి ముందు రకరకాల రంగవల్లులు తీర్చిదిద్దిలేవు.

పశువుల పాకలో కూడా చెత్తా చెదారం అంతా గరీజుగా వుంది.

"ఎన్నో రోజులుగా ఆ ప్రదేశం శుభ్రం చేసినట్లేదు. వాకిలి ముందున్న పువ్వుల చెట్లు రోజా మల్లె, [illegible] మందార మొక్కలు నీళ్ళు లేక ఆకులు వ్రేలాడవేసి వున్నాయి. అవన్నీ దీనంగా తనని చూస్తున్నట్లు అన్పిస్తోంది మురళికి.

"ఏమైంది! ఈ ఇంటికి యెన్నోసార్లు వచ్చాడు కానీ ఇలా ఎన్నడూ చూడలేదే! అనుకుంటూ యిటూ అటూ చూసి సావడితలుపు మెల్లగా తోసి లోపలికి వస్తూ, "యశోదమ్మా! యశోదమ్మా' అని రెండు సార్లు పిల్చినా జవాబు రాలేదు చేతిలోని బ్యాగు క్రింద పెట్టి మరో అడుగువేసి అన్నాడు లోపలికి చూస్తూ—

వారం రోజులుగా కళ్ళు తెలియని జ్వరంతో మంచం మీద పడుకొని వుంది యశోదమ్మ. దశరథరామయ్యగారు ఈ వారం నుంచీ పగలూ రాత్రి మేలుకుని యశోదకి మందూ పథ్యం ఇస్తూ కంటికి కునుకులేక అలా ఆ మంచం పట్టెమీద తలపెట్టుకుని అలా నిద్రపోతున్నారల్లా....

"తాతయ్యా" అనే పిలుపుకి కళ్ళు తెరిచి ఎవరు అన్నారు కళ్ళు నులుముకుంటూ. మురళిని గుర్తుపట్టి ఆదరా బాదరా లేచి

"అయ్యో! యింత యెండలో వచ్చావా నాయనా! మంచి నీళ్ళు కావాలా! అలా కూర్చో. ఇంటర్వ్యూ బాగా జరిగిందా! ఈసారి ఎలాగైనా సరే సెలక్షన్ వచ్చి తీరాలిరా నాయనా! యివిగో మంచినీళ్ళు" అంటూ గ్లాసుతో నీళ్ళు అందించాడు. అవి తాగబోతూ ఆగి 'యేమైంది. యశోదమ్మకి. వారం నుంచి జ్వరమా! నాకు ఉత్తరం ఎందుకు రాయలేదు తాతయ్యా' అంటూ నీళ్ళు తాగి గ్లాసు క్రింద పెట్టి యశోద మంచం దగ్గరగా వచ్చి అక్కడున్న స్టూలు మీద కూర్చుని యశోదమ్మ చెయ్యి పట్టుకుని "అబ్బ. జ్వరం చాలా తీవ్రంగా వుందే యే డాక్టర్‌కి చూపించావు తాతయ్యా" అంటూ తన తండ్రి చెప్పమన్న విషయాలన్నీ చెప్పేశాడు.

అన్నింటికీ వూ....అంటూన్నారాయన. వారం నుంచీ సరిగా నిద్రలేక తిండిలేక, ముఖం కష్టా పీక్కుపోయి నట్లయి దుబ్బులా పెరిగిన గడ్డంతో యెలాగో వున్నా రాయన.

యింకయశోదమ్మ తెల్లగా పాలిపోయిన ముఖంతో చిక్కిశల్యమైపోయింది. ఆ యిద్దరినీ చూస్తూంటే మురళికి 'అయ్యో' అన్పించింది.

"తాతయ్యా! యివాళ యింకా భోజనం చేయనే లేదా!" అన్నాడు.

అంత నీరసంతోనూ మురళిని చూసేసరికి యశోదమ్మ ముఖం వికసించింది.

"మురళీ బాబూ! మీ తాతయ్య ఈ రోజేకాదు వారం నుంచీ అలాగే వున్నారు. యెన్నడూ పడక వెయ్యని నేను మంచం యెక్కేసరికి మీ తాతయ్యకి భయంగా వుంది" అంది నవ్వు తెచ్చుకుంటూ—

"ఎందుకు భయం?"

"నే చచ్చిపోతానేమో అనీ తను ఒంటరిగా బ్రతకవలి వస్తుందేమోననీ ...అంతే"

"ఛీ. ఛీ... యేం మాటలవి. మరెప్పుడూ అనకు. యశోదమ్మా నీకు తాతయ్యా తాతయ్యకి నువ్వూ వున్నారు. మీ యిద్దరికి నేను వున్నాను.

నాకు వుద్యోగం రాగానే మీ ఇదరూ ఇక్కడ ఒక్క క్షణం వుండేందుకు వీల్లేదు. నా దగ్గరే వుండాలి. తెలుసుగా. ఈ మాటకి మీరు అడ్డు చెప్పారా వూరుకోను. నే నెవరో తెల్సుగా. దశరథరామయ్యగారి మనవడిని. అర్థమయిందా తాతయ్యా"

మురళిబాబూ" యశోద కళ్ళ వెంట నీరు వుబికి వస్తోంది.

దశరథరామయ్యగారు చెమర్చిన కళ్ళని మనవడు చూడకుండా తుడుచుకోవటానికి ప్రయత్నిస్తూ పట్టుబడి పోయారు.

యశోదమ్మ నోట మాట రావటంలేదు. అయినా గొంతు పెగల్చుకుని—

"బాబూ! నీ అభిమానంతోనే మనస్సు నిండి సంతోషంతో పొంగిపోతోంది. మరి ఆ అవసరం రాకుండా ఇక్కడే యీ యింట్లోనే మీ తాతగారి చేతి మీదగానే యీ పుట్టింట్లో కలిసిపోవాలనీ అలా చెయ్యమనీ దేవుడిని ప్రతినిత్యం కోరుకుంటూన్నాను" అంది.

"ఛా! అలాంటి మాటలు నేను వినను. ఉపన్యాసం సరేగానీ తాతయ్యా లేచి స్నానం చెయ్యి ముందు భోజనం చేదువుగాని" తాతగారి చెయ్యి పట్టుకుని లేపనెత్తబోయాడంతే యశోద—

"అసలు వంట చేయందే" అంది.

"అయ్యో అలాగా! అయితే నే చేస్తానుండు. యశోదమ్మా వంటకి అన్నీ వున్నాయిగా" అంటూ తాతగారిని వదిలి వంటవసారా తలుపులు తెరిచాడు. పొయ్యి ఎలాగో వెలిగించి బియ్యం కడిగి పెట్టాడు.

"అసలు మురళికి వంట చేయటం రానేరాదు. అసలు అన్నపూర్ణమ్మ నేర్పలేదు.

'కానీ యిలా అప్పుడప్పుడూ పల్లె వచ్చినప్పుడు తాతగారు వంట చెయ్యటం చూసి ఆయనకి ఒకటి రెండుసార్లు వంట పనిలో సాయపడాడు. అది ఈరోజు పనికి వచ్చింది. అయితే పొయ్యి మండక పొగ కళ్ళల్లోకి వచ్చి నీళ్ళు కారి ముఖం మండిపోతోంది.

"ఛూచ్! ఈ పల్లెటూళ్ళ అలవాట్లు ఇంకా యాభై సంవత్సరాల వెనకనే ఉన్నాయి."

"యశోదమ్మ ఈ పొగలో ఎలా చేస్తోందో! కాదు కాదు తాతయ్య యెలాచేస్తూన్నా డబ్బా!"

లోలోపల విసుగ్గా వున్నా తాతగారు అన్నం తినలేదనే బాధ మురళికి ఇంత ఓర్పునిచ్చింది ఎలాగో అన్నం వుడికింది. అసలు ఆ పొగలో కట్టెలపొయ్యి మీద అన్నం వండినందుకు తన సహనశక్తికి తనే ఆశ్చర్యపోతూ—

"తాతయ్యా. వంట అయింది త్వరగా స్నానం పూర్తి కానివ్వు" అంటూ కేకపెట్టాడు. దశరథరామయ్యగారు యశోదకి మందు ఇచ్చి బావిదగ్గరకి వెళ్ళి బక్కెటుతో నీళ్ళు తోడుకుని నెత్తిన గుమ్మరించుకుని వళ్ళు సరిగా తుడుచుకోకుండానే వంట వసారాలోకి వస్తూ —

మురళీ! నీకూ నాకూ వడ్డించు. పంచకట్టుకు వచ్చేస్తూన్నా అంటూ పొడిపంచకట్టుకుని ఓ తువ్వాలు భుజాన వేసుకుని దుబ్బులా వున్న గెడ్డాన్ని యెడంచేత్తో సవరించుకుంటూ మనవడు వేడి వేడి అన్నం ఆవకాయా వడ్డించిన విస్తరిముందు కూర్చోబోతూ 'ఇంకా యేం చేస్తూన్నావురా నాన్నా! అన్నారు ప్రేమ పొంగి పొర్లి పడ్తూంటే—

"నెయ్యి కరగబెట్టి తెస్తూన్నాను తాతయ్యా! నువ్వు ముందు కూర్చుని అన్నం కలుపుకో" అన్నాడు మురళి వేడి గిన్నె వాయిటంతో తెస్తూ—

"తాతయ్యా వారం రోజులుగా ఆకలీ అన్నం మర్చి పోయి ఎలా వున్నావు" అన్నాడు.

"యశోద జ్వరంతో ముసుగు పెట్టేసరికి నాకు ఆకలి సంగతే గుర్తులేదు నాయనా" కూర్చో కలుపుకుందాం. అన్నట్లు పెరుగు గిన్నె అక్కడ అల్మారాలో వుంది పట్టుకురా" అంటూ నీళ్ళ గ్లాసు అందుకుని పోపోసన పట్టబోతూండగా వాకిట్లోంచి 'దశరథరామయ్యగారూ' అంటూ ఆ వూరి ప్రెసిడెంటుగారి కొడుకు నలుగురు నౌకర్లతో వచ్చాడు.

'ఆ వస్తున్నా' అంటూ దశరథరామయ్యగారు నీళ్ళ గ్లాసు క్రిందపెట్టి పైమీది తువ్వాలు సరిగా కప్పుకుంటూ "నాన్నా మురళీ నువ్వు తింటూవుండు వాళ్ళు ఎందుకొచ్చారో కనుక్కొని వస్తాను." అంటూ వెళ్ళాడు.

"నువ్వు వచ్చేవరకూ కూర్చుంటాలే తాతయ్యా" అంటూమురళి పీటమీద అలాగే కూర్చున్నాడు. వాకిట్లో నించి మొదట మెల్లగా ప్రారంభమైన మాటలు క్రమంగా ఆవేశం పుంజుకుని గట్టిగా వినిపిస్తున్నాయి.

"ఈ ముత్యాల పల్లకీ ఇవ్వటానికి వీలులేదు బాబూ! యెందరో అడిగారు. నే నివ్వనని అందరికీ చెప్పా. నువ్వు అన నరంగా నన్ను నిష్ఠూరి పెట్టకు." తాతగారి గొంతు ఖం ఠంగా వినిపిస్తోంది.

"అది కాదండీ. మా చెల్లి ముత్యాలపల్లకీ కావాలని తెగమనసు పడిపోతోంది. ఇరవై వేలు ఖరీదు చేసే కాసు

తెచ్చి పూలదండలతో అలంకరించి ఊరేగింపుకి వాటిల్లో పెడితే ఆ ఫారెన్ పెళ్లి కొడుక్కీ ఈ పెళ్ళి కూతురికీ ఇరు అక్కర్లేదట. పల్లకీ యే రావాలట ...

ముత్యాలపల్లకీ మీకు తప్ప ఇంకెవ్వరికీ లేదుగా! కనక మీరివ్వాలి తప్పదు."

"క్షమించు బాబూ! యివ్వలేనందుకు విచారపడు తున్నాను"

"అలా అనకండి. అంటే బలవంతంగా తీసుకువెళ్ళవల్సి వస్తుంది."

"ఆ పైన మీ ఇష్టం. అమితల రూపాయిలు పట్నంపోసి కొనుక్కున్న పెళ్ళికొడుకు వచ్చి కూర్చున్నాడీ ముత్యాల పల్లకీ కోసం." అతని మాటలో కొంత గౌరవం కొంత పొగరూ విన్పిస్తోంది.

"శ్రీనివాస్ మర్యాదగా మాట్లాడటం మంచిది." దశరథ రామయ్యగారి కంఠం ఖంగు మంది.

"లాభం లేదు దశరథరామయ్యగారూ! నేను బలవంతంగా తీసుకు వెళ్ళవల్సిన అవసరం రానీయకపోవటం మంచిదండి. పక్కకి తప్పుకోండి. అరేయ్ .... ఆ గదిలో ఉంటుంది బైటకి తీసుకురండిరా! ఒకే ఒక్కరోజు. రేపు పువ్వుల్లో పెట్టి మీకు తెచ్చి ఇస్తాం"

దశరథరామయ్యగారి ముఖం వివర్ణమైపోయింది. నిజానికి ప్రెసిడెంటుగారు చాలాసార్లు కష్టసుఖాల్లో ఆదుకున్నారు.

నిజమే....అందుకు తను ఏది కావాలన్నా ఇవ్వటానికి సిద్ధమే....

కానీ తన ప్రాణంలో ప్రాణం తన ఆశల్లో ఆశ అయిన ముత్యాలపల్లకి కావాలంటే ఇవ్వటం మాత్రం జరగని పని. ఇది ప్రెసిడెంటుగాదు ఆ దేవుడే దిగివచ్చి కావాలన్నా ఇవ్వడు ఇవ్వలేడు.

ఈ ముత్యాలపల్లకీలో మొదటిసారి తన మనవడు తన ఆరో ప్రాణం మురళి బాబే పెళ్ళికొడుకై ఊరేగాలి. ఇదే తన కోరిక ఇది తప్పని సరిగా తీరాలి.

దీని కోసమే ఈ పలకీని ప్రాణప్రదంగా కాపాడుతున్నాడిన్ని సంవత్సరాలనుంచీ. ఇదివరలో యిలాగ ఎంత మందో ఎన్నో విధాల ప్రయత్నించీ విఫలులైనారు.

అసలు తెలిసీ పెళ్ళిలా అడిగావాలని రావటం నచ్చలేదు. పైగా శ్రీనివాస్ దురుసుగా మాట్లాడుతూంటే ఆయనకి అరికాలి మంట నెత్తికెక్కింది.

అందులో ఆకలి మండి పోతోంది. అందుకే నిష్కర్షగా ....

"వీల్లేదు. వెళ్ళిపొండి" ఖచ్చితంగా అన్నారు.

"ఇచ్చితీరాలి! పదండిరా చూస్తారేం"

"ఏయ్! అడుగు ముందుకు వేశారా ఎముకలు విరిగి పోతాయి పొండి వెనక్కి"

"వెళ్ళటానికి రాలేదు మేం" దశరధరామయ్యగార్ని తోసుకుంటూ లోపలికి రాబోయాడు శ్రీనివాస్ ....

"ఏయ్....' అంటూ ప్రక్కనున్న వాణా కర్ర అందుకున్నారు. ఆ కర్రతో శ్రీనివాస్‌ని ఒక్కసెట్టునెట్టారు. నౌకర్లు ముందుకు రాబోతూంటే—

"రేయ్....వచ్చారా చస్తారు" అంటూ మీదకు ఉరికేసరికి వాకిట్లోకి పారిపోయారు వాళ్ళు నలుగురూ. వాళ్ళకి దశరథరామయ్యగారి కర్ర సాము సంగతి బాగా తెల్సు....

శ్రీనివాస్ తూలిపడి నిలదొక్కుకుని ఒకవైపు నౌకర్లని తిడుతూ మరోవైపు కోపంతో వూగిపోతూ ఆవేశంతో —

"ఏమయ్యా దశరథరామయ్యా! మీ వంశంలో సాంప్రదాయ సిద్ధంగా పెళ్ళి చేసుకోవటం పల్లకీ యెక్కి వూరేగటం అసలెక్కడుంది! తాతని బోరీ పరిపరానా అని నువ్వు ఎక్కావా నీ అన్న కొడుకు అదే ఆ లాయరు యెక్కాడా! ఇంక ఈ మనవడి మీదా నీ ఆశ. ముసలయ్యా గొంతెమ్మ కోరికలు. నీలానే ఆ మురళి కూడా యే గొల్లదాన్నో మాదేపలదాన్నో లేవదీసుకొచ్చి కాపరం పెడతాడు.

మాకు తెలియదా నీ వంశ చరిత్ర. మర్యాదగా ఇవ్వు....ఒరేయ్. వెధవనాయల్లారా పిరికి పందల్లా పారిపోతారేరా! రండి లోపలికి. ఈ ముసలాడేం చెయ్యగలడు" శ్రీనివాస్ మళ్ళీ ముందుకురాబోతూంటే—

"యేం కూశావురా!" దశరథరామయ్యగారిలో పౌరుషం పొంగింది.

"చేతిలోని కర్ర అవతల పారేసి శ్రీనివాస్ షర్టు పట్టు కుని ఒక్క గుంజు గుంజారు.

"ఏం! పున్నమాట అన్నాను. తప్పా! సజావుగా పెళ్ళి చేసుకుంటే సంపాదించి 'ఆలి'కి అన్నం పెట్టాలి. నీలాంటి వాడికి ఆ కష్టంలేదే. యశోదమ్మే పాలూ పెరుగూ అమ్మి నీ కన్నం పెడుతోంది. ఇంక ఆడదాని నగలమ్మి కొన్నపొలం వ్యవసాయం చేస్తున్న రైతు రాజువి. నీ కింత పౌరుషం ఎందుకు!"

దశరథరామయ్య చాచి కొట్టారు శ్రీనివాస్‌ని. అయితే అప్పటికే పారిపోయిన పాలేళ్ళు మళ్ళీ ముందుకొచ్చి దశరథ రామయ్యగారి మీద పడ్డారు.

అప్పటికే అదంతా తెల్లబోయి చూస్తూ పరిస్థితి అర్థం చేసుకున్న మురళిలేచి గభాలున వచ్చి ముందు కురికాడు.

ఈ గలాటా వింటూనే ఇరుగూ పొరుగూ పరుగెత్తు కొచ్చారు. అంతా గోల, గొడవ. ఎవరు ఎవర్ని కొడుతూన్నారో కూడా తెలియటం లేదు.

"గొల్లదాన్ని లేపు కొచ్చినా పౌరుషం తక్కువలేదు" అంటోంది ఓ గొంతు.

"ఒరే! ఆ మారాజుని అన్నావా నాలుక చీరేత్తా! ఏం దశరథరామయ్య గోరు యశోదమ్మని లేపుకొచ్చినా న్యాయానికి నిలబడి గొల్లపిల్లకి అన్యాయం చేశాడా! నీ ఈ శ్రీనివాస్ లాగా ముగ్గురు కన్నె పిల్లలకి 'కడుపు

చేసి బైట పడతిందని మురుక్కాలవలో చంపి పారేశాడా! వాగావంటే సావగొడతా" అంటోంది మరో కంఠం.

దశరథరామయ్యగారి స్నేహితుడు ఆచార్లూ మరి కొందరూ వచ్చి శ్రీనివాస్‌నీ నౌకర్లనీ దూరంగా లాక్కు వెళ్ళారు. లోపలికి చొరబడబోయిన ఆ పాలేళ్ళని మురళి తరిమేశాడు.

కానీ ఆగలథాలో దశరథరామయ్యగారితో బాటు మురళికి కూడా తల మీదా ముఖం మీదా కర్రదెబ్బలు తగిలాయి.

మురళి వత్తైన క్రాపులోనించి రక్తం ధారకడుతోంది. దశరథరామయ్యగారు అసలే భోజనం సరీగ్గాలేక నీరసంగా వుండటంతో ఈ సంఘటనకి ఆవేశపడిపోయి పాలేళ్ళని చావ గొట్టి తనకి తగిలిన దెబ్బకి కళ్ళు తిరిగినట్లయి కుప్పగా కూల బడిపోయారు.

యింక శ్రీనివాసూ ప్రెసిడెంటుగారి పాలేళ్ళూ "ఆ....ఆ .. ఈయన గౌరవం చూసి మనపడికి పిల్ల నిస్తాం అని వస్తాడు."

మనవరాలికి మొగుడొస్తాడు .... ఈ పెళ్ళిళ్ళు ఈ జన్మలో జరుగుతాయి మేం చూస్తాం. మనవడు కలెక్టరు కాక ముందే అయినట్లే ఒను కలెక్టరు తాలిగాడు అయిపోయి నట్లు కలలు కంటూన్నాడు, గొప్ప బోడి గొప్పవాడు పీడూ" అంటూ వెళ్ళిపోయారు.

వడ్డించిన అన్నం విస్తళ్ళు ఈగలు ముసురుతూ అలాగే వుండి పోయాయి.

"యశోదమ్మ ఈ గలభాకి భయపడిపోయి లేపలేక లేచి వచ్చి దర్వాజా పట్టుకుని 'శిలా' విగ్రహంలా నిల్చిపోయింది."

ఆమె కళ్ళ నుంచి నీళ్ళు జలజలా కారిపోతూన్నాయి. తనవల్ల దశరథరామయ్యగారు ఇలా యిందరిలో అవమానం పొందటం దాన్ని తన కళ్ళతో చూడటం ఇది రెండోసారి. మొదటిసారి దాదాపు ఇరవై సంవత్సరాల క్రితం పొలం సరిహద్దులు జరిపి జరిపి తన భూమితో కలుపు కుంటూన్న రౌడీ రంగన్నతో ముందు మర్యాదగానే "ఇది అన్యాయం. నీ హద్దు నువ్వు గుర్తు పెట్టుకో" అన్న దశరథరామయ్యగారి మీద పది మంది యేకమై వచ్చి పడ్డారు. ఆనాడు పది మందినే కాదు పాతిక మందినైనా యెదిరించి తరిమికొట్టగల గుండె ధైర్యం దానితో పాటు వయస్సులో వున్న దండబలం వుంది. న్యాయంగా పొలం గట్టువుండే చోటుకి జరిపినందుకు కొట్లాటలో ఆయన తలకి పెద్ద దెబ్బ తగిలి 'రక్తం' వరదలైంది.

తిరిగి ఈ నాడు ముత్యాలపల్లకి కోసం ఇంటిమీద కొచ్చి మరీ జబర్దస్తీ చేసి గలభా చేశారు. ఇరువైపుల వారికీ కర్రదెబ్బలు తగిలిం తర్వాతగానీ ఆవేశాలు తగ్గలేదు.

దశరథరామయ్యగారి నుదురు మీద తగిలిన గాయం నుంచి రక్తం ధారగా ముఖం మీదకి కారుతోంది.

అది చూసిన యశోదమ్మ మనస్సు బాధతో దుఃఖతో నిండిపోయింది.

నోట్లో పమిట కొంగు కుక్కుకుంది. "దేవుడా ! నా కళ్ళు యిచ్చింది ఈయన అవమానాలని చూడమనేనా" అని—

"తాతయ్యా .... తాతయ్యా" మురళి తాతగారిని అమాంతం పట్టుకుని కుదుపుతూ ఆరాటపడిపోతూన్నాడు.

"భయంలేదు మురళి బాబూ! డాక్టరుకి కబురంపాం. అలా మంచంమీద పడుకోపెడదాం. పటుసాయం. పెద తనం కదూ" అంటూ ఆచార్లుగారు ధైర్యం చెప్పి దశరథరామయ్య గారిని మంచం మీదకి చేర్చారు.

"మురళి బాబూ! తాతయ్య సంగతి సరే ముందు నీ రక్తం యెంతపోతోందో చూడు. అయ్యో !.... ఆ షర్టువిప్పు."

"నాకేం ఫర్వాలేదు. ముందు తాతయ్యని డాక్టరికి చూపించాలి"

"డాక్టరు వచ్చి దశరథరామయ్యగారిని పరీక్షించి గాయాలకి కట్టుకట్టి ఆయన్ని కాస్సేపు విశ్రాంతిగా వుండనీయండి. కళ్ళు తెరవగానే వేడి కాఫీ ఇవ్వండి. మరేం ఫర్వాలేదు." అని చెప్పి మురళి గాయానికి కూడా కట్టుకట్టి వెళ్ళిపోయాడు. మురళికి నుదుట మీదా నెత్తి మీదా దెబ్బ తగిలింది.

"మురళీ బాబూ!" ముందా పొట్లాం విప్పు "ఆచార్లుగారు మరోసారి హెచ్చరించి తెల్లవారిలేచి ఎవరి ముఖం చూశావో గాని రక్తం చిందింది. ఆ శ్రీనివాసుగాడికి పళ్ళు పొగరు ఎక్కువ. వెధవ."

అంటూ తిడుతున్నాడు. మురళీ గదిలోకి వచ్చాడు. యశోద మురళిని పట్టుకుని బావురుమంది.

"తాతయ్యకి ఏం భయంలేదు యశోదమ్మా!" అంటూ ధైర్యం చెప్పాడు.

"ఈ పాపిష్టిదాని మూలంగా మీ వంశానికి ఇంత అప్రదిష్ట వస్తుందని ఆ నాడే తెల్సివుంటే ఈ జీవితం కావాలని కోరుకునేదాన్ని కాదు బాబూ! నా మూలంగా మీ తాతయ్య జీవితమే చీకటై పోయింది.

అతి ఆశతో ఆయన మంచి మనస్సు నాకే స్వంతం కావాలనుకున్నాను.

ఆ అమృతం హృదయంలో చోటు చేసుకున్న నేను అదృష్టవంతురాలినని పొంగిపోయానే కానీ నా సుఖం మీ వంశానికి 'శాపం' అయి మీ అందర్నీ బాధిస్తుందని అనుకోలేదు బాబూ!

ఆయనకి తన రక్తం పంచుకుని పుట్టిన పిల్లలు కావాలని ఎంతో కోరిక.

కానీ తెలియక యవ్వనపు పొంగులో ఓ పొరపాటు చేసినందుకే నాలో నేను కుమిలిపోతూ మరో పొరపాటు చేసి నాకు కల్గిన సంతానానికి కూడా వ్యథ కల్గించనా! నాకు

పిల్లలే పుడితే సమాజంలో ఎంత గౌరవంగా బ్రతుకుతారు చెప్పు! అందుకే మీ తాతయ్య కోరిక నిరాకరించి శాశ్వతంగా పిల్లలు కలక్కుండా చేసుకున్నాను.

నేనెంత పాపిష్టిదాన్నో చూశావా! నా కోసం తన సర్వస్వం పణంగా పెట్టిన మీ తాతగారికి నే నిచ్చిన సుఖం ఎంత!

చాలా కొంచెం. కానీ కష్టం. 'అవమానం' అశాంతీ ఎక్కువగా ఇచ్చాను. ఆయన ప్రాణ సమానుడివైన నీ రక్తం కూడా రంగు కళ్ళజూడవల్సి వచ్చింది. నేనెంత దౌర్భాగ్యురాలిని మురళీ బాబూ!"

ఇలా మాటాడుతూ వున్న యశోదమ్మ బలహీనమైన చేతులని గట్టిగా పట్టుకుని కన్నీళ్ళు తుడుస్తూ—

"యశోదమ్మా! కులం ప్రధానమంటావు. గుణం ప్రధానం జరిగిపోయిన దానికీ ఇప్పుడు బాధ పడుతున్నావా! పడకు .... పడకు....అసలే బలహీనంగా వున్నావు" మురళి ఓదార్చిన కొద్దీ యశోదమ్మ దుఃఖం పొంగి పొర్లుతోంది.

"మురళీ బాబూ! నా గుండెలో గూడు కట్టుకున్న వ్యథని వెళ్ళబోసుకోనివ్వు. నన్ను ఆపకు. వుడుకు రక్తం పొంగులో మీ తాతయ్య జీవితం నా స్వంతం చేసుకోవాలనే తపన తప్పితే ఆయన జీవితం ఒక్కడిదే కాదనీ తన కుటుంబ సభ్యులతో ముడిపడివుందనీ తెలిస్తే ఆయనకి అనందంతో దూరంగా పారిపోయి వుండేదాన్ని.

"ఈనాడు నువ్వు నన్ను ఎంత గౌరవించినా ఎంత ఆత్మీయంగా 'యశోదమ్మా? అని కన్నీళ్ళు తుడుస్తున్నా నే నా నాడు చేసిన పనికి ఇప్పుడు నీ ముందు సిగ్గుతో చితికి పోతూ న్నాను బాబూ. అయితే చేతులు కాలాయి. ఆకులు పెట్టుకున్నా లాభంలేదు. సమాజంలో గౌరవంగా బ్రతకటానికి ప్రేమ ఒక్కటే చాలదు. 'డబ్బు' అసలే చాలదు. ఇది నే గుర్తించిన సత్యం ..."

వెక్కి వెక్కి యేడుస్తూన్న యశోదమ్మని ఎలా ఓదార్చాలో అర్థం కావటం లేదు మురళికి.

"ఈ రోజుల్లో కూడా కులాల పట్టింపులేంటి యశోదమ్మా ! రోజులు మారిపోయాయి."

"పిచ్చి మురళీ బాబూ!" రోజులు మారి లేదు. మనుషులూ మారలేదు. మారినట్లు నటిస్తూన్నారంతే. అయితే ఒక్క మాట గుర్తుంచుకో బాబూ యే మనిషీ స్త్రీ గానీ, పురుషుడు గానీ వయస్సు పొగరులో ఆలోచించి అడుగువెయ్యాలి. ప్రతి పనీ ఆలోచించి చేయాలి.

అలా చేయకుంటే ఒక్క తప్పుకోసం జీవితంలో ఎవరి ముందూ తలవంచవల్సిన స్థితిని తెచ్చుకోకూడదు. తను తెలియక చేస్తే అది తనే అనుభవించాలి. అభం శుభం తెలియని పిల్లలు అనుభవించే అవమానాన్ని కల్గించకూడదు.

అసలు నాలాంటి 'స్త్రీ' తల్లి కావటానికి హక్కు లేదు. అందుకే .... అందుకే మరో తప్పు చెయ్యలేదు ....

మురళీ బాబూ ... నాలాంటి వాళ్ళకి 'అమ్మ' లయే అధికారం వుందా! చెప్పుబాబూ ! లేదు. అమ్మ అంటే అమృతమూర్తి లోనే వుండాలి. కాదా బాబూ!"

యశోదమ్మ పిచ్చిదానిలా యేడుస్తోంది. ఎన్ని సంవత్స రాలుగానో అదిమి పెట్టుకున్న ఆవేదన ఆపినా ఆగకుండా బైటకి తీసుకుంటూ వచ్చేస్తోంది.

"మురళీ యశోదమ్మ ప్రతిమాటనీ శ్రద్ధగా వింటూ ఆలోచిస్తూన్నాడు. బోదారుస్తూన్నాడు. ఇంకలాభంలేదని నోటికి తన చెయ్యి అడ్డుపెట్టి మెల్లగా లేవనెత్తి యశోదమ్మని మంచం మీద పడుకోబెట్టి దుప్పటికప్పి అనునయంగా దగ్గర కూర్చుని ఆమె చెయ్యి పట్టుకుని గాజులని సవరిస్తూ —

"యశోదమ్మా ! పూరట చెందు....ఇంక ఆలోచనమాని కాస్సేపు విశ్రాంతిగా పడుకో. నీ కెవ్వరూ లేరని బాధపడుతూ న్నావా ! నేను నీ మురళిబాబుని కానూ...."

అంటూంటే దుఃఖం సంతోషంగా మార్చుకుని నా మురళీ బాబూ! యేడవను నాయనా! నా గుండె చాలా తేలికైంది లే" అంటూ కళ్ళు మూసుకుంది యశోదమ్మ.

పొరుగున వున్న లప్పారావు వచ్చి చెప్పాడు. మీ మీదా మీ తాతగారి మీదా ఆ శ్రీనివాస్ దౌర్జన్యం చేశారని రిపోర్టు యిస్తాను పోలీసులకి అని

అంటున్నాడు. కానీ వాళ్ళ నాన్నా పోష్టుమాష్టరుగారూ ఏలాగో వాళ్ళని సర్దేశారు. అని చెప్పాడు.

మురళి అంత కంటే ఆవేశపడిపోయి. "వాళ్ళు కాదు నేనే వెళ్ళి ముందు రిపోర్టు ఇస్తాను పోలీసులకి" అంటూ లేచాను.

"ఇలాంటి చిన్న చిన్న సంఘటనలు ఈ పల్లెటూళ్ళలో మామూలే మురళీ బాబూ! యింక వదిలేద్దాం. కొడుకు తప్పు చేశాడనీ తను వచ్చి మీ తాతగారిని క్షమాపణ కోరుకుంటానని ప్రెసిడెంటుగారు కబురు పంపారు. మరి మనం దీన్ని సాగదీయటం బాగుండదు. ఈరోజు మంచిదికాదు. కనకనే ఇలా జరిగింది." అంటూ సర్ది చెప్పారాయన.

స్పృహ వచ్చిన దశరధరామయ్యగారు ఆచార్లుగారు అందించిన వేడి కాఫీ తాగి మనవడిని సమాధాన పర్చేసరికి చాలా కష్టమే అయింది.

రెండు రోజులు గడిచిపోయాయి. మురళితో తాతగారు "నాలుగు రోజుల్లోనే వస్తానని నాన్నకి చెప్పు నాయనా" అని చెప్పి బ సీకి పంపేశారు.

ఇంక నారాయణరావు కొడుకు యెందుకిన్ని రోజులు రాకుండా వుండిపోయాడో అర్ధంకాక చివరికి తనే బయలు దేరబోతూంటే కొడుకు వచ్చేశాడు.

# 19

ఎడంప్రక్క నుదురుమీద ప్రేలెడు పొడుగు ప్లాస్టర్‌ని చూసి అన్నపూర్ణమ్మ ఖంగారు పడిపోయింది. 'అదేమిటిరా మురళీ' అంది.

"యేం లేదమ్మా అంతగాభరా పడకు. పల్లెలో చెరువుకి స్నానానికి వెళ్ళి మెట్లమీద జాలుజారి పడ్డాను." అని చెప్పాడే కానీ ఆ జవాబు అన్నపూర్ణమ్మకి సంతృప్తి కల్గించలేదు.

కాలుజారి నీళ్ళలో పడితే నుదురికి దెబ్బెలా తగులు తుందిరా! అని నొక్కి నొక్కి అడిగినా మురళి జవాబు చెప్ప కుండా మాట మార్చేశాడు.

"సరేలే కానీ తలంటుకుని వారం దాటింది. ఇవాళ తలంటుకో వేడి నీళ్ళు కాగిపున్నాయి" అంది.

"యీ వారం వద్దులేమ్మా" అంటే ఆవిడ చికాకు పడిపోయి.

"అన్నీ వద్దు....వద్దు....పోనివ్వు తలకాస్త వంచు నూనె రాస్తాను."

అరిచేతిలో కొబ్బరినూనె వేసుకుని వంగిన కొడుకు క్రాపులోకి వేళ్ళు పోనిచ్చి రాయబోతూంటే "అబ్బా" అంటూ బాధగా ముఖంపెట్టి ఎగిరి గంతేశాడు.

"ఏ మైందిరా!" అంటూ నిలదీస్తున్న తల్లికి మరేం చెప్పలేక క్షణం ఆలోచించి "అమ్మా అలా సునంద దగ్గరకి వెళ్ళొస్తాను. తాతయ్య త్వరలో వస్తానన్నారని అత్తయ్యకి చెప్తాను" అంటూ స్కూటరు తీసుకుని బయలు దేరబోతూంటే వాకిలిగేటు తీసుకుని పెలకతాతయ్య లోపలికి వస్తున్నాడు.

"ప్చ! శుభ శకునం" అనుకుంటూ అలాగే నిల్చి పోయాడు మురళి.

పెలక తాతయ్య కుడి చేతిలో ఓ పనస ముక్కా ఎడం చేతిలో మామిడీ, నిమ్మా అంట్లూ వాటిలి మధ్యనించి ఓ చిన్న కరివేపాకు చెట్టు "నేనూ పట్నం వచ్చానోచ్" అన్నట్లు తొంగి చూసోంది.

ఇంక బట్టల సంచీ ఎడం భుజానికి తగిలించుకున్నాడు. కుడిభుజానికి అతుకుల గొడుగు కళ్ళకి ఒక ప్రక్క కట్టిన దారం కళ్ళజోడూ (చెల్వారండి)....

ఎప్పుడసగా బయలు దేరాడోగానీ ముఖం నల్లబడి కళ్ళు లోతుకి పోయినాయి. అసలే డెబ్బైయ్యేళ్ళు దాటుతూన్నాయి.

వొళ్ళంతా చెమట. ముతకనేత చొక్కా ఆ చెమటతో తడిసిపోయింది.

అలా పెలక తాతయ్యని చూస్తేనే మురళికి చికాకు.

ఎందుకంటే ఆయన కంఠం ఖంగ్న మ్రోగటమే

కాదు. యిరుగూ పొరుగునీ యిబ్బంది పెడుతుంది. ఇవాళ ఆయన ముఖం చూడగానే సహజంగా ముందు కోపం వచ్చినా ఆయన వార్ధక్యం జాలి కలిగించింది.

అందుకే నవ్వుతూ "తాతయ్యా! కులాసానా! చాలా రోజులైంది వచ్చి" అన్నాడు స్కూటర్ పట్టుకునే ....

"ఏం! పిలకని పదిలేసి పట్టి తాతయ్యని చేశావేం" అంటూ నవ్వాడాయన....

"అనూరాధా, మురళీ తనకి పిలక తాతయ్య అని పేరు పెట్టారని ఆయనకి తెల్సు. వాళ్ళిద్దరూ చిన్నప్పుడు అలాగే పిల్చేవారు కూడా—

"పెద్దవాడి నవటంలా తాతయ్యా! అందుకే ఇంక అలా పిలవను."

"అహా! యెంత సంతోషంరా మురళీ! సరేగానీ ముందు ఓ గునపం పట్టుపురా, ఈ మొక్కలన్నీ ఇప్పటికే వాడిపోయి నాయి. కాస్త నాటేద్దాం .... పో నాయనా త్వరగా తే...."

"ముందు కాళ్ళు కడుక్కొని మంచినీళ్ళు తాగు తాతయ్యా!"

"ఒరే....నిజంగానే పెద్దవాడివై నట్లున్నావు! మంచినీళ్ళు తర్వాత ముందు నే చెప్పింది తీసుకురా! యేదీ మా అన్నపూర్ణమ్మ తల్లి" అంటూండగానే మురళి చెల్లెలిని

గునపం పట్టుకురమ్మని కేకవేసి తను ఆయన చేతిలోని మొక్క- లని అందుకున్నాడు.

ఇంక పిలక తాతయ్య బట్టల సంచీ వరండాలో బల్లమీద పెట్టుకుని పంచెపైకి కట్టుకుని అనూ అందించిన గునపం పట్టు కుని పాదులు తియ్యటానికి బయలు దేరుతూంటే అన్నపూర్ణమ్మ అక్కడి కొచ్చి—

"బాబాయ్! ముందు కాసిని కాఫీ నీళ్ళు తాగండి" అంది.

"అవన్నీ తర్వాతమ్మా ముందీ చెట్లు ఏవి ఎక్కడెక్కడ నాటాలో చెప్పు.

ఇదిగో ఇక్కడ ఒకటి పెడతాను. మట్టి బంగారంలా వుంది." అంటూ మూరెడు లోతు గొయ్యి తవ్వి దానిలో కరివే పాకు మొక్క నాటి నీళ్ళు పోసి ఆ చిన్న చెట్టు రెమ్మలు ఆప్యా యంగా స

"మురళీ! ఈ కరివేప చెట్టుంది చూశావూ ఇదీ ...దీని వాసనా అమోఘం. ఈ బస్తీలో అన్నపూర్ణ అయిదు పైసలు పెట్టి నాలుగు రెబ్బలు కొని చారులో వేస్తుందే కానీ సువాసన వుంటుందిరా ఆ ఆకులో. వేపాకులా వుంటుందిగానీ చారు ఘుమ ఘుమ లాడుతుంది!

ఈ చెట్టు పెద్దదికానివ్వు. ఆపైన నువ్వే చూడు చారు మజా. ఈ చెట్టు మా పెరట్లోదిరోయ్. మా తాత దీని చారు తాగాడు. నాన్న తాగాడు. నేనూ తాగి డెభ్భైయేళ్ళు బ్రతికాను."

యిదంతా బొమ్మలా నిల్చుని చూస్తూన్న అనూరాధ

"తాతయ్యా! మీ పెరట్లో కరివేప చెట్టు వయస్సెంత?" అంది నవ్వుతూ—

"అయ్యో పిచ్చి లల్లీ! ఇంతేనా నీ తెలివి. ఆనాటి చెట్టే యింకా వుంటున్నానా! పెద్ద చెట్టుకి పిల్లలు పుండవుటమ్మా. మా వంశంతో బాటు అవీ మారిపోతూన్నాయి."

అంటూ మామిడి అంటు నాటేందుకు మరో గొయ్యి తవ్వబోతూంటే "గునపం యిలా యివ్వు తాతయ్యా! నే తవ్వ తాను" అంటూన్న మురళిని క్రిందనుంచి పైకి ఓసారి పరీక్షగా చూసి, నవ్వేసి నుదుటపట్టిన చెమటని యెడంచేత్తో తుడుచు కుంటూ—

మురళీ బాబూ! మల్లెపువ్వులాంటి తెల్లటి బట్టలు వేసు కుని ఈ మట్టి పని నువ్వేం చేస్తావురా! వద్దు. చూడు కొన్ని పనులు కొందరే చెయ్యగలరు.

నువ్వెప్పుడూ ఇలాంటి మంచి బట్టలు వేసుకుని తిరు గుతూ రేపోయెల్లుండో కలెక్టరివై పోయి మా కన్నుల పండగ చేయాలి. ఔను ఒక్కమాట అడగనా!"

"ఊ! త్వరగా అడుగు?"

"నువ్వు కలెక్టరైన తర్వాత పెద్దమేడలో వున్నప్పుడు నేనూ చూడాలని వచ్చి నీ నౌకరుతో పిలక తాతయ్యని వచ్చాననని కబురు పంపితే రమ్మంటావా లేక....నౌకర్లే బైటకి గెంటేసారా"

"తప్పకుండా రానిస్తారు." అన్నాడు మురళి.

"అసలు పిలక తాతయ్యని అడగించటానికా నౌకర్లకి యెన్ని గుండెలు కావాలి" అంది అనూరాధ. ఆయన మురిసి పోతూ మట్టి చేత్తోనే నెత్తిమీద వున్న చిన్న పిలకని ఓసారి సవరించుకుని తృప్తిగా గాలిపీల్చి మామిడి మొక్క నాటేశాడు.

వూ! యింక పనస మొక్క ఆ మూలగా నాటేస్తాను అన్నపూర్ణమ్మ తల్లి దీనికాయలు యెంత పెద్దవంటే ఒక్క మనిషి మోయలేనంత పెద్దవి.

ఇంక రుచి మధురం అతిమధురం. అన్నట్టు ఆ మామి డంటుకి గనక నువ్వు సరిగా పోషణ చేస్తే మూడో సంవత్సా రాని కల్లా కాపుకొస్తుంది.

పెద రసం అది, యీ కాయతో ఆవకాయ గనకపెస్తే బ్రహ్మాండంగా వుంటుంది.

"పిలక తాతయ్య యింకా అలా చెప్పుకు పోతూనే వున్నాడు. మురళికి ఆయన వాదస్తానికి విసుగ్గా వుంది.

"తాతయ్యా! ఇంత చిన్న మొక్కలు ఎన్ని సంవత్సరాల తర్వాత పెద్దవిగాను. అవి యెప్పటికి కాపుకిరాను. మనం తినను"

తాతయ్య పనస చెట్టుకి కుదురు చేయటం ఆపి మురళి వైపు చూస్తూ....

"ఒరే నాయనా! మీ తరానికీ మా తరానికీ యెంతో తేడా!

మీ ఆలోచనలన్నీ యిప్పటికిప్పుడు కలిగే ఫలితాలమీదే వుంటాయి.

కానీ మావి అలా కాదు. నే నాటిన మొక్క నా కొడుకో మనవడో తిన్నా చాలు అని కృషి చేశాం. అంతే. రెండు సంవత్సరాల క్రితం నే వచ్చినప్పుడు అన్నపూర్ణమ్మకి పూజకి ఒక్క పూవు ఉండేదికాదు.

అది చూసి ఓ సారి ఊరునించి వచ్చేప్పుడు నందివర్ధనా, మందారా తెచ్చి నాటాను. చూడు.అవే ఇప్పుడు పెద్దవై ఎన్ని పువ్వులు పూస్తున్నాయో!

కృషికి అర్థం యిదిరా! నా మాటలు నీకు చాదస్తంగా కన్పించవచ్చు అనుకో. అయితే ఒకటి విను. నువ్వే ఉన్నావు. పల్లెకి తాతయ్య దగ్గరికి వెడుతూ ఉంటావు.

అక్కడ పెరట్లో ఉన్న కొబ్బరి చెట్ల కాయలు కొట్టించి నీళ్ళు తాగేసి కాయ అవతల పారేస్తావు కానీ అసలా చెట్టెవరు నాటారు అని ఎన్నడైనా ఆలోచించావా!

సరే అదంతా ఆతరం కథ. ఇక మీ ముందు తరం కోసం మీరేం చేస్తున్నారు. కాస్త ఆలోచించి జవాబు చెప్పు కుర్ర కలెక్టరా"

పాదులు చేసి అన్నింటికీ అనూరాధ అందించిన నీళ్ళు పోసి ఆ మొక్కలకున్న దుక్కలోనే చేతులూ కాళ్ళు కడుక్కొని "అమ్మయ్యా" అనుకుంటూ వసారాలో కొచ్చి కూర్చుంటూ—

"అన్నపూర్ణ తల్లీ ఇప్పుడివ్వు కాస్త కాఫీ" అంటూ ముఖాన పట్టిన చెమట తువ్వాలుతో తుడుచుకుంటూ కూర్చున్నాడాయన.

"తాతయ్యా! నీ కృషి బాగానే వుంది. కానీ ఇది మన స్వంత ఇల్లు అయినా కాదే! ఇంటి వాళ్ళు ఖాళీ చేయమంటే ఆ రోజే వీధిలో నిల్చోవాలి. అప్పుడీ మొక్కలెలా" అంటూ నవ్వేశాడు మురళి.

"ఆ....ఆ....అదేం పదరదు. ఈ ఇల్లు మీరు కొనుక్కోవల్సిందే. నీకు వుద్యోగం రాగానే ఈ యిల్లు స్వంతం చేసుకోవాలి.

ఆ ధైర్యంతోనే ఈ మొక్కలు నాటాను.

ఈ చెట్టు పెద్దవై కాపు కాసి నీ భార్యా పిల్లలు హాయిగా కలకలలాడుతూ ఈ మందారాలతో దేవదేవుడికి పూజ చేస్తూ నీ పిల్లలు ఈ పనసతొనలు తింటూ సుఖంగా వుండాలి.

నాయనా! అప్పుడది నే చూడలేకున్నా యెక్కడున్నా నా ఆత్మ సంతోషిస్తుంది."

"పిచ్చి తాతయ్యా! కరివేప చెట్టుకోసం నలభై వేల ఇల్లు కొనేసుకోమంటున్నావా! అంత డబ్బే వుంటే ఇలా ఉండే వాళ్ళమూ. మొత్తానికి పిలక తాతయ్యే కాక చాదస్తం తాతగారు అని కూడా అనిపించు కుంటూన్నావు. సరేలే....ముందు కాఫీ తాగు" అన్నాడు.

పిలక తాతయ్యకి అనూరాధ కాఫీ తెచ్చి యిచ్చింది.

"ఒరే మురళీ ముఖాన ఆ పట్టే ఏమిటిరా!"

మురళి నుదురు ఒకసారి తడుముకున్నాడు. మనస్సు మాత్రం ముత్యాలపల్లకీ దగ్గరికి పరుగు తీసింది. అందమైన ఆ పల్లకీ కళ్ళలో మెదిలినప్పుడల్లా మనస్సులో యెన్నో సుందర దృశ్యాలు కదులుతూ ఉంటాయి.

సన్నాయి శ్రావ్యంగా విన్పిస్తూన్నట్లే ఉంటుంది. ఆ ఆనందంలో క్షణం తనని తను మర్చిపోతాడు మురళి. యెన్నో ఊహాలు అతన్ని ఉక్కిరి బిక్కిరి చేసేస్తూన్నాయి.

పిలక తాతయ్యాప మురళి జవాబు చెప్పకుండా వూరు కునే సరికి ఈ కాలం పిల్లల తీరే ఇంత. మాట్లాడుతూ ఆలో చిస్తారు. ఆలోచిస్తూ మాట్లాడతారు అనుకుని ఆ విషయం అంత టితో వదిలేసి "అన్నపూర్ణమ్మ తల్లీ అన్నంలోకి కూరలేం చేస్తావ్!" అంటూ తిండిగొడవలో పడిపోయాడు.

మురళి! ఇంతపొద్దెక్కింది. ఇప్పుడు సునంద దగ్గిరకి ఏం వెడతావులే. సాయంకాలం వెళ్ళు" అనటంలో ఇంక లోప లికి వచ్చేశాడు. గదిలోకి వచ్చినా పిలక తాతయ్య మాటలు విన్పిస్తూనే వున్నాయి. ఆయన మాటి మాటికీ కాపుదమ్మ అంటూ యేదో రహస్యంగా చెప్తూన్నది కూడా విన్పిస్తోంది.

మురళి కాపుదమ్మ అనుకుంటూ లోలోపల నవ్వు కున్నాడు. అనూరాధ మాత్రం బుద్ధిమంతురాలిలా ఏదో పుస్త కం చదువుకుంటోంది.

అనూ ఈ మధ్య మరీ మితభాషి అయిపోతోందేమిటి అనుకున్నాడు.

# 20

మురళి అలవాటు ప్రకారం సాయంకాలం స్కూటర్‌లో షికారు బయలుదేరాడు. స్పీడుగా గమ్యం అంటూ లేకుండా కన్పడ్డ రోడ్డు వెంట వెళ్ళిపోతూ వుండగా "బాబుగారూ! ఓ బాబుగారూ...."

అంటూ ఓ ముసలి నౌకరు దాదాపు స్కూటర్ క్రింద పడ్డంతగా అడ్డు వచ్చి చేతులు వూపుతూ పిలుస్తూంటే మురళి ఆశ్చర్యపోతూ ఆగిపోయాడు. "ఎవర్ని పిలుస్తున్నావ్ ?"

"మిమ్మల్నే బాబుగారూ! మా అమ్మాయిగారు లోపలికి రమ్మంటూన్నారు."

"నన్నా! మీ అమ్మాయిగారా! పిలుస్తున్నారా! అసలెవరా అమ్మాయిగారు?" విస్తుపోతూ నౌకరు చూపించిన వైపు తలెత్తి చూశాడు. డాబా మీద నీరజ చిరునవ్వుతో కన్పించి రమ్మని చెయ్యి వూపింది.

స్కూటర్ లాక్ చేస్తూంటే గుండె వేగంగా కొట్టుకుంది. వీళ్ళది యీ యిల్లా. ఈ రోడ్డు వెంట చాలాసార్లు వెళ్ళాడు కానీ .. యెప్పుడూ చూడలేదు. అయినా నీరజ నన్నిలా పిలవటం యెందుకు!

ఒక కప్పు 'టీ' ఇచ్చి ఆనాడు సాయపడినందుకు కృత

జ్ఞత తెల్పి చేతులు దులుపుకోవటానికా! అయినా వచ్చి ఇంకా ఆలోచించటం అనవసరం. అనుకుని ఆలోచనలు ప్రక్కకినెట్టి నౌకరు ప్రహరీ గేటు తీసుకుని పట్టుకుంటే సన్నటి సిమెంటు దారి గుండా లోపలికి వస్తూ చుట్టూ చూశాడు.

నాలుగు పందల గజాల స్థలంలో కట్టిన డాబా యిల్లు చిన్నదే అయినా అందంగా కన్పిస్తోంది. చుట్టూ ప్రహారీ ముందు భాగంలో పుష్పాల మొక్కలూ క్రమ బద్ధంగా పెంచి నట్లున్నాయి.

నీరజ 'సమస్తే', 'రండి' అంటూ యెదురు వచ్చి వరండా దాటిన తర్వాత హాలులో కూర్చో బెట్టింది.

మురళి కూర్చుంటూ ఆ హాలుని పరీక్షగా చూశాడు.

నీరజ రోజ్ ప్రింటెడ్ వాయిల్ చీరె కట్టుకుని అదే కలర్ జాకెట్టు వేసుకుంది. రిబ్బనుతో వాలుజడని మడిచి మధ్యకి కట్టింది.

ఆభరణాలు ఏం వేసుకోకపోయినా నీరజ అందంగా కన్పిస్తోంది. తెల్లని తెలుపు రంగు కాదు కానీ నలుపుకాదు.

గుండ్రటి ముఖం సోగకళ్ళూ, బుల్లిగడ్డం చూడగానే యెదటి వాళ్ళని యిట్టే ఆకర్షించే రూపం. ఆపైన చాలా హుషారుగా కన్పిస్తుంది.

"కూర్చోండి ఇప్పుడే వస్తా" అని 'అంటూ' పత్రిక ముందు పెట్టి లోపలికి వెళ్ళింది. ఈసారి తను కూర్చున్న హాలుని మరీ పరీక్షగా చూశాడు.

కిటికీలకి, దర్వాజాలకీ అందమైన తెరలు వ్రేలాడు తూన్నాయి. తన కెదురుగా గోడకి గుబురు మీసాల ముస లాయన ఫొటో ఒకటి పెదది వుంది.

"దానికి కాస్త దూరంలో గాంధీ, నెహ్రూ, సుభాష్ చంద్రబోస్, ఇందిరా గాంధీ ఫోటోలు కూడా ఉన్నాయి.

మరో వైపు పెద గడియారం రంగ్ రంగ్‌న అయిదు గంటలు కొట్టి మళ్ళి టిక్ టిక్ శబ్దం చేస్తోంది.

ఆ హాలులో ఒక ప్రక్క పుస్తకాల బీరువాలు మూడు ఉన్నాయి.

మురళికి అసలు 'గర్ల్' ఫ్రెండ్స్ ఎవరూ లేరు ఇప్పటి వరకూ. కొదరి చెల్లెలితో కాస్త పరిచయం అయింది. కానీ వాళ్ళు త్వరగానే ట్రాన్స్‌ఫరై వెళ్ళిపోయారు.

ఇంక తల్లి, చెల్లెలు అనూరాధా! తప్పించి కాస్త చను వుగా మాట్లాడేది ఒక్క సునందతో మాత్రమే. ఇందిరతో కూడా అంతగా చనువులేదు. మురళి ఆలోచిస్తూ కూర్చున్నాడు.

ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. నీరజ వచ్చి ఎదురుగావున్న కుర్చీలో కూర్చుంటూ—

"మీరు ప్రతిరోజూ సాయంత్రం స్కూటరులో షికారుకి వస్తారు కదూ" అంది.

"ప్రతిరోజూ కాదు కాని అప్పుడప్పుడూ"

"నేను నిన్న చూశాను. తిరిగి వచ్చేప్పుడు లోపలికి పిలవమని మా నౌకరు సాములుని కాపలా పెట్టాను.

కానీ మీరు కథల్లోని రాజకుమారుల్లా పంచకల్యాణి గుర్రం యెక్కినట్లు స్కూటర్‌లో వాయువేగంలో పోతుంటే మిమ్మల్ని ఆపటానికి భయపడ్డాడు''

నవ్వుతూ అంది నీరజ. మాట్లాడుతోందే కానీ మురళిని పరీక్షగా చూస్తోంది. మురళి అదే చేస్తున్నాడు. నౌకరు ట్రేలో 'టీ', బిస్కెట్లూ తెచ్చి 'టీ' పాయ్‌లాగి దాని మీద పెట్టి వెళ్ళి పోయాడు. నీరజ బిస్కెట్ల ప్లేటు అందించి 'టీ' డికాషన్ కప్పుల్లోకి పంపుతుంటే—

"అనుకోని ఆతిథ్యం లభించింది. మీ యింట్లో ఎవరూ లేరా'' అంటూ అందుకున్నాడు.

"లేకేం ఉన్నారు. నౌకరు సామిలూ. పనిపిల్ల రంగమ్మా వంటా ఇంకా....ఇంకా....''

"యింకా!''

"ఇంకానా! నేనూ, మా తాతయ్యా''

"ఆయన యేరీ''

క్లబ్బుకి వెళ్ళారు. సాయంత్రం అయిదుకీ పావు తక్కువగా క్లబ్బుకి వెడతారు. తొమ్మిదిగంటలు అలా ఆ గడియారం కొడుతూ ఉంటుంది.

ఇలా తాతయ్య గేటు తీసుకుని వచ్చేస్తారు. గడియారం 'స్లోగా' ఫాస్టుగా నడవచ్చేమో గానీ తాతయ్య మాత్రం కరెక్టుగా

వచ్చేస్తాను. ఆ టైం రాక చూసి నా వాచ్‌కి 'కీ' ఇస్తాను. టైము పెడతాను."

"సరిత నవ్వుతూ టీ పోసి మురళికి ఒక కప్పు అందించి తనూ ఒక కప్పు తీసుకుంది.

"మీ తల్లి దండ్రులు"

"నేను చాలా దురదృష్టవంతురాలిని." పదేళ్ళప్పుడే తల్లి పోయింది.

తరువాత నాన్నగారు యుద్ధంలో పోయారు. ఇంక మిగిలింది నాకు తాతయ్యా తాతయ్యకి నేనూ! మా తాతయ్య కూడా మిలటరీలోనే పని చేసి రిటైరైయ్యారు.

సరిత కంఠం జీరబోయింది. మురళికి జాలికల్గింది.

"సారీ! తెలియక మీకు బాధ కల్గించే విషయం అడిగాను."

"మరేం ఫర్వాలేదు." ముఖం ఓసారి తుడుచుకుంటూ—

"ఈ ప్రపంచంలో తల్లిదండ్రులు లేని వాళ్ళంత దురదృష్టవంతులు మరెవ్వరూ వుండరు." ఇంకా సరిత గొంతులో వ్యధ ధ్వనిస్తూనే వుంది.

'టీ' మీరే తయారు చేశారా! చాలా బాగుంది" మాట మార్చేస్తూ అన్నాడు మురళి.

"థాంక్స్! మా తాతయ్య ఫ్రెండ్స్ దాదాపు అందరూ రిటైరైన వాళ్ళే....

వాళ్ళందరూ లప్పుడప్పుడూ నే చేసిన 'టీ' కావాలంటూ వస్తూంటారు.

ఇలా పిచ్చి లబ్బ యెంత చిన్న పిల్లల్లా లల్లరి చేస్తా రనుకున్నారూ! బలే సరదాగా గడిచిపోతుంది టైము. ఆదివారం మీరు టీకి రండి. మా తాతగారే ప్రత్యేకంగా మిమ్మల్ని పిలవా లనుకుంటున్నారు.

నేనే పిలుస్తున్నాను. మా తాతయ్యనీ ఆయన స్నేహితు లనీ పరిచయం చేస్తాను. వస్తారు కదూ ! మర్చి పోకూడదు"

అంతే మళ్ళీ ఇద్దరికీ మాటలు కరువైనాయి. మురళి సినిమా విషయాలు యెత్తేసరికి మరో గంట కబుర్లతో గడిచి పోయింది.

"ఇంక నే వస్తాను" అంటూ చెప్పి ఇంటికి వచ్చేశాడు మురళి.

వరండాలో మంచం మీద పడుకుని పిలక తాతయ్య 'గుర్రు' పెట్టి నిద్రపోతూన్నాడు. ఆయన్ని చూడగానే ప్రొద్దున నాటిన మామిడీ, పనసా, కరివేపా చెట్లు గుర్తు కొచ్చినాయి.

పిచ్చి తాతయ్య అనుకుంటూ వరండా చివరికి వచ్చి వాటిని చూస్తూ నిల్చున్నాడు మురళి.

చల్లగా వీచేగాలికి అవి మెల్లగా తలలు వూపుతూన్నట్లు కన్పించాయి.

మసక వెన్నెలలో క్షణం వాటిని అలా నిల్చుని చూసి లోపలికి వెళ్ళాడు.

# 21

"నీరజ యింటికి 'టీ' కి వెళ్ళటం సంగతి మర్చి పోతా నేమో అని ఆదివారం ప్రొద్దుటి నించీ క్షణం క్షణం గుర్తు చేసు కుంటూన్నాడు మురళి.

ఈ రోజు గోడ గడియారంలో ముళ్ళు తిరుగుతూన్నట్లే లేవు.

"అబ్బా ఇంకా పన్నెండు గంటలేనా!" అనుకుంటూ ఇంగ్లీషు నవల ఒకటి పట్టుకుని చదవటానికి ప్రయత్నిస్తూన్నాడే కానీ తలకెక్కటం లేదు.

లోపల వంట గది ముందున్న వసారాలో పిలకతాతయ్యే కూర్చుని తల్లితో కబుర్లు చెప్పటం విన్పిస్తోంది. ఆ కబుర్లలో తనపేరు తరుచుగా విన్పించటంతో చదువు మానేసి ఆ మాటలు వింటూన్నాడు మురళి.

"అమ్మా! అన్నపూర్ణ తల్లీ! ఈ రెండుపోస్టల్ సేవింగ్స్ బ్యాంక్ పుస్తకాలు నీ దగ్గర దాచి అనూకీ, మురళికీ పెళ్ళిజరిగే ప్పుడు యిద్దరికీ చెరొకటీ చదివించాలమ్మా వాళ్ళిద్దరూ నాకు సమానమే ...

అందుకే చెరి అయిదు వందలూ వేశాను. అసలు వాళ్ళ పెళ్ళికి నే బ్రతికి వుంటే యెక్కడున్నా రెక్కలు కట్టుకు వాలతాను.

ఒకవేళ వాళ్ళ పెళ్ళిళ్ళు నే చూసే ప్రాప్తం లేకుంటే నీవే యీ పుస్తకాలు యివ్వు. చూడమ్మా ఈ పుస్తకాల విషయం ఇప్పుడు వాళ్ళకి చెప్పవద్దు.

యెందుకంటే నా ఈ పనికి నవ్వి గేలిచేస్తారేమో అని. ఆ....ఇంక ఇంటికి మరి వెడతాను తల్లీ. మళ్ళీ నీ చేతి అన్నం ప్రాప్తం వుంటే వస్తాను. లేకుంటే చెప్పలేను.

వంట్లో ఓపిక పోయిందమ్మా. అందుకే కోర్టుల చుట్టూ ఇంక తిరిగే పస్లు పెట్టుకోవటంలేదు. ఈ పనులు లేకుంటే ఈ బస్తీకి రావలిసిన అవసరమూ వుండదు.

మళ్ళీ పదిహేను రోజుల్లో ఓ చిన్న పని వుంది. అంతే మళ్ళీ పని వుండదు."

అంటూ అన్నపూర్ణమ్మ యెంత వద్దని చెప్పినా వినక ఆమె చేతిలో పెట్టి "తల్లీ వస్తానమ్మా! యిదిగో మురళికి ట్రైనింగ్ ఆర్డర్స్ వస్తే మాత్రం నాకో కాయితముక్క రాయించటం మర్చిపోకమ్మా. నే ప్రతిరోజూ ఆభగవంతుడిని కోరేది మురళి కలెక్టరు కావాలనీ నా మనవడు ఆ కలెక్టరు కుర్చీలో కూర్చుంటే ఒక్కసారి చూడాలనీ.

యెందుకమ్మా అంతలా నవ్వుతావు. "అంటూ తనూ ఆవిడ నవ్వులో శృతి కల్పాడు పిలకతాతయ్య.

పీనాసి పిలకతాతయ్యలో ఇన్ని మంచి వుద్దేశాలు వున్నాయా!

అసలా తరం వ్యక్తులూ వాళ్ళ ఉద్దేశ్యాలూ అదోరకంగా వుంటాయి. అనవసరంగా ఒక్కపైస ఖర్చు చెయ్యరు.

అదే అవసరం అనుకుంటే పందలూ వేలూ అయినా ఖర్చు చేయటానికి వెనకాడరు. అతి సాదా జీవితం నీరుకావి పంచె, చిరుగుల షర్టు చెప్పులు వేసుకున్నా ఎక్కడ తిరగటానికీ అభిమాన పడని ఈ పెద్ద తాతయ్యలో మాత్రిగా ఆలోచనగానీ అవతల వ్యక్తుల ఇబ్బందులు అర్థం చేసుకునే శక్తిగానీ వుందను కోలేదు. అందుకే ఆశ్చర్యపోతున్నాడు.

"మురళీ! ఇక్కడే వున్నావా! నిద్రపోతున్నావను కున్నారా! సరే నేనింక వెళ్ళి వస్తా నాయనా! ఆ.... అన్నట్టు నాకో ఉత్తరముక్క రాయటం మరవకు. నీ కడి రావాలని మా యిలవేల్పు జంబునాథుడికి సోమవారం అభిషేకం చేయిస్తాను" అంటూ గోనెసంచీ లాంటి బట్టల సంచీ చంకన పెట్టుకుని 'వెళ్ళొస్తా' అంటూ మెల్లగా వరండా మెట్లు దిగుతూన్న ఆయన్ని చూస్తూంటే మురళికి జాలీ ప్రేమా ముంచుకొచ్చాయి.

వెంటనే బట్టలు మార్చుకుని స్కూటర్ తీసుకుని స్పీడుగా వెళ్ళి ఆయన ప్రక్కగా ఆగే సరికి తాతయ్య భయపడిపోయి సంచీ పట్టుకుని రోడ్డు చివరికి పరుగెత్తి ఏన మీద పడబోయిన ఆ దుర్మార్గుడెవరా అని వెనక్కి తిరిగాడు.

మురళి నవ్వుతూ "తాతయ్యా నేనురా. స్కూటర్ మీద ఎక్కు బస్ స్టాండ్‌లో దింపేస్తా" అని ఆయన చేతిలోని సంచీ తీసుకో

పోతుంటే అయ్యబాబోయ్....స్కూటర్ నే యెక్కటమే....వద్దురా బాబూ! కళ్ళు తిరుగుతాయి.

"మెల్లగా నడుస్తారే" అన్నాడు సంచీ వదలకుండా!

"యేం ఫర్వాలేదు....నీ ప్రాణానికి నా ప్రాణం అడ్డం"

"బాబోయ్. అసలు స్కూటరంటేనే నాకు భయం. యే పక్కకి వంగిపోతుందో అని. అందులో నువ్వు తోలటం. బాబూ పట్టు. అలా ఉలా మబ్బుల్లో తేలిపోతావు వాయువేగ మనో వేగంతో."

"లేదులే. మెల్లగా తోలతాగా! వాదు నడుపుతాగా" అంటూ నవ్వేశాడు.

"ఇదిగో పంపెద్దు బండీలా పోవాలి."

"అలాగే...." అంటూ ఆయన చేతిలోని గోనె సంచీ తీసుకుని స్కూటర్ ముందు పెట్టి ఆయన్ని వెనక యెక్కమన్నాడు. అయిదు నిమిషాలు అవస్తపడి యెలాగో స్కూటర్ ఎక్కి కూర్చున్నాడు పిలకి తాతయ్య.

మురళి భుజాలు పట్టుకుని కూర్చున్నాడు.

తమరిద్దరినీ రోడుమీద పోయే అమ్మాయిలు క్షణం నిల్చి మరీ చూసి ముసి ముసి నవ్వులు నవ్వుకుంటూన్నది చూస్తూనే ఉన్నాడు మురళి.

అయినా ఈరోజు యెందుకో కోపం రావటంలేదు.

పిలక తాతయ్య మాత్రం మురళి ఇలా స్కూటర్ మీద బస్ దగ్గర దింపుతానని రావటం వల్ల మహదానంద పడిపో తూన్నాడు. ఇంతలో స్టాండ్ రానే వచ్చింది. విశ్వ ప్రయ త్నంతో యెలాగో స్కూటర్ దిగాడు. బస్ రెడీగా ఉంది.

యెక్కి కూర్చుని కూడా మురళికి శుభం కలగాలని ఆశీస్సులు వేలూ లక్షలూ క్రుమ్మరిస్తూన్నాడు.

"నాయనా! త్వరగా కలెక్టరు కావాలి. అందమైన బుద్ధి మంతురాలైన పిల్లని పెళ్ళాడాలి.

మీ అమ్మలా ఇంటి పేరు నిలబెట్టాలి. చూడూ ఆ కాపు దమ్మి త్రాచుపాము లాంటిది. ఓ కంట కనిపెట్టాలి సుమా!

సమయం చూసి కాటేస్తుందిరా నాయనా జాగ్రత్తగా మసులుకో. ఆవిడ ఈ మధ్య నీ మీద యెన్నో ప్రచారాలు లేవ నెత్తుతోంది"

అంటూండగానే—

"ఏమని?" అన్నాడు కోపంగా—

"ఏమో నాయనా!" లేని పోనివి అంటుందని నాకు తెల్సు కానీ లోకానికి తెలియవుగా ఈ మధ్యన నీకు పిల్లనిస్తాం అంటూ రెండు మూడు సంబంధాలు మీ యింటి వరకూ రాబోయి ఆగి పోయాయి.

అని ఆయన ఇంకా ఏదో చెప్పబోతుండగానే బస్ కదిలి

పోయింది. ఆయన కన్పించేవరకూ చెయ్యి బైటకి వూపుతూనే ఉన్నాడు.

పిలక తాతయ్య మాటల్లో ఏదో రహస్యమున్నట్లో ఆలోచనలు ముసురు తిరుగుతూన్నాయి. 'ఎప్పుడమ్మ సన్మానం చేయగలను' అనుకుంటూ ఇంటికి వచ్చేశాడు కాస్సేపు పడుకున్నాడు. లేచి ముఖం కడుక్కున్నాడు.

నాలుగుసార్లు ప్యాంట్లూ షర్టూ మార్చి మార్చి వేసుకుని అద్దంలో చూసుకున్నాడు.

'ఈ డ్రెస్ బాగుంది' అనుకుని తృప్తిపడి గడియారం వైపు చూశాడు.

ఇంకా నాలుగు గంటలే. ఛీ. అనుకుని 'పేపరు' తిరగేసి స్కూటరు తీసుకుని బయలుదేరాడు. సరిగ్గా నీరజ ఇంటి మలుపు దగ్గర ఆగి చేతి వాచ్ చూసుకుంటే ఇంకా నాలుగున్నర కూడా కాలేదు.

నీరజ రమ్మని చెప్పింది అయిదు గంటలకి కదూ! ఇంత ముందుగా వెళ్ళటం ఏం బాగుంటుంది.

అనుకుని వెనక్కి తిరిగి అలా మరో రోడ్డు వెంట తిరిగి తిరిగి అయిదింటికి వెనక్కి తిరిగి నీరజ ఇల్లు చేరాడు.

వాకిట్లో నౌకరు లేడు. స్కూటర్ దిగి గేటు తీసుకుని లోపలికి వెడుతూంటే ఏదోలావుంది.

నీరజ తాతయ్య యెలాంటివాడో! యెలా మాట్లాడు

తాదో! సీరజ 'టీ' కి పిల్చినా యీరోజు రావటంటే బాగుండే దేమో!

ప్రొద్దుటి నించీ ఈ ఆలోచన రానందుకు తన మీద తనకే విసుగొచ్చింది. లోపలినించి యెవరెవరివో కొత్త గొంతు కలు వినిపిస్తూంటే అక్కడే ఆగిపోయాడు.

"నీరూ! గరం గరం కారప్పూస ముందు. ఆపైనచాయ్. ఇంతకీ నీ అతిధి దేవుడు జాడ కన్పించటంలేదు."

"నీరజా! అసలు అతనికి 'చెస్' ఆడటం వచ్చో, రాదో ముందు అడిగావా తల్లీ"

"ఏం! యెందుకు నా మీద కోపం వచ్చినప్పుడల్లా మీఇల్లు నెత్తుకుంటూ వెళ్ళి అక్కడ ఎత్తులు వేద్దామనా! అరేయ్ ఆ పప్పులు పుడకవు."

"వుండు మధ్య నీ ఇష్టం యేమిటి! చెప్పమ్మా నీరజా!"

"నీరజ కేం తెల్సు. నే చెప్తావిను. అతను కాబోయే కలెక్టరు. ఇంకెన్నాళ్ళో వుండడిక్కడ. నువ్వెంత బెదిరిద్దామన్నా సాగదు. మనిద్దరికీ కాలక్షేపం కోసం ఈ 'చెస్' గేమ్ తప్పదు తెల్సునా!"

"ఏమిటీ! అప్పుడే అతని వివరాలన్నీ సేకరించేశావా చలపతీ"

"ఆడపిల్ల తాతగార్ని కళ్ళుమూసుకు కూర్చుంటే యెలా! అతను లాయరు నారాయణరావుగారి యేకైక పుత్రుడు శ్రీ మురళీధర్ యం. ఎ ...."

"ఇక నే చెప్తాలే! యల్. యల్. బీ సరేనా! మెరికె లాంటి కుర్రాడు ఔనా!"

"నీ కెలా తెల్సూ,"

"నీ ముఖం చూస్తే తెలియటంలా! ఇంతకీ అతను రానే లేదు ...తల్లీ నీరజా! ఆకలై పోతోందమ్మా"

"అమ్మా నీరజా నీ అతిథిదేవుడి అనుగ్రహం ఇంకా కల్గ లేదు. నౌకర్ని అలా వెళ్ళి చూసి రమ్మను వస్తున్నాడో లేదో"

"అబ్బబ్బా! ఇప్పుడేగా తాతయ్యా అయిదు అయింది, వస్తూంటారు....

"అరుగో వచ్చేశారు తాతయ్యా" అంటూ వరండాలోకి యెదురు వచ్చింది నీరజ. డిశంబర్ పువ్వుకలర్ వెంకటగిరి జరీచీరె అదే కలర్ జాకెట్టు వేసుకుని మెడలో ఒంటిపేట చైను వేసుకుంది. జడకి రిబ్బన్ వెయ్యకుండా సగం జడ అల్లి వదిలేసింది.

చెవులకి చిన్న ముత్యాల లోలకులు తలలో రెండాకు లున్న గులాబీ తుమ్ముకుంటూ వరండాలోనే ఆగిపోయిన మురళిని చూసి యెదురు వచ్చి—

"అలా నిలబడిపోయారేం. రండి. మీ కోసమే మా తాతయ్యా వాళ్ళు యెదురు చూస్తున్నారు."

అంటూంటే ఆ అమ్మాయి కళ్ళలో ఒక విధమైన తృప్తి సంతోషం అర్థమైపోయింది మురళికి.

మర్చిపోయాను 'నమస్తే' అంది నవ్వుతూ.

'నమస్కారం' అంటూ లోపలికి వచ్చాడు మురళి.

"ఈయన మా తాతయ్యగారు పేరు చలపతిరావుగారు"

"నమస్కారం" అనగానే చలపతిరావుగారు మురళిని పరీక్షగా చూస్తున్నారు. ఆయనగాక మరో ఇద్దరు వయస్సు మళ్ళిన వారే ఉన్నారు.

ఈయన తాతగారి ఫ్రెండ్ భుజంగరావుగారు. రైల్వేలో పనిచేసి రిటైరై పోయారు.

ఈయన దాసుగారు. లాయరుగారు. నీరజ పరిచయం చేసింది.

ఆ ఇద్దరికీ నమస్కారం చేశాడు మురళి. దాసుగారు లావుగా పొట్టిగా తెల్లగా ఉన్నారు. దాసుగారు సన్నగా పొడుగ్గా గడకర్రలావున్నా మాట్లాడుతూనే నశ్యం పట్టు బడుతూ కాస్త హాస్యం ఒలకబోస్తూ తన విట్టుకి తనే నవ్వేస్తూ చిన్నపిల్లాడిలా కబుర్లు చెప్తూన్నారు.

నమస్కారాలు పూర్తి అయినాయి. అయినా నీరజ తాత గారు మురళిని అలా చూస్తున్నారు కానీ కూర్చోమని చెప్పలేదు.

నీరజా, దాసుగారూ, భుజంగరావుగారూ తెల్లబోయి చూశారు. ఆయన వైపూ మురళీధర్ వైపూ, చలపతిరావుగారు మురళి ముఖంలోకి చూస్తూ—

"మీ నాన్నపేరు నారాయణరావు కౌనా!"

"ఔను."

"మరి....మరి....నీలో దశరథ పోలికలున్నాయేంటి!"

"ఆయన మా చినతాతగారు. మీరెరుగున్నారా!"

"ఆ...." అంటూ అమాంతం వచ్చి మురళిని గట్టిగా వాటేసుకున్నారు. పొదివి పట్టుకుని తీసుకొచ్చి సోఫాలో కూర్చోబెట్టుకుని....

"అమ్మా సీతూ! నువ్వు పరిచయం చేస్తానన్నావుకదూ ఇతన్ని. రా చెప్తా. నేనే నీకు పరిచయం చేస్తా.... ఇతని తాతగారు దశరథ నేనూ ప్రాణ స్నేహితులం. అతను సరీగ్గా ఇదే వయస్సులో అచ్చంగా ఇలాగే వుండే వాడమ్మా! తల్లీ త్వరగా టిఫెను పట్టుకురా! బోలెడన్ని కబుర్లు చెప్తాను."

"అబ్బ! చంపేశావు గదరా నాయనా" దాసుగారు నశ్యం పట్టుపట్టి ముక్కు ఎగబీలుస్తూ అన్నారు.

"ఇతన్ని కూర్చో అనకుండా అలా కళ్ళు పెట్టుకుని చూస్తూంటే నాకు వణుకు వచ్చింది. అమ్మా! మురళీ ధర్ మన చలపతిరావుకి ప్రాణ స్నేహితుడే అన్నమాట అన్నీ సరేగానీ మురళీధరే. నీకు చెస్ ఆడటం వచ్చా! రాదా!"

"కొంచెంగా వచ్చు."

"ఆ... ఆ....చాలు చాలు" సంతోషంతో అన్నారు.

"ఇదిగో మురళీధర్! ఈ దాసుగాడు రిటైరై కొడుకులు సంపాదిస్తూంటే నవాబులా తింటూ కాలక్షేపానికి 'చెస్' అంటూ నా దగ్గర కొచ్చి అమూల్యమైన కాలాన్ని హరించేస్తూ ఉంటాడు.

యింక యితను భుజంగం అని మా నీరూ తల్లి చెప్పిందిగా....

లాయరేగానీ ప్లైలు లేదు. అందుకే మా ముగ్గురికీ ప్రాణ స్నేహం.

ఇంక నా గురించి కూడా చెప్పుకోవాలిగా. నేను నీరూ తాతయ్యని....

అస్తమానం నీరూ తాతయ్యా అని పిలుస్తుంటంతో ఈ పెద్దవాళ్ళందరూ కూడా నన్ను 'తాతయ్యా' అనే పిలవటం అలవాటు చేసుకున్నారు.

దీంతో నా అసలు పేరేంటో నేనే మర్చిపోయాను. నీరూ తల్లీ నా పేరేంటమ్మా చెలపతిరావుగారి మాటలతో ఆ హాలు అంతా నవ్వులతో ప్రతిధ్వనించింది.

నీరజ లోపలికి వెళ్ళి జీడిపప్పు పకోడీలూ గులాబ్ జామూ ప్లేట్లలో పెట్టి తెచ్చి ఇచ్చింది. ఆ ప్లేటు అందుకుంటూన్న భుజంగరావు "హాసీ మురళీధర్! నువ్వా. యీయన్ని తాతయ్యా అని పిలుస్తే పోలా"

ఏదేం అనుకోకు బాబూ నువ్వు అని ఏకవచనం ఉపయోగించినందుకు....

"ఏదేం ఫర్లేదండీ" యెంతో వినయంగా అంటూ నీరజ అందిస్తున్న ప్లేటు అందుకున్నాడు.

"అరేయ్ తాతయ్యా! ఇవి హోటలు సరుకు కాదుగా.

నీరూతల్లీ యీ టిఫిన్లు చేయటం యెప్పుడు నేర్చుకున్నావమ్మా"

"నీకు తెలియదూ ఇన్నాళ్ళ నుంచీ వంటలో నీరూకి గురుపు తాతయ్యే"

భుజంగరావసటంలో మురళి ఆశ్చర్యంగా ముఖం పెట్టాడు.

"నిజమే"

"వూ! మనం అపర నలభీములం. కొడుకూ కోడలూ అలా హఠాత్తుగా యాక్సిడెంటులో పోవటం. తర్వాత నేను రిటైరై ఈ చిన్నారి బాలని పెంచి పెద్దచేస్తూ ఇంట్లో వుండి పోవల్సి రావటం అలవాటులేక అస్తమానం ఇంట్లో వుంటే బోర్ కొట్టి అప్పుడు చేసిన ప్రయోగాలే ఈ వంటలూ పిండివంటలూనూ ...

అవి అలా అలా అలవాటై హాబీలై కూర్చున్నాయి. ఇల్లు నీటుగా అలంకరించుకోవటం కొత్త కొత్త రకాల టిఫిన్లు చేసి క్లబ్బు ఫ్రెండ్స్‌ని పిల్చి వాళ్ళేపిలా సరదాగా తింటూ—

కాలక్షేపం కబుర్లు చెప్పుకుంటూ సరదాగా రోజులు దొర్లించేయటం....

ఇదీ నా చరిత్ర. మురళిబాబూ! యిప్పుడు చెప్పు నా హాబీలెలా వున్నాయి. "అలా అన్నప్పుడాయన కళ్ళలో కదిలిన నీటి పొరని గుర్తించిన మురళి.

"చాలా గమ్మత్తుగా వున్నాయి." అన్నాడు.

"నే చెప్పనా! ఒక వైపు ఒంటరితనం భార్యపోవటం ఆ గాయం మానకుండానే కొడుకునీ కోడలినీ మృత్యువు పొట్టన పెట్టుకోవటం యింక మిగిలిన నీరూని కనురెప్పలో పెట్టుకుని పెంచి పెద చేశాడీ తాతయ్య....

క్లబ్బు కొచ్చిన అర్ధగంట కూడా ఆదమర్చి కూర్చునే వాడేకాడు.

నీరూ యేమైపోతుందో అని భయమే. ఆడవాళ్ళ పెంప కంలో పెరగని పిల్లలో యే అవలక్షణమైనా వస్తుందేమో అని భయం. అందుకే ఒక విధంగా సగం ఆడతనం తెచ్చిపెట్టు కున్నాడీ చెలపతి నే చెప్పేది అబద్ధమా తాతయ్యా చెప్పు" భుజంగరావు టిఫిను తింటూనే అన్నాడు.

తాతయ్య జవాబేం చెప్ప లేదు కానీ పది సంవత్సరాలుగా తనుపడ్డ కష్టం నెమరు వేసుకుంటూన్నట్లు కన్పిస్తోంది ఆయన ముఖం.

పెద్ద గళ్ళలుంగీ గోధుమ రంగు శిల్కులాల్చీ భుజం మీద టర్కీటవలూ తెల్లగా నెరిసినతలా అరవై పైబడ్డా అంత వయస్సున్నట్లు కన్పించకుండా సరదాగా కబుర్లు చెప్తూ వుంటాడు అనుకున్నాడు మురళి.

తన తాతయ్య జీవితమే ఓ పెద్ద 'ట్రాజెడీ' అనుకున్నా డిన్నాళ్ళుగా. కానీ చలపతిరావుగార్ని చూస్తే అంతకంటే మరీ జాలి వేస్తోంది.

మురళిబాబూ! మరో విషయం చెప్పనా! ఈ తాతయ్యే యిలా టిఫిన్‌లు చేసి ఫ్రెండ్స్‌ని పిలుస్తూ తెగమేపేసేవాడు.

వాళ్ళింక ఇదేసాకుగా వచ్చి అదే పనిగా తింటూ "చలపతిరావు గారూ మీ పంటలు అద్భుతంగా వున్నాయి.

అమృతం పోసి పండారా! ఏం ఫార్మలు యూఫైడ్ యేళ్ళ బట్టి పంటగమల్లో తిరుగుతున్నా ప్రెష్మా చేయటం చేతకాదు. మీరు చేసిన టిఫిను యెంత తిన్నా ఇంకా ఇంకా తినాలనేవుంది. నిజం చెప్పమంటారా. ఆదివారం తిరిగి యెప్పుడొస్తుందా అని యెదురు చూడలేక చస్తున్నాం.

చిన్న రిక్వెష్టు. ఆదివారం టీ వారానికి ఒక్కసారి కాక రెండుసార్లు ఇలా అరేంజ్ చెయ్యకూడదూ" అని వుబ్బేశారా తిండిపోతురాయుళ్ళు....

అదంతా నిజమని నమ్మేసి ఈ తాతయ్య 'ఓ అలాగే' అనేసి డబ్బుకీ శ్రమకీ, లెక్క చెయ్యకుండా యేర్పాట్లు చేస్తూనే వుండేవారు.

నిజం చెప్పాలంటే నాకు ఒళ్ళు మండిపోయేది అప్పుడు. యిలా యెన్ని సంవత్సరాలు ఈ యింట్లో తిన్నాగానీ, ఓ పండగకిగానీ పార్టీలంటూగానీ, ఈ తాతనిగాని ఆ ముసలావిడనిగానీ ఒక్కసారన్నా వాళ్ళింటికి పిల్చిన పాపాన పోలేదు.

అందుకే నీటూ పెద్దదైంతర్వాత అసలు సంగతి అర్థం చేసుకుని వాళ్ళందరిని వెళ్ళగొట్టేసింది.

ఈ తాతయ్య కంటే నీటూ తెలివైంది. యెదటి వ్యక్తి యెలాంటి వాడో క్షణంలో పసి కట్టేస్తుంది.

వాళ్ళ ముఖాలు చూసి మనస్సులు చదివేస్తుంది. ఏం తాతయ్యా నే చెప్పింది నిజమా కాదా"

భుజంగరావు మాటలు ఆపి ఊపిరి పీల్చుకున్నాడు.

మురళి ఇదంతా వింటూనే టిఫిను తింటూ 'నిజంగానే' అన్నట్లు చూశాడు సిరజ ముఖంలోకి.

నీరజ ముఖం మరోవైపుకి తిప్పుకుంది.

ఇలా కబుర్లతో టిఫినూ 'టీ' అయింది. ఇంక చదరంగం పర్చారు.

ఒక్కగేమ ఆడేసరికే చాలా టైము అయిపోయింది.

నీరజ తాతగారూ మురళీ ఆట ఆడుతూంటే ప్రక్కనే కూర్చుని చూసోంది.

మురళి చేతి వాచ్ చూసుకుని "అరె! ఎనిమిదిన్నర వాలా టైమ్ అయింది" అనుకుంటూ ఆట ఆపేసి లేచాడు.

"కొంచెంగా వచ్చు! అంటూ నా ఆట కట్టించేశావు కదా మురళీ! అయితే నువ్వు తరచుగా ఇక్కడికి రాక తప్పదు.

మనం ఈ చదరంగం పరుపకా తప్పదు. మర్చాను_ నీరూ కూడా బాగానే ఆడుతుంది.

అప్పుడప్పుడూ వస్తూండు" అంటూ వాకిట్లో వరకూ వచ్చారు చలపతిరావుగారు.

"ఏదీ మీ తాలయ్య అడ్రెసు. ఉత్తరం రాయవల్సిన అవసరం చాలా రోజులకి కలిగింది" అంటూ అడ్రెస్ తీసుకున్నారు. నీరజ గేటువరకూ వచ్చి "నమస్తే" అంది.

"గుడ్‌నైట్" అంటూ మురళి స్కూటర్ స్టార్టు చేశాడు. నీరజ లోపలికి వెళ్ళిపోయింది. మురళి ఇంటివైపు వస్తున్నాడు. చల్లటిగాలి వీస్తోంది.

మురళి మనస్సు అలా అలా ఏవో లోకాల్లోకి తేలిపోతోంది.

ఇల్లు దగ్గరౌతోంది. ఏవేవో మధురమైన ఊహలు చెలరేగుతున్నాయి.

'ఈరోజు నా కెందుకిలా ఉంది' తనని తనే ప్రశ్నించుకున్నాడు. జవాబు రాలేదు.

# 22

దశరథరామయ్యగారు పల్లెలో యశోదకి పత్యం పెట్టి నాలుగురోజుల తర్వాత కొడుకు దగ్గరకి వచ్చారు.

తాతగారు రాగానే చలపతిరావుగారితోనూ, ఆయనమనుమరాలు నీరజతోనూ ఎలా పరిచయం అయిందీ చెప్పేశాడు మురళి. అంతావిన్న దశరథరామయ్యగారు మురళి ముఖంలోకి తదేకంగా చూస్తూ కూర్చుని—

"వూ!" అన్నారు గంభీరంగా....

"తాతయ్యా! ఆయన మీకు ఉత్తరం రాస్తానని అడ్రెసు తీసుకున్నాడు రాశాడా!"

"వూ!"

"ఏమని రాశాడూ?"

"వూ!"

"అబ్బ....ఏంటా జవాబులు. అన్నిటికీనూ" విసుగ్గా ముఖం పెట్టాడు మురళి.

"లేకుంటే గంతులెయ్యమన్నావా నీకుమల్లే"

"ఏంటీ! నే గంతులేస్తున్నానా?"

"నువ్వు కాదురా— నీ మనస్సు!"

"నా మనస్సా?"

"వూ...."

"అబ్బబ్బ....ఈ పెద్దవాళ్ళు మాట్లాడే మాటలకి అర్థం ఉండదు" అనుకుంటూ చికాగ్గా అక్కడి నించి వెళ్ళిపోయాడు మురళి. అసలు మురళి ఉద్దేశం తాతగారిని తనవెంట ఈ రోజే నీరజా వాళ్ళింటికి తీసుకు వెళ్ళాలని....

కానీ అందుకు ఏ రాస్తా కూడా అవకాశం ఇవ్వకుండా తాతగారు....

ఏవేవో అంటూంటే చికాకే వేసింది. అందుకే లేచి గదిలోకి వచ్చేశాడు. మరో గంటవరకూ ఆ గదిలోనించి బయటకి వెళ్ళలేదు.

కాని వాకిట్లో 'టాక్సీ' ఆగిన శబ్దానికి అనూరాధ యెవరబ్బా అని తొంగిచూసింది. మురళీ బయటకి వచ్చాడు.

చలపతిరావుగారు నీరజ భుజంమీద చెయ్యివేసి నడుస్తూ లోపలికి వస్తూంటే ఆశ్చర్యంగా చూస్తున్నాడు మురళి.

దశరథరామయ్యగారు గబగబా ఎదురు వెళ్లారు. మిత్రులిద్దరూ గట్టిగా కౌగిలించుకున్నారు.

నీరజ సిగ్గుపడిపోయూ నిల్చుంది. చలపతిరావుగారి భుజం మీదనించి నీరజని రెండుక్షణాలు నిశితంగా పరీక్షించి....

"ఏమ్మా నేనెవరో తెలుసునా! రండి లోపలికి అంటూండగానే నీరజ....

"నమస్కారం" అంది.

"ఆ....నమస్కారం ...రారా చలపతీ ఎన్నిసంవత్సరాల తర్వాత చూసుకున్నాం" అంటూ లోపలికి తీసుకొచ్చారు. "అనూ మరో కుర్చీ తీసుకురా...."

మురళి చప్పున గదిలోకి వెళ్ళి షర్టువేసుకుని తల దువ్వుకుంటానికి అద్దంలోకి చూసుకున్నాడు ముఖాన్ని. ముఖం అంతా జిడ్డుగా అన్పిస్తే టపల్‌తో ఓసారి గట్టిగా తుడుచుకుని తాతయ్య నన్ను పిలవడేం....

పిలవకపోయినా అక్కడికి వెడితే వాళ్ళు ఏమైనా అనుకుంటే—ఏం అనుకోరు కొత్తవాళ్ళు కాదుగా — ఇంట్లో ఉండే ఇంతసేపు బయటికి రాలేదు అనుకోదూ నీరజ ...

తాతయ్యకి నేను వీళ్ళని పరిచయం చేద్దాం అనుకుంటే తాతయ్యే నాకు పరిచయం చేస్తాడులా ఉంది అని ఆలోచిస్తున్నాడు.

చలపతిరావుగారి ప్రక్కన అనూరాధ కూర్చుంది. దశరథరామయ్యగారు నీరజని తన ప్రక్కనున్న కుర్చీలో కూర్చోమని "ఏం చదువుతున్నావమ్మా" అని అడిగారు.

"ఏయ్ దశరథ్ నేను అన్ని విషయాలూ ఉత్తరంలో రాశానుగా! అయినా మళ్ళీ అడుగుతున్నావా!" చలపతిరావు చిరుకోపంతో అన్నారు. దశరథరామయ్య నవ్వి "మాట్లాడితే కూడా అరిగిపోతుందా" అని మనవరాలివేపు చూసి అరెరె.... అరె....వీళ్ళని పరిచయం చెయ్యటం మర్చిపోయానమ్మా. ఈ చలపతి నా బాల్య స్నేహితుడు. కొన్నాళ్ళు బస్తీలో కలిసి చదువుకున్నాం కూడా. ఈ అమ్మాయి వీడి మనవరాలు నీరజ. బి. ఎ. అయిపోయిందట. అన్నట్లు మురళిని పిలువమ్మా, మీ అమ్మను కూడా ఇలా రమ్మను" అన్నారు. అలాగే అనూరాధని వాళ్ళిద్దరికీ పరిచయం చేసి "మురళీ ఏం చేస్తున్నావురా" బిగ్గరగా కేక పెట్టారు.

నీరజా, అనూరాధా ఒకర్ని ఒకరు చూసుకుంటూ కూర్చున్నారు. ఏం మాట్లాడాలో ఏమని మాట్లాడాలో తెలియక అన్నపూర్ణమ్మ పాతుర్ని పిలిచి మంచినీళ్ళు కావాలేమో కనుక్కోమని. తను కట్టుకున్న చీరవేపు ఒకసారి చూసుకుని ఫర్వాలేదులే అనుకుని అద్దంలో చూసుకుని, చెదిరిన కుంకుమ సరిచేసుకోబోయి అంతలోనే మనసు మార్చుకుని ముఖం కడుక్కునేందుకు బాత్‌రూములో కెళ్ళింది.

దశరథరామయ్యగారూ చలపతిరావుగారూ కబుర్లలో పడి పోయారు. మురళి వచ్చి చలపతిరావుగార్కి నమస్కరించి కూర్చున్నాడు

మురళిని పలకరింపు ప్రశ్నలు వేసి మళ్ళీ కబుర్లలో పడ్డారు స్నేహితులిద్దరూ. అనూరాధా, నీరజా ఉండి ఉండి ఒక్కో మాట మాట్లాడి మళ్ళీ ఏం మాట్లాడాలో తెలియక ఆగిపోతున్నారు. మురళి దిక్కులుచూస్తూకూర్చున్నాడు. నీరజ అనూతో మాట్లాడు తూనే ఉన్నా మురళిని గమనిస్తూనే ఉంది.

అన్నపూర్ణమ్మ టిఫినూ కాఫీ పంపింది అనూరాధ చేత. పకోడీ ప్లేటు అందుకుంటూ చలపతిరావుగారు "అరే దశరథ్ మానీరూతల్లి వంటలూ పిండివంటలూ, బ్రహ్మాండంగా చేస్తుంది. 'టెస్ట్ చేయాలనుకుంటే ఆదివారం నీ మనవడినీ మనవరాలినీ తీసుకుని మా ఇంటికిరా"అంటూ ఆహ్వానించారు చలపతిరావుగారు.

"ఏమ్మా నీరజా వీడు చెప్పేదంతా నిజమేనా! నమ్మ మంటావా?"

"నీరజ చిరునవ్వు నవ్వింది. ఆయన అనూరాధ వైపు తిరిగి "మాశావా అనూ! నేను నీకెన్నిసార్లు చెప్పాను. ఆడ పిల్లకి చదువూ, అల్లికలూ కుట్లుతోబాటు వంటలూ, పిండి వంటలూ కూడా తెలియటం ముఖ్యం అని నువ్వు విన్నావా! ఈ నీరజకి అవన్నీ వచ్చునట. మరి నీవెప్పుడు నేర్చుకోవటం మొదలు పెడతావు."

"రేపటినించే మొదలుపెడతాను తాతయ్యా!" అంటూంటే చలపతిరావుగారు, నీరజా నవ్వారు. మురళికి చెల్లెలిమీద కోపం ముంచుకొచ్చింది. దాని మింగేసి కూర్చున్నాడు.

అన్నపూర్ణమ్మ కూడా వచ్చి వాళ్ళని పల్కరించింది. ఇలా ఎన్నో కబుర్లతో ఒక గంటపైనే కూర్చున్న చలపతిరావు గారు లేస్తూ ఆదివారం తప్పక రావాలని మరోసారి చెప్పి వెళ్ళి పోయారు. అన్నపూర్ణమ్మకి నీరజ అతినెమ్మదిగా మర్యాదగా మాట్లాడటం పట్టూ దొట్టూ అన్నీనచ్చాయి. నీరజకి తల్లిదండ్రులు లేకున్నా తాతగారి పెంపకంలో ఇంత అణుకువ ఎలా వచ్చిందో అర్థంకాలేదు. భర్త ఇంటికి వచ్చింతర్వాత ఆపిల్లని గురించి ఎన్నోసార్లు చెప్పింది. "అందం, ఐశ్వర్యం, అణుకువా ఒకేచోట కల్సి ఉండటం చాలా అరుదండీ" అంది. నారాయణ రావు భార్య చెప్పేది అంతా ఓపిగ్గా విని "ఏం! ఆపిల్లమీద పడింది నీ కన్ను... ఇంకా ఇంకా ఆశలున్నట్లున్నాయిలా ఉంది. కొంపతీసి కోడల్ని చేసుకోవాలనుకుంటున్నావా!" హాస్యంగా అన్నాడాయన. అన్నపూర్ణమ్మ జవాబు చెప్పలేదు.

మురళికి అసలు నీరజా వాళ్ళు వెళ్ళింతర్వాత ఏం తోచ లేదు. ఏంచేయాలి, ఎక్కడికి వెళ్ళాలి అనుకుంటూ స్కూటర్ తీసుకుని బయలుదేరాడు. అయితే అలవాటుగా తన గుర్రం (స్కూటర్) నీరజావాళ్ళ ఇంటివైపుకి దౌడుతీస్తుందేమో అని తనని తను హెచ్చరించుకుంటూ ఆ రోడ్డున దాక స్కూటర్‌ని మరోవైపుకి తిప్పాడు బలవంతంగా మనస్సుని కూడా అదుపు లోకి తెచ్చుకుంటూ.

# 23

మురళీ సాయంకాలాలు క్రమం తప్పకుండా సరోజ ఇంటికి వెళ్ళి ఒక గంటా రెండుగంటలు సరోజతో కబుర్లు చెప్పి ఉన్నాడు. ఈరోజు కబుర్లలో టైమే తెలియలేదు. గోడనున్న గడియారం రంగ్ రంగ్ మని ఎనిమిదిగంటలు కొట్టడం విని ఉలిక్కి-పడి లేచి సరోజకి 'గుడ్ నైట్' చెప్పి, ఇంటికి వచ్చేస్తూ అసలు ఇవాళ మూడుగంటలు నేనేం మాట్లాడానో సరోజతో అని తనని తను ప్రశ్నించుకుని వచ్చేనవ్వుని ఆపుకుంటూ సరోజతో కబుర్ల లోకి దిగితే గంటలు క్షణాల్లా గడిచిపోతాయి. ఇది మాత్రం నిజం. అనుకుంటూ ఇల్లు రావటంతో స్కూటర్ దిగాడు ఇంటి వాకిట్లో టాక్సీ ఆగిఉంది. లోపలినుంచి పెద్దగా మాటలు వినిపిస్తున్నాయి. మురళి అక్కడే ఆగిపోయాడు ఏమిటి అనుకుంటూ.

దశరథరామయ్యగారు ఈజీ ఛైర్లో పడుకుని ఇంటి పై కప్పు వేపు తదేకంగా చూస్తున్నారు. నారాయణరావూ, అన్నపూర్ణమ్మా శిలా విగ్రహాల్లా నిల్చి ఉన్నారు. గిరిధర్ కొత్త పంచా, శిల్కు లాల్చి వేసుకుని కుర్చీలో కూర్చుని ఉన్నాడు. అనూరాధ లోపల ఎక్కడుందో జాడలేదు. ఇందిర అలవాటుకి విరుద్ధంగా ఈరోజు చీరె కట్టుకొని పమిటకొంగు ముఖం నిండా తిప్పి కప్పుకుని తాతగారిని మింగేసేలా చూస్తోంది. రాజేశ్వరమ్మ ఆవేశపడిపోతూ పినతండ్రితో తగూ పడుతోంది. ఆవిడ గొంతు కంచు గంటలాగా మ్రోగుతోంది.

"చిన్నాన్నా! నీకు తమ్ముడి పిల్లలంటే యెంత ప్రేమ.

అయినా నా కింది ద్రోహం చేస్తావా! నా కొడుకుని నాకు రాకుండా చేస్తావా! దొంగచాటుగా అనూని, గిరిధర్‌ని సినిమాకంటూ తీసుకెళ్ళి గుళ్ళో పెళ్ళి చేయించుకొన్నావా! తల్లీదండ్రీ బ్రతికుండగా రౌలిబిడ పెళ్ళి నా చేతులమీద జరపకుండా దిక్కు లేనివాడిలా.... ఇలా పెళ్ళి చేయటం నీకు ధర్మంగా తోచిందా!

మురళీ, అనూరాధ అంటే నీకెంత ప్రేమ ఉన్నా నన్నా ద్రోహంచేసేది చెప్పు! ఎందుకిలా చేశావు. మా ఇద్దరికీ కావల్సినవాడివి అయినా తమ్ముడి పిల్లలంటే నీకెందుకు పక్షపాతం. చెప్పు— నీ బుద్ధి నే నెరుగనా నీవే మంచివాడివయితే అనూని నా కోడల్ని చేసినవాడివి ఈ ఇందిరతో మురళిని చేసుకోమని ఎందుకు చెప్పావు. అనూకి కానీ ఈ ఇందిర మెడలోనూ మురళిచేత మంగళసూత్రం కట్టించలేక పోయావేం. చెప్పు చిన్నాన్నా! జవాబు చెప్పు!"

రాజేశ్వరమ్మ పినతండ్రిని నిలదీస్తోంది. దశరథరామయ్యగారు మాట్లాడకుండా అలాగే కూర్చున్నారు. అన్నపూర్ణమ్మ మెల్లగా వచ్చి ఆవేశంతున్న కుర్చీలో కూర్చోమనీ, మంచినీళ్ళు తాగమని బ్రతిమిలాడుతోంది. కాని రాజేశ్వరమ్మ అదేం పట్టించుకోకుండా పినతండ్రినీ, నారాయణరావునీ దుమ్ము దులిపేస్తోంది.

"అయినా మిమ్మల్ని అని ఏం లాభం. నా కొడుకులోని మెతకతనం కనిపెట్టే మీరిలా చేశారు. మా బంగారం మంచి దైతే ...నీ ఆటలు సాగేవా! మురళిని చూసైనా వీడికి బుద్ధి ఉందా! చదవటానికి పెద్ద చదువులే చదివాడు. ఉద్యోగమూ

చేస్తున్నాడు. కానీ ఏంలాభం! తల్లిదండ్రుల గౌరవాన్ని దక్కించ లేని కొడుకూ ఓ కొడుకేనా" అంటూ కన్నీళ్ళు తుడుచుకుంటూ "దానివ్వు చిన్నాన్నా నాకింతకంటే అన్యాయం ఇంకేం చేస్తావు. నిన్నూ. ఈ నారాయణసి స్వంత వాళ్ళకంటే ఎక్కువగా అభిమా నించినందుకు నాకు శాస్తి బాగా చేశారు. అంతా నేనే చేశాను. నా కొడుక్కీ, కోడలికీ ఏం తెలియదని కూడా వాళ్ళని వెనక వేసుకుని వస్తున్నావు ఒరే....గిరీ—నీవు నా కొడుకువే అయితే ఇలా దొంగపెళ్ళికి ఒప్పుకునేవాడివి కావురా. నాన్నారు ఇవాళ వూళ్ళోలేరు. రేపొచ్చి నన్ను నిలదీస్తే ఏమని చెప్పను. ఎలా చెప్పను. పోనీరా....నాకు ఇద్దరే ఆడపిల్లలని అనుకుంటాను. ఈవాళతో నాకీ ఇంటితో రుణం తీరిపోయింది. ఏది ఇందిరా వాళ్ళపని వాళ్ళు పూర్తిచేసుకున్నారు. నాకు జవాబెందుకిస్తారూ" అంటూ వచ్చే దుఃఖాన్ని మింగేస్తూ కూతురి భుజాన్ని ఆసరాగా చేసుకుని వెనక్కి తిరిగింది.

"అక్కయ్యా, అక్కయ్యా" అంటూ నారాయణరావూ, "వదినగారూ"అంటూ అన్నపూర్ణమ్మా ఎంత చెప్పినా వినిపించు కోవటంలేదు రాజేశ్వరమ్మ. గిరి చటుక్కున లేచి తల్లి దగ్గరికి వచ్చాడు. "అమ్మా నే చెప్పేది కాస్త వినమ్మా" అంటూంటే రాజేశ్వరమ్మ "ఛీ, నన్ను ఇంకా అమ్మా అని పిలవకు" గయ్ మంది. "కాదమ్మా విని తీరాలి."

రాజేశ్వరమ్మలో ఆవేశం పొంగుకొస్తోంది. అయినా అదేం పట్టించుకోని గిరిధర్ "అమ్మా నే చెప్పింది వినితీరాలి"

అని ఆమె రెండుచేతులూ గట్టిగా పట్టుకుని ముందు నన్ను క్షమించానమ్మా నాకన్నీ తెల్సు. తెల్సీ ఇలా ఎందుకు చేశానో చెప్పనా....తాతయ్యా నే చెప్పబోయేది మా అమ్మేకాదు నువ్వూ వినాలి. ఏం వింటున్నావుకదు ! నేసి పెళ్ళికి ఎందు కొప్పు కున్నానో తెలుసా?" ఆగిపోయాడు గిరిధర్.

ఎవ్వరూ ఏం మాట్లాడలేదు. రాజేశ్వరమ్మ కొడుకు చేతి లోని తన చేతులని విడిపించుకోవాలని చూస్తోంది. కాని గిరిధర్ వదలకుండా "అమ్మా చెప్తున్నాను తాతయ్యా సరిగ్గా విను.... ఎందుకంటే తాతయ్య 'ఎత్తు'కి పై 'ఎత్తు' వెయ్యటానికి" వ్యంగ్యంగా అన్నాడు. "ఎత్తు"కి పై "ఎత్తా" అదేమిటి?" అందరూ అయోమయంగా చూశారు. దశరధరామయ్యగారు ఎడం చేతితో ముఖం కప్పుకుని ఓరకంటితో మనవడివైపు చూస్తూ న్నారు. ఆ ప్రక్క గదిలోనే ప్రాణం అంతా గుప్పెట్లో పెట్టు కుని నక్కి నిల్చున్న అనూరాధ చెవులు దోరబెట్టి గిరిధర్ చెప్ప బోయేది వింటోంది. "అమ్మా! తాతయ్య 'ఆటకట్టు' చేశాను. అనూరాధ మెడలో మంగళసూత్రం కట్టాను నిజమే. కాని మురళి మన ఇందిరని పెళ్ళి చేసుకుంటేనే అనూ మన ఇంటికి కాపు రానికి వస్తుంది. లేకుంటే .. టే....తాతయ్యా వింటున్నారా! నేను చెప్పేది. నేను శ్రీ శ్రీ దశరథరామయ్యగారి మనవడిని. నా రక్తంలో నీ రక్తం ఉంటుందని నీకూ తెల్సుగా. అత్తయ్యా, మామయ్యా క్షమించండి. మేం ఇంక వెళ్ళిపోతాం" అంటూంటే అన్నపూర్ణమ్మ పణికిపోయింది. నారాయణరావు 'గిరీ! గిరిధర్"

అంటూ ఏదో చెప్పబోయాడు. కాని గిరిధర్ విన్పించుకో కుండా—

"మామయ్యా టిట్ ఫర్ టాట్....దెబ్బకి దెబ్బ. మా యువతరం పోకడే ఇంత. ఏదేం మాట్లాడినా ప్రయోజనం శూన్యం. అదీ వెడుతున్నాను. 'సర్ప్రైజ్' అని బిగ్గరగా చెప్పి.

"అయ్యో! మళ్ళీ ఇదో నాటక మేమిటిరా....గిరీ....గిరీ" అంటున్న తల్లిని బలవంతంగా చెయ్యి పట్టుకుని తీసుక వెడుతూ 'ఇందిరా కమాన్' అంటూ టాక్సీ ఎక్కేసి డోర్ గట్టిగా వేసే శాడు. టాక్సీ కదలి వెళ్ళిపోయింది.

మురళి షాక్ తిన్నవాడిలా నిలబడిపోయాడు. ఏమిటి దంతా! నిజంగా జరుగుతున్నదా అనుకుని మెల్లగా తేరుకునే సరికి ఆవేశం ముంచుకొచ్చింది. అప్పటికి టాక్సీ వెళ్ళి పోయింది. ఒక్క అంగలో లోపలికి వచ్చేసి "తాతయ్యా ఏమి టిదంతా" బిగ్గరగా అరిచాడు.

దశరథరామయ్య ముఖాన్ని మరీ గట్టిగా మూసుకుం టూంటే మురళికి మరీ మండిపోయింది. "తాతయ్యా! ఏమిటిది. ఎలా జరిగింది ఇలా" అంటూ ముంచుకొస్తున్న కోపాన్ని చూసి నారాయణరావు కంగారుపడిపోతూ "మురళీ నీ విప్పుడేం మాట్లాడ వద్దు" అన్నాడు గట్టి

"నాన్నగారూ! నే మాట్లాడి తీరతాను. అసలీ పెళ్ళి ఇలా రహస్యంగా ఎందుకు చేశారూ? ఎవరికోసం చేశారూ.... అది చెప్పాలి....నాకు చెప్పితీరాలి. ఇంతకిమించి అవమానం ఏదై నా ఉంటుందా చెప్పండి."

"మురళీ నీ గదిలోకి వెళ్ళిపో! మాట్లాడవద్దు. నే శాసిస్తు న్నాను" నారాయణరావు బిగ్గరగా అరిచాడు.

"నాన్నారూ! నేనిలాంటి పని సహించలేను."

"మురళీ! నాన్న చెప్పేది కాస్త వినరా నాయనా! నువ్వు ఆవేశపడకురా చంద్రీ" అన్నపూర్ణమ్మ జాలిగా చూస్తూ అంది. అసలు వాళ్ళు మాట్లాడేదేం విన్పించుకోకుండా తాతగారి దగ్గరికి వచ్చేశాడు.

"తాతయ్యా! నాకలాంటి దొంగనాటకాలంటే యిష్టం ఉండదని తెల్సుగా! ఒందుకు చేశావీపని. చెప్పు- నాప్రశ్నకి సూటిగా జవాబు చెప్పు. ఇందిరని బలవంతంగా నా మెడకి కట్ట టానికి గిరిధర్‌తో కల్సి వేసిన ఎత్తుకదూ! చెప్పు? ఈ ఎత్తు వేయమని గిరి నీకు సలహా ఇచ్చాడా.

"నాకు జవాబు కావాలి"

"తాతయ్యా చెప్పేతీరాలి. గిరికీ, అత్తయ్యకీ చెప్ప కుండా తప్పించుకున్నావ్ కదూ....నే వదలను చెప్పు?" మురళి తాతగారిని పదిపి అడుగుతూన్నాడు. దశరథరామయ్యగారు ముఖంమీది చేతులు తీసేసి మనవడి ముఖంలోని ఆవేశాన్ని తదే కంగా చూస్తూన్నారేకాని పెదవి కదపలేదు.

నారాయణరావు వెర్రికోపంతో కొడుకుని కొట్టబోయేం దుకు చెయ్యి ఎత్తారు. అన్నపూర్ణమ్మా, అనూరాధా పరుగున వచ్చారు. కాని అప్పటికే దశరథరామయ్యగారు చటుక్కున లేచి కొడుకు చెయ్యి పట్టుకుని ఆపి "నారాయణా, నువ్వు ఇలా

ఆవేశపడితే యెలారా" అంటూన్న ఆయన గొంతు ఎంతో సౌమ్యంగా ధ్వనించింది.

మురళి ముఖం మరీ ఎర్రబడిపోయింది. ఆవేశం ఇంకా పొంగుకొచ్చేసింది. "బాబయ్యా! చెప్పావా లేదా?" మరీ రెట్టించాడు.

"మురళీ! కొన్ని ప్రశ్నలకి జవాబులు ఉండవురా! ఇంతే నే చెప్పేది."

"ఏమిటీ" అంటూన్న మురళిని తల్లి చెయ్యి పట్టుకుని గదిలోకి లాక్కెళ్ళింది! ఎంతసేపటికో గాని మురళికి ఆవేశం తగ్గలేదు.

ఆ రాత్రి ఆ ఇంట్లో ఒక్కరూ భోజనం చెయ్యలేదు. నారాయణరావుకి పినతండ్రి ఇలా అనూరాధ పెళ్ళి చేయటం ఒకవైపు సంతోషంగానూ ఉంది. మరోవైపు భయంగానూ ఉంది. అనూ జీవితం ఎలా మారుతుందో! మురళి ప్రపంచం తల్లక్రిందులైనా ఇందిరని పెళ్ళిచేసుకోడని తెలుసు. పెళ్ళిజరిగిందనే సంతోషం ఆపగించజంటయినా లేకుండా గిరిధర్ అలా మదత పేచీలోకి దిగినందుకు మరీ భయంగావుంది నారాయణరావుకి. ఇదే ఆలోచిస్తూ అర్ధరాత్రి దాటినా ఆఫీసు రూములోనే తల గట్టిగా పట్టుకుని కూర్చుండిపోయాడు.

ఇంక అన్నపూర్ణమ్మకి ఆలోచించే శక్తి లేనిదానిలా పడుకుంది. ఒక్కగాను ఒక్క కూతురు, ఒక్క కొడుకు. వాళ్ళ పెళ్ళిళ్ళు కనులపండువుగా చేసుకు చూసుకోవాలని ఎన్నాళ్ళగానో కలలు కంటూవుంది ఆ మాతృ హృదయం. ఇలా హఠాత్తుగా

కూతురిపెళ్ళి అయిపోయిందనే వార్త ఆవిడకి సంతోషంతోబాటు బాధనీ కలిగిసోంది.

మురళి బైటనించి వచ్చిన బట్టలన్నా మార్చుకోకుండా టేబులుమీద తల పెట్టుకుని రాయిలాగా కూర్చుండిపోయాడు. అనూరాధ ఆ గదిలోనే తన మంచంమీద చివరగా కూర్చుని భయంతో బిగుసుకుపోయింది. తర్వాత ఆ భయం క్రమంగా దుఃఖంగామారి వెక్కిళ్ళతో ప్రవాహంలా బైటకిపొంగుకొచ్చింది. మురళికి ఆ వెక్కిళ్ళు విన్పిస్తున్నా చాలాసేపు తలెత్తలేదు. అనూ ఏడుపు మరీ ఎక్కువైంది. మురళి ముఖాన్ని గట్టిగా తుడుచుకుని వెనక్కితిరిగి చూశాడు. అనూరాధ 'డ్రెస్సింగ్ టేబిల్'కి తల ఆన్చి కూర్చుంది. కన్నీళ్ళు జలజలా రాలుతున్నాయి. మెడలోవున్న పసుపుతాడుకి కట్టివున్న మంగళ సూత్రాలు ఇటూ అటూ వూగుతున్నాయి. కట్టుకునివున్న కొత్త చీరె నలిగిపోయివుంది. మురళి చెల్లెలిని అలాచూసి లేచిదగ్గరగా వచ్చాడు. 'అనూ' అన్నాడు ఎంతో ప్రేమగా. 'అన్నయ్యా' అమాంతం కౌగలించుకుని వెక్కి వెక్కి యేడ్చింది.

"అనూ! ఇవాళ నీ జీవితంలో ఎంత శుభదినం. మరిలా ఏడుస్తారా ఎవరన్నా! తప్పమ్మా ఏడవకు. కళ్ళు తుడుచుకో"

అనూకి ఏడుపు మరీ ఎక్కువైంది. మురళి దగ్గరగా కూర్చుని చెల్లెలిని వోదారుస్తూ "సారీ చెల్లాయ్! నా ప్రవర్తన నాకే సిగ్గుగా వుంది."

అనూరాధ ఏడుపు ఆపుకుంటూ "అన్నయ్యా తాతయ్యని

ఏమీ అనబోకు తప్పంతా నాదే! పాపం నాదే! నా మూలంగానే ఈ ఇంట్లో శాంతి కరువైంది. నీకూ, అమ్మకీ, నాన్నగార్కీ, తాతయ్యకీ అందరికీ బాధ కల్గింది. నేను ...నేను పాపిష్టిదాన్ని."

"అనూ! ఇంక అవన్నీ మనస్సులో పెట్టుకోకు. నీకోసం ఏమైనా చెయ్యగలను....కానీ...." అంటూ ఆగిపోయి "ఇన్నాళ్ళ నా మనస్సు నా దగ్గరే ఉంది. అప్పుడైతే నా సుఖం సంగతి వదిలి ఇందిర మెడలో మంగళసూత్రం కట్టి ఉండేవాడిని. కాని నా మనస్సు నా దగ్గర లేదు. సమయం మించిపోయింది. ఒకరి కిచ్చినదాన్ని ఎలా తీసుకోను. తనలో తను ఆవేదన పడిపోతూ చెల్లెల్ని ఓదార్చటానికి ప్రయత్నిస్తున్నాడు మురళి. అనూరాధ మెల్లగా "అన్నయ్యా నావ ఇలా వేసి పడతాడని ముందు తెలిస్తే అసలీ పెళ్ళికి ఒప్పుకునేదాన్ని కాదన్నయ్యా! నా మాట నమ్ముతావా" అంది.

'పిచ్చిఅనూ' ప్రేమగా వీపుమీద చెయ్యివేసి నిమురుతూ ఆమె ప్రక్కన కూర్చుని కుడిచేతిని తన చేతిలోకి తీసుకుని ఆ చేతిని పరీక్షిస్తుంటే అనూరాధ వేలికి ఉన్న వజ్రంరాళ్ళ ప్రధనపు ఉంగరం మెరుస్తూ కన్పించింది. చెల్లెలి చేతిని, ఆ క్రొత్త ఉంగరాన్ని చూస్తూ ఉండిపోయాడు మురళి.

అనూరాధ కన్నీళ్ళు గట్టిగా తుడిచేసుకుని "అన్నయ్యా నీ కిష్టంలేని పెళ్ళి అస్సలు చేయనీయను. నా జీవితం ఏమై పోయినా సరే నువ్వు మాత్రం...." మళ్ళీ అనూరాధ గొంతు

పూడుకుపోయింది. మురళి ముఖం గంభీరంగా మారిపో యింది.

"అవన్నీ మనచేతిలో లేవమ్మా. సరే చాలా పొద్దు పోయింది నిద్రపో" అంటూ బట్టలు మార్చుకుని లుంగీ కట్టుకుని తన మంచంమీద వాలిపోయాడు. ఒకటీ, రెండూ, మూడూ ఇలా గడియారం క్రమం తప్పకుండా గంటలు కొడుతూ తన విద్యుక్త ధర్మాన్ని నెరవేరుస్తూ ఉంది. ఆ గంటలన్నీ వింటూ ఆలోచిస్తూ పడుకున్నాడు మురళి. కంటికి నిద్ర రావటం లేదు. మనస్సుకి శాంతిలేదు.

## 24

తెల్లవారింది. కళ్ళు తెరవకుండానే మరోవైపుకి వత్తి గిలి పడుకున్న మురళికి ఏదో కాయితం తగిలినట్లయి ఉలిక్కి పడి కళ్ళుతెరిచి అనూ పడుకున్న మంచంవైపు చూశాడు. అనూ రాధ ఇంకా నిద్రపోతూనే ఉంది. మురళి లేచి ఆ కాయితాన్ని విప్పాడు. తాతగారి దస్తూరీ అని గుర్తించి తెల్లబోతూ ఇదేమిటి అనుకుని గబగబా చదువుకున్నాడిలా.

మురళికి ఆశీస్సులు,

అనూరాధకీ, గిరిధర్ కీ రహస్యంగా పెళ్ళి చేయటంలో నా ఉద్దేశ్యం ఒకటి. నువ్వు అపోహపడినది మరొకటి. అయితే అనూ పెళ్ళి ఇలా చెయ్యటం మంచిది కాదని నాకు తెల్సు. నీకు ముందు చెప్పాలనే అనుకున్నాను. అయితే, నీకు చెపితే ఈ పెళ్ళి జరగదు అందుకే చెప్ప లేదు. అనూ, గిరిధర్ లని విడదీయటం మంచిది కాదని రాజేశ్వరికి బుద్ధి చెప్పాలనీ ఏదేదో అనుకుని గిరిధర్ తో ఇలా పెళ్ళిచేస్తా అని చెప్పాను. మనస్ఫూర్తిగా ఒప్పు కున్నాడని సంతోషించాను. అయితే ఈ అవకాశాన్ని ఉపయోగించుకుని గిరి మరోరకంగా నామీద దెబ్బతీస్తా డని కలలోకూడా అనుకోలేదు. దీనికంతా కారణం నీమీద ఉండే అతి ప్రేమాభిమానాలే. అనుకోవ్ని ఇప్పుడు అనవసరం. మరో తప్పు చేశాను. నీరజను నీకు చేసు కుంటాం అని చలపతికి మాట ఇచ్చేశాను. అనూ గిరి భార్య అయ్యింది. కాని దానివల్ల పడిన పీటముడిని నీవు విప్పాల్సిందే. ఈ వ్యవహారంలో నన్ను ఆజ్ఞాపించలేను. నీ మేధస్సు, సమయస్ఫూర్తి ఉపయోగించి పరిస్థితిని చక్కదిద్దు. నా అవసరం ఉండదనే అనుకుంటున్నాను. ఒకవేళ ఉంటే ఓ కాగితంముక్క రాయి. రెక్కలు కట్టుకు వాలతాను.

ఇట్లు

నీ తాతయ్య

ఆ ఉత్తరాన్ని ఒకటీ రెండూ అలా పదిసార్లయినా చదివేశాడు మురళి.

"మురళీ లేవరాదురా! కాఫీ తాగుదువుగాని త్వరగా ముఖం కడుక్కో" అన్నపూర్ణమ్మ కేకపెట్టింది. 'మురళి లేచి తల దువ్వుకుంటూ అద్దంలోకి చూసుకున్నాడు. కళ్ళు ఎర్రబడి ముఖంఅంతా ఉబోలా అయిపోయింది. ముఖం కడుక్కొని తల్లి ఇచ్చిన కాఫీతాగుతూ "అమ్మా తాతయ్య ఎప్పుడు వెళ్ళారు" అని అడిగాడు."నేను లేచేసరికి వెళ్ళిపోయారు. కప్పుడు కాఫీ అయినా తాగలేదు. నాన్నతో చెప్పి వెళ్ళిపోయారుట" అంది పొడిగా.

'అలాగా' అంటూ స్నానం అది పూర్తిచేసుకుంటున్నాడే కాని మనస్సు బాధగా ఉంది. అభిమానవంతుడైన తాతయ్య మనస్సు బాగా గాయపడింది. నేను చాలా తెలివి తక్కువగా త్వరపడ్డాను. అసలేం జరిగిందో అర్థం చేసుకోలేదు. యింక ఇప్పుడు నేనేంచెయ్యాలి. ఇందిరను పెళ్ళిచేసుకు తీరాలా! ఉహు. చేసుకోలేను....పాప అనూ జీవితం ఏమైపోతుందో!

మనస్సంతా అల్లకల్లోలమైపోతుంది. నారాయణరావు మామూలుగా భోజనంచేసి కోర్టుకి వెళ్ళిపోయాడు. భార్యతోగానీ కొడుకుతోగాని మాట్లాడలేదు. అనూరాధ గదిలోనుంచి బైటకే రాలేదు. ఏదో తప్పుచేసిన దానిలాగా. యాంత్రికంగా భోజనం చేసి లేచారు. అన్నపూర్ణమ్మ అన్నం తినకుండా కూర్చుని ఏదో ఆలోచిస్తోంది. ఆఖరికి మురళిని పిల్చి, "మురళీ! అత్తయ్యగారి ఇంటికి వెళ్ళివస్తారా! నువ్వుఎక్కడికీ వెళ్ళకు. అనూ ఒక్కర్తీ ఉంటుంది" అంది.

"వద్దమ్మా నీవిప్పుడు వెళ్ళద్దు. నే వెళ్ళి గిరిని శాంతింప జేసి తీసుకువస్తానుగా."

"అతను రాడు. నీకు తెలియదు. అతనికి నీకన్నా పట్టు దల ఎక్కువ."

మురళికి నవ్వు రాకున్నా తెచ్చిపెట్టుకుని—

"అమ్మా! అనూ జీవితం సుఖ సంతోషాలతో సాగిపోవా లని తల్లిదండ్రులైన మీతోబాటు నేను మాత్రం కోరుకోనా!"

"……… "

"చెప్పమ్మా!"

"ఏం చెప్పను! ఎవరికి చెప్పను! అసలు నామాట ఎవరు వింటారు? మీ తాతయ్యనిలా అనూకి దొంగపెళ్ళి చెయ్యమని చెప్పానా! మీ నాన్నని మరో సంబంధం వెతకమన్నానా! నిన్ను ఆ ఇందిరని పెళ్ళిచేసుకోవద్దన్నానా చెప్పరా! ఈ ఇంట్లోవన్నీ నా ఇష్టప్రకారమే జరుగుతున్నాయా! ఈ ఇంట్లో నేనో దాసీ దాన్ని అంతే…. నా మాట ఎవరికీ లెక్కలేదు…. ఉంటే ఇలా మన పరువు బజారున పడుతుందా!

"అమ్మా!"

"నన్ను విసిగించకు. ఈ బాధలో ఏదేదో అనేస్తాను. నీకు బాధ కలుగుతుంది. అయినా వాళ్ళింటికి నేనే వెడతాను. ఏ అవమానం అయినా నేనే భరిస్తాను…."

"అమ్మా! ఇంక మరేం మాట్లాడవద్దు. నేనే వెళ్ళి గిరి ధరిని తీసుకువస్తాను. నువ్వు వెళ్ళి భోజనం చెయ్యమ్మా"

అంటూ బట్టలు మార్చుకుని స్కూటర్ తీసుకుని బయలుదేరు తుంటే పోస్టుమాన్ ఓ కవరు ఇచ్చి వెళ్ళిపోయాడు. కవరు చించి చూశాడు.

సెలెక్ట్ అయినట్లూ, త్వరలో ట్రైనింగ్‌కి వెళ్ళవలసి నట్టూ ఆర్డర్ అది. క్షణం సంతోషంతో ఉప్పొంగింది హృదయం. కానీ అంతలోనే....చప్పగా చల్లబడినట్లు అయింది. లోపలికి వచ్చి తల్లితో చెప్పాలనిఉన్నా ఇది సమయం కాదనిపించింది. అందుకే రాజేశ్వరిమ్మ ఇంటికి పోనిచ్చాడు స్కూటర్ని.

అక్కడి వాతావరణం ఎలావుంటుందో ఎలావున్నా వెళ్ళక తప్పదు. గిరిధర్ దురుసుగా మాట్లాడితే....మాట్లాడి తీరతాడు. అయినా తను ఆవేశపడకూడదు. రాబోయే పరిస్థితుల్ని స్థయి ర్యంగా ఎదుర్కోవాలని ముందుకే పోనిచ్చాడు. స్కూటర్ని. ప్రహారీగేటు తీసుకుని లోపలికి వెళ్ళబోతుంటే నౌకరు కుర్రాడు లోపలికి పరుగెత్తి మురళి వచ్చిన వార్త చెప్పి మళ్ళీ పరుగున ఎదురొచ్చాడు.

"ఎవరెవరున్నారింట్లో" అడిగాడు.

"పెద్దమ్మగారు వళ్ళు బాగాలేదని మేడమీద పడు కున్నారు. పెద్దయ్యగారు వూరునించి ఇంకారాలేదు. ఇందిరమ్మ స్నేహితులతో ఎక్కడికో బైటకి వెళ్ళారు. సునందమ్మకి మీరు వచ్చినట్లు చెప్పాను. 'వస్తున్నాను హాల్లో కూర్చోమను' అని చెప్పారు."

'ఓహో' అక్కడే ఆగిపోయాడు మురళి. గిరిధర్

ఇంట్లో ఉన్నాడా లేదా అని అడగాలనివున్నా అడగకుండా వూరు కున్నాడు. సునంద తప్ప మరెవ్వరూ నాతో మాట్లాడరా" అనుకుంటూ కుర్చీలో కూర్చుని పేపరు చూస్తున్నాడు.

సునంద ఆకుపచ్చ పట్టుచీరె కట్టుకుని ముడిలో ముద్ద మందార పువ్వు తురుముకుని సలక్షణమైన ముత్తయిదువులా కాళ్ళకి పసుపూ, ముఖాన పదిపైసలంత వున్న కుంకుమతో అక్కడకొచ్చింది. వస్తూనే "బావా చేయిలుపట్టు. ఇది దేవుడి ప్రసాదం తినేసెయ్యి"అంటూ చేతిలోపెట్టి "ఇంక నీకు టైనింగ్ ఆర్డర్స్ వచ్చేస్తాయి ముఖ్యం అలా వస్తుందని నా మనస్సు గట్టిగా చెపుతోంది. నేనూ మనస్ఫూర్తిగా దేవుడిని అదే కోరుతున్నాను" అంది అతి మామూలుగా మాట్లాడుతూ.

మురళి మౌనంగా తన ఆర్డర్ కాయితం సునంద కందించాడు. అది చదివిన కళ్ళు సంతోషంతో మెరిసిపోయాయిక్షణం.

"అరె! ఇంతసేపూ చెప్పవేం. మర్చిపోయాను. కంగ్రాచ్యులేషన్స్ కలెక్టరుగారూ ఆత్మీయంగా చెయ్యి అందించింది.

"సునందా!"

"వూ"

"నీవెలా ఇంత మామూలుగా మాట్లాడగల్గుతున్నావు. రాత్రి జరిగిన విషయం నీకు తెలుసునా అసలు?"

'తెలుసు"

"మరి?"

"మురళీ ఇలాంటప్పుడే మనిషి స్థయిర్యం కోల్పో కూడదు. అవన్నీ సరేగాని నీ ప్రయాణం ఎప్పుడు?"

"ముందు పెళ్ళి తర్వాత ప్రయాణం."

"పెళ్లా! ఎప్పుడు? ఎవరితో?"

"సునందా అసూ నా ఆరవప్రాణం. దానికోసం నేనేమై పోయినా బాధపడను. అయితే నన్ను ఇలా బలవంతంగా బంధిం చారనే బాధ నన్ను చిత్రవధ చేస్తోంది. అయినా కాలం నాది కాదు. విధికి తలవంచటానికి నిశ్చయించుకున్నాను. ఇప్పటికీ నే చెపుతున్నాను. ఇందిరని నేను ప్రేమించటంలేదు. తను నన్ను కావాలనుకుంటుందేమో కానీ దానికి నా తప్పులేదు. అయినా ఇందిర మెడలో మంగళసూత్రం కట్టటానికే నిశ్చ యించుకున్నాను. కేవలం నా చెల్లెలికోసం మాత్రమే. ఈ విషయం గిరిధర్‌కీ, అత్తయ్యకి చెప్పిపోవాలనే వచ్చాను. ఏదీ అత్తయ్యని పిలువు."

"మురళీ...." ఆవేశంగా అంది సునంద.

"ఏం. ఎందుకింకా మీ కందరికీ బాధ" కోపంగాఅన్నాడు.

"బాధే మురళీ! నీవిలా వ్యక్తిత్వం లేనివాడిలాఅందరూ బలవంతంచేస్తే ఇందిరని పెళ్లాడటానికి సిద్ధపడ్డావా! ఛీ....ఛీ.... వద్దు మురళీ....ఈఇందిరకోసం నీ నీరజమనస్సుని క్షోభపెట్టకు. ఇందిర నువ్వు లేకున్నా బ్రతకగలదు. కానీ....నీరజ ...నిన్నెంత ప్రేమించిందో అసలు నువ్వు అర్థం చేసుకున్నావా! చేసుకునే ఇలాంటి నిర్ణయానికివచ్చావా? మురళీ ముందునన్ను క్షమించు.

ఒకరోజు ఇందిరని పెళ్లాడమని అడిగాను. కాని ఈరోజు ఇదే నోటితో వద్దు అని గట్టిగా చెపుతున్నాను. మురళి ఈ పెళ్ళికి నువ్వు వప్పుకోవద్దు....

"సునందా!"

"నే చెప్పేది విను మురళి! వద్దు ఈ పెళ్ళికి వప్పుకో వద్దు. కారణం ఏమిటని అడగవద్దు....నువ్వు ఇందిరని పెళ్ళి చేసుకోవద్దు.

రాజేశ్వరమ్మ అక్కడికి వచ్చి ఎంతసేపయిందో సునంద చూడలేదు. మురళి తలెత్తి చూసేసరికి రాజేశ్వరమ్మ అంతా విని కోపంతో మండిపోతూ 'సునందా' అంటూ చాచి చెంప పగిలేలా కొట్టింది కూతుర్ని. మురళి నిర్విణ్ణుడై పోయాడు. మేనత్త చేసిన పనికి అతని ముఖం అప్పటికే ఎర్రబడిపోయింది. 'అత్తయ్యా' అన్నాడు ఆవేశంగా.

"ఇందిర ఎన్నిచెప్పినా ఆ మాటలు నమ్మలేదే .... ఇవాళ....నా చెవులతో స్వయంగా విన్నానే! ఇప్పుడు యేం చెయ్యాలి నిన్ను. ఏంచేసే శిక్ష సరిపోతుంది" పళ్ళు కొరుకుతూ మళ్ళీ చెయ్యి యెత్తిన మేనత్తని గభాలున పట్టుకుని ఆపి—

"అత్తయ్యా! సునందవిషయం వదులు. నేచెపుతున్నాను. నేను ఇందిరని పెళ్ళిచేసుకోను ...కోను.... తెల్సిందా! అనూ విషయం గుర్తు ఉంచుకునే మరీ చెపుతున్నాను. తెల్సిందా! అనవసరంగా సునందని కోపగించుకోకు. ఈ విషయమే చెప్పి పోదాం అని వచ్చాను వెళ్ళొస్తా" అంటూ గిరుక్కున వెనక్కి తిరగబోతూ సునంద ముఖంలోకి క్షణం చూశాడు. కళ్ళనీళ్ళు

సుళ్ళు తిరుగుతున్నా సంతృప్తిగా మెరిసినాయి. మురళి ఒక్క అడుగు వేశాడు అంతే. ఇందిర ముఖం మాడ్చుకుని నిలబడిఉంది అప్పటికే అక్కడ. మురళీ ఇందిరా ఒకరి ముఖాల్లోకి ఒకరు తీక్షణంగా చూసుకున్నారు. ఇందిర విసురుగా ముందుకొచ్చి—

"నేనెప్పుడూ నిన్ను పెళ్ళిచేసుకోమని దేబిరించలేదు. ప్రేమించానని పాటాలు చెప్పలేదు. నీవు ఇష్టపడ్డా నేను చేసుకోవటానికి రెడీగాలేను— లేనూ- లేనూ. తెల్సిందా! నీలాంటి పాషాణాన్ని చేసుకునేకంటే ఉరిపెట్టుకు చావటం నయం చాలునా. మరింకో పదిసార్లు చెప్పనా" అంది గొంతు చించుకుని. రాజేశ్వరమ్మ 'ఇందిరా' అంటున్నా ఇందిర విన్పించుకోవటంలేదు.

ఇందిర మాటలు ముఖాన్ని ఈడ్చి బాదినట్లు అన్పించింది మురళికి. ఇందిరని బాచి చెంప పగలగొట్టాలని అన్పించినా ఆవేశాన్ని ఎంతో నిగ్రహించుకుని "చాలా సంతోషమైన మాట చెప్పావు వస్తా" అంటూ చకచకా వాకిట్లోకి వచ్చేసి స్కూటర్ తీసుకుని బయలుదేరాడు. రెండు మూడు మైళ్ళు అలా వేగంగా ప్రయాణించిన తర్వాతగానీ మనస్సు తన ఆధీనంలోకి రాలేదు.

ప్రైసింగ్ ఆర్డర్స్ వచ్చాయనే ఆనందం కొంచెం కూడా లేకుండా పోయింది. అసలు ఇంటిదగ్గర నేను ఏ ఉద్దేశ్యంతో బయలుదేరాను. తీరా వాళ్ళ ఇంటికి వెళ్ళిన తర్వాత జరిగిందేమిటి? నన్నేదో శక్తిపట్టి ఇలా ఇష్టమొచ్చినట్లు లాగుతోందో, ఇదంతా ఇలా ఎందుకు జరుగుతోంది. మంచికా చెడ్డకా....

ఏమో! సునంద ఎందుకిలా ఈరోజు ఇందిరని పెళ్ళిచేసుకోవద్దు అని పదే పదే చెప్పింది. దీనికి వెనక ఏదో బలమైన కారణం ఉండి ఉంటుంది. కానీ అదేదో చెప్పలేదు. చెప్పకుండా తెల్సుకోవటం చాలా కష్టం. అవన్నీ సరే ఇంటికి వెళ్ళగానే అమ్మ "గిరిధర్ ఏడి?" అని అడిగితే.... ఏం చెప్పను. ఏం చెప్పి అమ్మను నమ్మించను భగవాన్.... ఏమిటీ విచిత్ర పరిస్థితులు. మురళి స్కూటర్ని వెనక్కి తిప్పాడు. ఇంత అశాంతిని ఎలా భరించటం? ఈ బరువుని భరించలేకపోతున్నాను. నీరజ దగ్గరికి వెళ్ళాలని మనస్సు ఆరాటపడుతోంది. కానీ వెళ్ళలేక అలా పిచ్చిగా సాయంకాలం వరకూ అక్కడక్కడా తిరుగుతూనే ఉన్నాడు. ఇంటికి వెళ్ళాలంటే భయంగా వుంది. టైంచూశాడు. అయిదుగంటలు కాలేదింకా. చలపతిరావుగారు క్లబ్బుకి వెళ్ళిపోయే టైం అయింతర్వాత నీరజఇంటికి పోనిచ్చాడుస్కూటర్ని.

# 25

నీరజ వాకిట్లోనే ఎదురైంది. తోటమాలితో ఏదో చెప్పి చెట్లకి కుదుళ్ళు చేయిస్తోన్నదల్లా మురళిని చూడగానే గబగబా ముందుకొచ్చింది. ఆ అమ్మాయి ముఖం సంతోషంతో వెలిగిపోతోంది. ప్రతిరోజులా 'నమస్తే' అనకుండా కాస్త సిగ్గుపడి

నట్లుగా "రండి లోపలికి" అంటూ హాల్లోకి దారితీసింది. మురళి యాంత్రికంగా నడిచివెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు.

"మీకోసం ఎంతోసేపటినించీ ఎదురుచూసి చూసి తాతయ్య ఇప్పుడే క్లబ్బుకి వెళ్లాడు."

"ఎందుకు?"

నీరజ మాట్లాడలేదుకానీ తలెత్తి మురళి ముఖంలోకి సూటిగా చూస్తూ "మీకు తెలియదా?" ఎదురు ప్రశ్న వేసింది.

"ఊహు!"

"అయితే నాకూ తెలియదు. కానీ మీ తాతగారు ఉత్తరం రాశారు" అంటూ ఓ కవరుతెచ్చి అందించి 'టీ తెస్తా' అంటూ లోపలికి వెళ్ళింది.

దశరథరామయ్యగారికి చలపతిరావుగారు రాసిన ఉత్తరానికి జవాబది. త్వరలో లగ్నం పెట్టించే ఏర్పాటు చేయమనీ, తను త్వరలోనే వస్తాననీ. అప్పుడు మా నారాయణతోనూ, కోడలితోనూ మాట్లాడి తాంబూలాలు తీసుకోవటం— వెంటనే పెళ్ళి లగ్నంచూసి పెళ్ళి చేసేయటం.

ఇదీ ఆ ఉత్తరంలోని సారాంశం. ఆ ఉత్తరం చదివిన తర్వాత మురళికి ముందు కాస్త మనస్సు కుదుటపడినా అంత లోనే అశాంతితో నిండిపోయింది. ఇంత త్వరగా పెళ్ళి ఏర్పాట్లు చేసుకోపటం అంత మంచిపని కాదు. ముందు అనూరాధని గిరిధర్ తీసుకువెళ్ళే ఏర్పాటు చెయ్యాలి తర్వాత....

టీకప్పు అందిస్తూ నీరజ "ఏమిటా ఆలోచనలు. నాకూ

చెప్పకూడదూ" అంది. మురళి నీరజ ముఖంలోకి చూశాడు. నీరజ కళ్ళు వాల్చేసి, టీ కాస్త కాస్త తాగుతోంది.

"స్త్రీకి సిగ్గు సింగారం కాబోలు."

"నీరజా! ఈ అమూల్యమైన ప్రేమని తెలివి తక్కువగా వృథా చేసుకుంటే మళ్ళీ దొరకదు. తెలుసునా నీకు."

"ఒక్కసారి అమ్మాయిగారు మూగనోము పట్టేస్తేఎలా— నీతో చాలా చాలా విషయాలు చెప్పాలి."

"నేను వినటానికి ఎప్పటినించో రెడీగాఉన్నాను.కానీ.... మీరే గుర్తించటంలేదు."

"అలాగా?"

"వూ"

"ఇలా నావైపు చూడు."

"అక్కరలేదు. వింటున్నాను చెప్పవచ్చు."

"కుదరదు."

"మహా చక్కగా కుదురుతుంది."

"ఊహూ" అంటూ వంగి నీరజ చెయ్యి పట్టుకున్నాడు. నీరజ చెయ్యిని లాక్కోటానికి ప్రయత్నించలేదు.

"నీరజా నన్ను పెళ్లాడటం నీ కిష్టమేనా?"

నీరజ తల వంగిపోయింది. పెదవులు ఒణుకుతున్నాయి సన్నగా.

"చెప్పు నీరజా. నాతో సూటిగా చెప్పు. నిర్భయంగా చెప్పు."

"చెప్పమంటూంటే"

"నాచేతిని ఇంతగట్టిగా పట్టుకుని ఇలా నిలదీసి అడగటం భావ్యమేనా."

మురళి చటుక్కున చెయ్యి విడిచేసి "వూ చెప్పు" త్వర పెట్టాడు.

"నాకు తెలియదు."

ఇలా అంటూంటే అవతల మన తాతయ్యలిద్దరూలగ్నాలు పెట్టించేసి, ఆ మూడుముళ్ళూ వేయించేసి వూరుకుంటారు. మర ప్పుడూ నాకు తెలియదు అని కూర్చుంటావా?"

'ఔను' అన్నట్లు కళ్ళు ఎగరేసింది. నోటితో చెప్పాలి జవాబు.

"చెప్పటం రాదు" పెంకెగా అంటూంటే మురళి మళ్ళీ వంగి చేతిని గట్టిగా పట్టుకుని దగ్గరగా లాక్కున్నాడు. నీరజ కళ్ళల్లో భయం చూస్తూంటే మరీ కొంటెతనం ఎక్కువవుతోంది. ఆ సమయంలో తను అసలు ఏం చేస్తున్నాడో మురళికి తెలియ టమేలేదు. నీరజని తన ప్రక్కగా కూర్చోబెట్టుకుని భుజంమీద చెయ్యివేసి ప్రేమగా "నీరజా! నాకు నువ్వు కావాలి.... నిన్ను తప్ప మరెవ్వరినీ పెళ్ళి చేసుకోలేను. మొదటిసారి చూసిన ప్రేమ ఎలాంటిదోగాని....మన ఇద్దరినీ ఇంత దగ్గరికి చేరుస్తుం దని అనుకోలేదు సుమా. నీరజా.... అన్నీ సరే పెళ్ళికోసంత్వర పడుతున్నావా? మీ తాతగారిచేత ఉత్తరంరాయించావు. నాకైనా ముందు చెప్పకుండానే."

నీరజ చిరుకోపంగాచూస్తూ "మీరు త్వరపడుతున్నారా?"

"ఔను"

"కాదు."

మురళి ఆ జవాబుకి నవ్వి "నేను త్వరపడ్డా పడకున్నా మా తాతయ్య ఊరుకోడు. పెళ్ళికొడుకుని చేసి ఈ సిగ్గుల పెళ్ళి కూతురితో సహా ఆ 'ముత్యాలపల్లకీ' ఎక్కించేవరకూ ఆయనకి శాంతి ఉండదు. అప్పటివరకూ ఆయన నిశ్చింతగా నిద్రపోడు." ఇలా ఇంతా చెప్పుకుపోతూన్న మురళి వాక్ ప్రవాహానికి అడ్డు కట్ట వేస్తూ నీరజ "ముత్యాలపల్లకా....మీరు....ఎక్కాలా" అంది ఆశ్చర్యంగా చూస్తూ.

"నేనేకాదు నన్ను పెళ్లాడే నువ్వుకూడా."

"ఛీ .. సిగ్గెయ్యదూ! ముత్యాలపల్లకీ ఎక్కటానికి మీరేం చిన్న అబ్బాయిలా"

"చిన్నవాడినైనా కాకున్నా తప్పదు. నీరజా నీకే కాదు. నాకూ ఆ పల్లకీ ఎక్కాలి అన్న ఆలోచన రాగానే నిజంగా సిగ్గుగానే అన్పిస్తుంది. అయితే ఆ పల్లకీకి నాకూ పెద్ద సంబంధం ముడిపడి ఉంది. అంటూ తాతగారి విషయం అంతా చెప్పి తనమీద తాతగారి ఆశలు ఎన్ని ఉన్నాయో చెప్పి 'ముత్యాల పల్లకీ ఎక్కక తప్పదు' అని గట్టిగా చెప్పేసరికి నీరజ ముఖం సిగ్గుతో ఎరుపురంగు పులుముకుంది. అలా సిగ్గుతో మొగ్గలా ఉన్న నీరజ గడ్డం పట్టుకుని ప్రేమగా పైకిఎత్తి "ఆ పల్లకి ఎంత అందంగా ఉంటుందో నీకు తెలుసా!" అన్నాడు ఆమె కళ్ళ ల్లోకి చూస్తూ.

"ఊహు"

"నేను చూపిస్తాను వస్తావా?"

"ఎప్పుడు?"

"ఇప్పుడే...."

"ఎలా?"

"నా స్కూటర్ మీద తీసుకు వెడతాను. ఆ పల్లకీ చూపించి మళ్ళీతీసుకొచ్చి మీఇంటిదగ్గర వదిలేస్తాను. వస్తావా?"

"అమ్మయ్యో! భయం బాబూ!"

"భయమా! ఎందుకు?"

"తెలియదు" అంటూన్న నీరజని మరీదగ్గరగా లాక్కుని కుడిచేతిని. ఆ చేతికున్న రంగురంగుల గాజులని ప్రేమగా ఇటూ అటూ కదిలిస్తూంటే వేలికున్న దానిమ్మ గింజ రంగు రాయి ఉన్న ఉంగరం కన్పించింది. దాన్నే యిటూ అటూ తిప్పి చూశాడు. నీరజ వళ్ళంతా ఏదోలా అయిపోతోంది. ఆ ఉంగరాన్ని తీసి గుప్పెట్లో పట్టుకుంది. మురళి ఆ గుప్పెడు విప్పి ఉంగరాన్ని తీసుకుని తనవేలికి పెట్టుకుని తన చిటికెన వేలిన ఉన్న నీలంరాయి ఉంగరాన్ని నీరజ వేలికి తొడిగే శాడు. నీరజ బొమ్మలా కూర్చుంది.

నీరజా, ఒక విషయం చెప్పనా. మన మనసులు కలి శాయి. ఒకర్ని ఒకరం కావాలనుకుంటున్నాం. నిజమే! కాని పెళ్ళికి మాత్రం కాస్త టైముకావాలి నీరజా. ఈలోపల సర్దుకో వల్సిన పనులు కొన్ని ఉన్నాయి. ఈ విషయం మీ తాతయ్యకి చెప్పి వప్పించగలవా!"

"ఎందుకు? ఏం పనులవి?" మురళి పన్రవేలిన ఉంచిన ఉంగరాన్నే తదేకంగా చూసుకుంటూ అంది.

అవన్నీ ఇప్పుడు చెప్పాలంటే కష్టం. తర్వాత చెపుతానుగా.

"అవన్నీ కాక నాకు ట్రైనింగ్ ఆర్డర్స్ వచ్చాయి వెళ్ళిపోవాలి త్వరలోనే."

"ఎప్పుడు? నా కింతవరకూ చెప్పలేదేం" మూంగమూతి పెట్టింది.

"నువ్వు చెప్పనీయందే" అంటూ ఆర్డర్ కాయితం ఇచ్చాడు. అది చదివిన నీరజ ముఖం వెయ్యికాండిల్సు బల్బులా కాంతితో వెలిగిపోతోంది.

"కంగ్రాచ్యులేషన్స్" సంతోషాన్ని నొక్కిపట్టుకుంటూ.

"థాంక్స్" అన్నాడు కొంటెగా చూస్తూ.

"ఉండండి స్వీటుతెస్తాను" మురళి వారిస్తున్నా లోపలికి పరుగు తీసింది.

మురళి వాచ్ చూసుకుని అప్పుడే నేనిక్కడికివచ్చి రెండు గంటలు దాటిపోయిందా"అనుకుంటూ లేచాడు. నీరజ ఓ మైసూర్ పాక్ ముక్క తెచ్చి నోరు తెరవమని నోటికి అందించింది.

"వూ! మరి వెళ్ళివస్తాను."

"ఎల్లుండి ఆదివారం కదూ మీరు భోజనానికి రావాలి. నేను సరిగ్గా పదకొండింటినించీ ఎదురుచూస్తూ ఉంటాను. భోజనం తర్వాత ఏదయినా మాట్నీకి పోదాం. ఈ లోపల తాతయ్య

మూడ్ చూసి మీరు చెప్పమన్న విషయం చెప్పి ఒప్పించటానికి ప్రయత్నిస్తాను. కాని ట్రైనింగ్ అయి తిరిగిరావటానికి చాలా నెలలే పడుతుంది కదూ! అన్నాళ్ళు ..."

"ఉండలేవా!"

"........"

"నీరజా ఎన్నాళ్ళక్రితం నీవెవరో నేనెవరో.... కానీ ఇప్పుడు ఆలోచిస్తుంటే మనిద్దరిదీ ఎన్ని జన్మల సంబంధమో అనిపిస్తోంది నాకు. మరి నీకు?"

"నాకూ అంతే!"

"స్వయం శక్తితో మాట్లాడలేవా?"

"గలను. కాని ఇప్పుడు సంతోషంతో మాటలు కరువౌతున్నాయి."

"అంతేకదా!"

"అంటేమరి ఎల్లుండి ఇప్పుడే వస్తారుకదూ!"

"అలాగే....అదంతా సరే నువ్వు నాతో మ్యాట్నీకి వస్తావా?"

"యస్!"

"సిగ్గు వెయ్యదూ! భయం అనిపించదూ."

"ఉహూ" అంటూ నవ్వింది నీరజ.

"సరే వస్తాను. గుడ్ నైట్"

"మర్చిపోకుండా రావాలి" అంటూ మరోసారి గుర్తుచేసి చెయ్యి ఊపుతూనేవుంది నీరజ.

మురళి ఇంటికి దగ్గరగా వస్తున్నకొద్దీ అంతక్రితం ఉన్న

సంతోషపు పొంగు తగ్గిపోయింది. ఏమిటీ రోజు నీరజతో ఎన్నడూ లేనంత చనువు తీసుకుని ఎలా మాట్లాడగలిగాను.... తనలో తనే ఆశ్చర్యపోతున్నాడు.

చలపతిరావుగారి అంగీకారం తెల్పుతూ తాతయ్యకి రాసిన ఉత్తరం దానికి తాతయ్య ఇచ్చిన జవాబూ కారణం కావచ్చు. నాలుగురోజుల క్రితం వరకూ దూరదూరంగా ఉన్నట్లు మాట్లాడే ఇద్దరూ ఒక్కరోజులో ఇంత కల్సిపోవటం చాలా ఆశ్చర్యమే వేస్తోంది. కాని ఇందులో ఆశ్చర్యం లేదు. లోలోపల ఉన్న భావాలు అడ్డుకట్టలను తెంచుకుని ఏకమైనాయి అంతే. అన్నిసరే ఈ పెళ్ళికి తాతయ్య ఆమోదం తెల్పినా నాన్నగారూ, అమ్మా ఒప్పుకుంటారా! అమ్మకి నీరజ నచ్చిందనే విషయం నీరజ తన ఇంటికి వచ్చినరోజునే గ్రహించాడు. అయితే నాన్న విషయమో! అసలా కాపురం చక్కబడితేగాని తను పెళ్ళి చేసుకోలేడు ఈ విషయం నీరజకి ఇప్పుడే చెప్పివుంటే బాగుండేది. పోనివ్వు ఊరికి వెళ్ళేలోపల వీలుచూసుకుని చెప్పేసేయాలి అనుకుంటుండగానే ఇల్లు దగ్గరైంది. మురళి ఆలోచనలు కట్టిపెట్టి స్కూటర్ లోపల పెడుతూండగా వాకిట్లో రిక్షా ఆగటం—అందులోనించి తల్లిదండ్రీ దిగటం చూసి "ఎక్కడికి వెళ్ళారు ఇద్దరూ" అనుకుంటూ తన గదిలోనికి వెళ్ళిపోయాడు.

అనూరాధ ఆ గదిలో మంచంమీద పడుకుని ఉంది. తల్లి దండ్రీ ఇంట్లోకి వచ్చి నిశ్శబ్దంగా కూర్చున్నారు.

అత్తయ్యా వాళ్ళింటికి వెళ్ళలేదుగదా! అక్కడేమైనా జరిగిందా! ఏమో! ఛీ నేనెంత బుద్ధితక్కువగా ప్రవర్తించాను. ఇంటికి వచ్చేయవలసింది. ఊరంతా తిరిగి తిరిగి.... ఇప్పటికి

ఇల్లు చేరాను. తనమీద తనకే విసుగుకలిగింది మురళికి. గదిలో నించి బైటకి రావాలంటేనే అదోలా అన్పిస్తోంది. అనూరాధని పలకరించాలన్నా మనస్సు ఒప్పటంలేదు. తాతయ్య ఉపకారంగా చేయబోయిన ఈ పెళ్ళి ఎందరి మనస్తాపానికి కారణమైందో ఆలోచిస్తూంటే చాలా కోపమే వస్తోంది. ఆయనకి అనూమీద ఉన్న అతిప్రేమ అలా చేయించిందని మురళి గ్రహించాడు. కాని పెళ్ళితర్వాత జరిగినవిషయాలే వ్యాధాకరంగాపరిణమిస్తున్నాయి. ఈ చిక్కుముడిని విప్పటం ఎలాగో తెలియటంలేదు. విప్పటానికి ప్రయత్నించినకొద్దీ మరీ బిగుసుకుపోయేలా ఉంది.

ఆలోచనల్లో తేలిపోతున్న మురళిని ఓ గంట పోయిన తర్వాత తల్లి భోజనానికి పిలిచింది. భోజనం చేయబోతూ తన ట్రైనింగ్ ఆర్డరు వాయితం తల్లికి అందించి విషయం చెప్పి త్వరలోనే వెళ్ళాలని స్పష్టంగా చెప్పాడు.

అన్నపూర్ణమ్మ ముఖంలో అరక్షణం సంతోషపు ఛాయలు కన్పించి అంతలోనే మాయమైనాయి. భర్తదగ్గరికి వెళ్ళిచెప్పింది.

నారాయణరావు ఏమన్నది మురళికి విన్పించలేదు. ఎంత సంతోషమైనవార్త! కాని ఇప్పుడు అందటంవల్ల ఎవరికీ సంతృప్తిగా లేదు.

"అనూ భోజనం చేద్దాంలే" అంటూ చెయ్యిపట్టుకుని లేప దీసి భుజంమీద చెయ్యివేసి వంటగదిలోకి తీసుకువెళ్ళాడు. అనూరాధ తలవంచుకుని ఎలాగో రెండుముద్దలుమింగి చెయ్యి కడిగేసి లేచింది.

## 26

మురళికి ఇంట్లో ఉండాలంటే 'బోర్'గా ఉంది. గిరిధర్ పూర్తిగా వెళ్ళిపోయినట్లూ, రాజేశ్వరమ్మ అనూరాధ విషయం తనదేం బాధ్యతలేనట్లూ చెప్పిందని తల్లి చెప్పటంతో మరీ తల తిరిగిపోతోంది మురళికి. "గిరిధర్‌ని ఈరోజు కలుసుకుందాం. మాట్లాడదాం. మెల్లగా నచ్చచెప్తాం" అనుకున్న ఆలోచనలు గాలికి కొట్టుకుపోయాయి గిరిధర్ వెళ్ళిపోయాడనే వార్తతో. కావాలని పెళ్ళిచేసుకుని ఇలా వదిలి వెళ్ళటం ఏం సంస్కార లక్షణం. నామీద కోపం అనూమీద చూపటం బాధపెట్టటం ఏం ధర్మం. ఈ సమస్యకి పరిష్కారం ఎలా ఎలా!

ఆలోచించి, ఆలోచించి మురళి తల వేడెక్కిపోయింది. సాయంకాలం ఆరుగంటలు కావస్తూండగా పార్కుకివెళ్ళి కూర్చు న్నాడు. ఎవ్వరూ లేనిచోటు చూసుకుని. తలనొప్పి పగిలిపో తోంది. 'నా దారిన నేను వెళ్ళిపోతే అనూ భవిష్యత్తు ఏంకాను?'

ఉపాయం తట్టకపోగా తలనొప్పి మరీ ఎక్కువైంది. అది భరించలేక పచ్చగడిలో పడుకున్నాడు రెండు చేతులతోనూ ముఖాన్ని కప్పుకుని. మురళి పడుకున్నచోటుకి చాలా దగ్గరగా ఓ గుబురైన చెట్టుక్రింద సిమెంటుబెంచీమీద కూర్చుని గొంతులు తగ్గించి ఏదో రహస్యంగా మాట్లాడే మాటలు వినిపిస్తున్నాయి. మురళి మొదట వాటిని పట్టించుకోలేదు. కాని ఆ అమ్మాయి గొంతు ఇందిరదని గుర్తించి సర్వేంద్రియాలు చెవిచేసి వింటు

న్నాడు. ఇందిరకి ఇలా రహస్యంగా మాట్లాడే విషయాలేం ఉంటాయి అనే అనుమానం పీకుతోంది ఒకవైపు. వాళ్ళ గొంతులు వినిపిస్తున్నాయి.

"రెల్లవారుఝామున నాలుగింటికే స్టేష...ను....కి.... అక్కడ ...కల్సు....కుందాం."

అమ్మయ్యో" భయంగా పల్కిందని ఇందిర గొంతు.

"ఏం....భ ర్లేదు....నేనక్కడ.... ఉంటాను.... రెడీ.... క్విక్...." మగగొంతు ధైర్యాన్ని నూరిపోస్తోంది.

"కాదు....ముందు ...పెళ్ళి....తర్వాత....ప్ర...."

"ఇక్కడకాదు....రెండూ....మద్రాసులోనే"

ఇంకా ఇంకా ఏవేవో విన్పిస్తూంటే మురళి లేచి కూర్చు న్నాడు. వాళ్ళమాటలు అన్నీ కూర్చుకుని చూసుకునేసరికి అర్థమై ఆవేశం పొంగుకొచ్చింది. అప్పుడే అక్కడే వాడిని పట్టుకుని బాదేయాలనిపించే ఆవేశాన్ని నిగ్రహించుకుంటూ మళ్ళీ వాళ్ళ మాటలన్నీ పూర్తిగా విన్నాడు. వీడు ఎవరు....ఆరోజు ఇందిర్ని స్కూటర్మీద తీసుకువెళ్ళిన వాడేనా.... అవు.... వీడికి పెళ్ళి అయినట్లు, ఫారిన్లో కాపురం చేస్తున్నట్లూ ఓఫ్రెండ్ చెప్పటం గుర్తొచ్చింది. చిరాయిన వేదాకు మురళి. అప్పటికే ఇందిరా అతనూ మెల్లగా అక్కడనించి వెళ్ళిపోతూంటే ఆలోచిస్తూ నిల్చి పోయాడు మురళి. ఇప్పుడు వాడిముఖం బాగా గుర్తుపట్ట గలి గాడు. వాడిపేరు సతీష్ అన్నదికూడా గుర్తుకొచ్చింది.

మురళి మేధస్సు తీవ్రంగా పనిచేస్తోంది. అర్ధగంట ఇటూ అటూ పచార్లు చేశాడు. చివరికి ఓ నిశ్చయానికి వచ్చి స్కూటర్ తీసుకుని తన ఫ్రెండ్ని ఒకతన్ని కల్సుకుని, ఏదో రహస్యంగా చర్చించి, తిరిగి తిరిగి ఇల్లు చేరేసరికి రాత్రి పదిగంటలైంది. భోజనం సయించలేదు.

కంటికి నిద్దరావటంలేదు. గదిలో ఇటూ అటూ పచార్లు చేస్తూన్న అన్నగారి అశాంతి నిండిన ముఖాన్ని గమనిస్తూన్న అహారాణ "అన్నయ్యా!" అంది మెల్లగా.

"ఏమ్మా ఇంకా నిద్రపోలేదూ!" అంటూ దగ్గరగా వచ్చాడు.

"నీవివాళ ఎందుకంత అశాంతిగా ఉన్నావు.... ఇంతా నా విషయమే ఆలోచించి నీ మనసు పాడుచేసుకుంటూన్నావా! నీవేం దిగులు పడకన్నయ్యా! బావది చాలా మెత్తటి మనస్సు. నన్ను వదిలేసెయ్యడు. ఆ నమ్మకం నాకుంది. ఒకవేళ అలాకాకున్నా నేను స్థయిర్యంగా నిలబడగలను. ఎలాగూ డిగ్రీ ఉందిగా. ఏదో ఒకటి ఉద్యోగం చూసుకుంటాను. నా కాళ్ళమీద నేను నిలబడ తాను. అనవసరంగా నువ్వూ, నాన్నారూ, అమ్మా ఇలా బాధ పడకండన్నయ్యా. నీవెలాగో రెండురోజుల్లో వెళ్ళిపోవాలి. ఎన్నాళ్ళకోగాని తిరిగిరావు మళ్ళీ. ఈ రెండురోజులూ సంతో షంగా ఉండన్నయ్యా. అమ్మకీ, నాన్నారికీ నువ్వు ధైర్యం చెప్పవూ."

మురళి చెల్లెలిని చూస్తూ ఆమె చెప్పే మాటలు వింటూ ఆశ్చర్యపోయాడు. నిన్న మొన్నటివరకూ అమాయకంగా

కన్పించే అనూరాధ ఎంతలో ఎంతిగా ఎదిగిపోయి నాకే ధైర్యం చెప్తోంది. ఒకవిధంగా ఆడపిల్లకీ ధైర్యం ఉండటం చాలా అవసరమే అనుకుని తృప్తిగా నిట్టూర్చి పేలవంగా నవ్వి—

"అలాగేనమ్మా! నువ్వు చెప్పినట్లే చేస్తాను. అనూ గడియారానికి సరిగ్గా మూడుగంటలకి అలారం పెట్టాను. నాకు అసలు నిద్రరావటం లేదనుకో. ఒకవేళ మెలకువ రాకపోతే నీవన్నా నన్ను లేపాలి. చాలా అర్జెంట్ పనివుంది. చాలా హుషారుగా ఉండాలి. అనూ నన్ను లేపుతావుగా."

"అలాగే. అది సరేగాని అంత అర్జెంట్ ఏమిటన్నయ్యా"

చాలారోజుల తర్వాత ఇద్దరూ అరమరికలు లేకుండా మాట్లాడుకున్నారీవేళ. మురళి మనస్సులో ఎంత ఆందోళనగా ఉన్నా అనూ ఇలా హాయిగా మాట్లాడుతుంటే ఎంతో తృప్తిగా సంతోషంగా ఉంది.

అనూకి లేపే బాధ్యత వేసేసి నిశ్చింతగా పడుకుని నిద్రపోవటానికి ప్రయత్నిస్తున్నాడు. కాని రాత్రి రెండుగంటల వరకూ నిద్రరాలేదు. అయితే అనూరాధ మాటిమాటికీ కళ్ళుతెరిచి గడియారం చూస్తున్నదన్న సంగతి మురళికి తెలియదు. కాస్త నిద్రపట్టింది. అలా ఎంతసేపు నిద్రపట్టిందో తెలియదు. కానీ చెల్లెలు 'అన్నయ్యా' అని తట్టి లేపటంవల్ల మురళి ఉలిక్కిపడి లేచాడు. ఇంకా మూడుగంటలు కాలేదు. అనూరాధ ముఖం వాడిపోయిఉంది. కళ్ళుఎర్రగా జ్యోతుల్లా కనిపిస్తే అనూ నువ్వసలు నిద్రపోలేదూ' అన్నాడు గబగబా బట్టలు మార్చుకుని తలకి మఫ్లర్ గట్టిగా చుట్టుకుంటూ.

"నిద్ర పట్టలేదు. మరి అమ్మ నీ వెక్కడికి వెళ్ళావని అడిగితే...."

"ఓ స్నేహితుడిని రైలెక్కించటానికి అని చెప్పు. అనూ స్కూటర్ తీసుకువెడుతున్నా వాకిలి తలుపులు వేసేసుకో. నేను తిరిగి ఏ టైముకి వస్తానో తెలియదు. కానీ కంగారుపడకు" అంటూనే స్కూటర్ స్టార్ట్ చేసి వాచీ చూసుకుంటూ.

'పొద్దునా అలారం పెట్టినా కొట్టలేదేం?"

"ఉదయంగో ఇప్పుడు మ్రోగుతోంది" అలారం మోత దగ్గరగా వినిపిస్తోంది. అబ్బ అనూ త్వరగా గేటు వేసేసుకుని ఆ అలారం నొక్కేసెయ్యి. పెద్ద గడియారం.'

సీదాగా వెళ్ళిపోయాడు మురళి. అన్నగారి ప్రవర్తన అర్థం కావటంలేదు. కారణం చెప్పలేదు. ఇప్పుడు ఎందుకు ఎక్కడికి వెళ్ళినట్లు స్నేహితుడిని రైలెక్కించటానికే అయితే అశాంతి ఎందుకు?

పరి పరివిధాల ఆలోచిస్తూ లోపలికి వస్తుండగానే నారాయణరావు లేచి కూతుర్ని ఏమిటమ్మా అని అడిగాడు. 'ఏంలేదు నాన్నారూ' అను అన్నగారు స్టేషనుకి వెళ్ళివస్తానన్నాడని చెప్పి గదిలోకి వెళ్ళి పడుకుంది.

## 27

వీధిలైట్లు ఆరిపోయాయి. రోడంతా చీకటి. ఇంకా ఎవ్వరూ నిద్ర లేవలేదు. గస్తీ పోలీసులు ఆఖరురౌండు తిరుగుతున్నారు మురళీ స్కూటర్ స్పీడుతగ్గించి మేనత్త రాజేశ్వరమ్మగారి ఇంటి రోడుచివర ఆగిపోయాడు. రాజేశ్వరమ్మ ఇంట్లో లైట్లేం వెలగటంలేదు. కళ్ళు పెగుల్చుకు చూసినా ఏమీ కన్పించటంలేదు. మురళీ మెల్లగా ఇంకాస్త దగ్గరిగావచ్చి ఆపుకున్నాడు. "నే పొరబడలేదు కదా! మూడింటికి బయలుదేరతానని ఇందిర చెప్పటం సరిగ్గా వినిపించిందే. ఒకవేళ ముందుగానే వెళ్ళిపోయిందా! రైలుకీ చాలా టైము ఉంది. ఆలోచిస్తూ అలా నిరీక్షిస్తున్నాడు మురళీ. ముందు తెల్సుకున్నా ఇందిరని పోనిస్తే ఇంక జీవితాంతం బాధపడాలి. ఏం చెయ్యటం....ఆవేదన పడిపోతున్నాడు మురళీ. ఇంతలో రాజేశ్వరమ్మగారి ఇంటి ప్రహరీగేటు తెరుచుకుంది. మురళీ ఊపిరిబిగపట్టి చూస్తున్నాడు.

ఇందిర చేతిలో లెదర్ సూట్‌కేస్‌తో చకచకా నడుస్తూ చుట్టూ పరీక్షగాచూసుకుని ముందుకు సాగిపోతూ క్రీనీడలో ఆగివున్న స్కూటర్నీ దానిమీద కూర్చున్న వ్యక్తినీ దగ్గరికి వచ్చే వరకూ గుర్తించలేక ఎవరా! అన్నట్లుచూసి తిరిగి మరో రోడ్డు వైపుకి వెళ్ళిపోదామా అని క్షణం ఆలోచించి మళ్ళీ ధైర్యంగా అడుగులువేస్తూ 'ఎవరో! ఎవరికోసం నిరీక్షిస్తున్నారో! అనుకుని

తృళ్ళి పడబోతూ కొంపదీసి ఏ రౌడీ వెంపన్నాడేమో గదా అనే ఆలోచన వచ్చేసరికి భయంముంచుకొచ్చి కాళ్ళు వణకటం మొదలెట్టాయి. వళ్ళంతా చెమట పట్టేస్తున్నా ధైర్యాన్ని కూడ కట్టుకుంటూ చరచరా అడుగులు వేస్తూ మురళిని దాటిపోయింది. తలకి నల్లటి మఫ్లర్ చుట్టుకుని ఉండటంతో గుర్తించలేని ఇందిర 'అమ్మయ్య' చాలాదూరం వచ్చాను అనుకుని ఆగింది. ఆటో గానీ ఏం దొరికేలా లేదే అనుకుంటూ గబగబా నడుస్తూ సూట్‌కేస్ కుడిచేతిలోనించి ఎడంచేతిలోకి మార్చుకుంటూండగా వెనకనుంచి స్కూటర్ శబ్దంతోపాటు లైటుకూడాపడి తన ఉనికిని బట్టబయలు చేస్తోంది. ఎటుప్రక్కకి తప్పుకోవాలన్నా సాధ్యంగాని ఇందిర ఆగిపోయింది. అప్పటికి ఇల్లుదాటి దాదాపు మైలుదూరం వచ్చేసింది.

స్కూటర్ స్లోగావచ్చి ఇందిర ప్రక్కగా ఆగింది.

"హల్లో మరదలుపిల్లా గుడ్‌మార్నింగ్" మురళి దిగేసి దగ్గరగా వస్తూ అన్నాడు. ఇందిర ప్రాణం పైనే పోయినట్లయింది. పెదవులు తడారిపోతున్నాయి. మాటే రావటం లేదు. మురళి.... పాపరే.... మురళి.... ఇప్పుడుఇక్కడ ఈ టైములో.... కన్పిస్తాడని కలలోకూడా అనుకోలేదు. ప్రక్కన పిడుగు పడినంత భయపెట్టింది "హల్లో మరదలు పిల్లా అన్నమాట." తను లేచి ఇల్లు దాటేప్పుడు తండ్రి ఎలాగూ చూళ్ళేదు, అన్నగారు అసలే లేడు. ఇంక తల్లి, అక్కగారూ చూడకుండా తెలివిగా బైటపడ్డాను ఇంకేం ఫర్వాలేదు అని ధైర్యంగా నడుస్తున్న ఇందిర మురళిని చూడగానే హడలిపోయింది.

"ఏం మాటలురావా....లేక సమయం కాని సమయంలో ఊడిపడానని చిరాకుగా ఉందా" మరీ దగరగా వసూ అడిగాడు.

పాపం రిక్షాగాని, ఆటోగాని దొరకవేదులా ఉంది. నీకు అభ్యంతరం లేకుంటే నా స్కూటర్ మీద తీసుకువెడతాను. కమాన్....ఆ పెట్టె....ఇవ్వు. ఇలా....పూ...."

"అక్కర్లేదు" పెట్టె గట్టిగా పట్టుకుంటూ అంది ఎలాగో గొంతు పెగుల్చుకుంటూ.

"అయితే సరే నేపోనా! అయినా ఆ పెట్టెలో....ఖరీదైన నగలూ, బట్టలూ ఉన్నాయనేది నాకేరాదు- నీ వాలకం చూసిన ఎవరికైనా తెలుస్తుంది. ఈ రోజుల్లో పరాయివాడికంటే అయిన వాడిని నమ్మటం మేలు. ఎందుకంటే అడ్రెస్ అయినా నీకు తెలుస్తుంది కనుక. ఏం ...ఒక్కనిమిషం ఆలోచిస్తాను. నాకింకా చాలా ముఖ్యమైన పనివుంది వెళ్ళిపోవాలి."

"వెళ్ళిపో...."

"సరే....వెడుతూ వెడుతూ అడుగో బీట్‌కానిస్టేబిల్ ఆ లాంతరు స్తంభం దగ్గర కునికిపాట్లు పడుతున్నాడు. లేపి మరీ చెప్పి వెడతాను. వయస్సులోవున్న ఆడపిల్ల పట్టినే కాదు డబ్బు, నగలపెట్టెతో సహా ప్రయాణమైపోతోంది అని! నాకు శ్రమ లేకుండా అతనే నిన్ను జాగ్రత్తగా చూసుకుంటాడు. ఏం చెప్పమంటావా!"

"మురళీ...."

"యస్ ...నువ్వు నా వెనక స్కూటర్ మీద కూర్చుంటే ఆ పోలీసు ప్రమేయం లేకుండా నిరపాయంగా నీ వెక్కడికి రావాలంటే అక్కడికి చేరుస్తాను. లేదా ...నీ ఇష్టం...."

"నే ఎక్కడికి వెడుతున్నానో నీకేంతెల్సు. పెద్ద తెలిసినట్లు మాట్లాడుతున్నావ్" కోపాన్ని మింగుకుంటూ అంది.

"నీ వెక్కడికి వెళ్ళినా నాకు అవుసరంలేదు. అయితే నిరపాయంగా చేరుద్దామనే సదుద్దేశ్యంతోనే నేనీచీకట్లో ఇంత శ్రమపడి వచ్చాను. ఈ రావటంలోకూడా నాస్వార్థం ఉంది అని నేను ఒప్పుకుంటాను. 'నువ్వు రైనొక్లియర్'చేస్తే నా ప్రేమవివాహం నిరాటంకంగా జరిగిపోతుందనే ఆశ అంతే...."

అతి మామూలుగా ముఖంపెట్టి అంటున్న మురళి మాటలని నమ్మాలో, అక్కరలేదో అని ఆలోచిస్తోంది ఇందిర. బీటు కానిస్టేబుల్ కి ఏం నిద్రాభంగం అయిందో లేచి కర్రవూపుకుంటూ చీకట్లో మెల్లగా మాట్లాడే వీళ్ళని అనుమానంగా చూస్తూ దగ్గర కొచ్చి "ఏయ్ ఎవరు మీరు...." అంటూ దబాయించినట్లు అడిగాడు. మురళి క్షణం మాట్లాడలేదు ఇందిర ముఖంలోకి చూస్తూ. ఇందిరలో ఇంకా వణుకు ఎక్కువైంది. పోలీసుకి అనుమానం ఇంకా ఎక్కువైంది. మరీదగ్గరకొచ్చాడు టార్చిఫోకస్ చేస్తూ.

'ఏం చెప్పేయ్యనా' అన్నట్లు చూశాడు మురళి. ఇందిర భయంతో మురళికి మరీ దగ్గరకొచ్చింది. మురళి ఇందిర చేతిలోని పెట్టె అందుకున్నాడు బలవంతంగానే. 'వెనక కూర్చో' ఆజ్ఞాపించినట్లు అని సూట్ కేస్ ముందు పెట్టుకుని స్కూటర్ స్టార్టు చేస్తూ—

"ఏంలేదు. స్కూటర్ కాస్త మొండికేసింది అంతే.... దారిలో రాస్తుందిలే ఈ అమ్మాయి మరెవరో కాదయ్యా బాబూ...." అంటూ ఇందిరని ఎక్కించుకుని స్పీడుగా వెళ్ళి పోతున్నాడు మురళి. పోలీసుకి మనస్సులోనే ధన్యవాదాలు తెల్పుకుంటూ. కాస్తదూరం పోగానే ఇందిర ఇంక ఆపమని గొడవచేస్తోంది.

"ఏయ్ ...మాట్లాడావంటే పోలీస్‌స్టేషను దగ్గరే దింపు తాను. గమ్మచిప్పగాకూర్చొ మర్యాదగా కూర్చుంటే రైల్వేస్టేష నుకి చేరుస్తాను. ఎంతచెడ్డా నేను నీ బావని. నీ కష్టసుఖాల్లో, సుఖ సంతోషాల్లో పాల్గొననీయి ఏం...."

ఇందిర మాట్లాడకుండా అసలు మురళి ఎటు తీసుకువెడు తున్నాడో అని చుట్టూ చూస్తోంది. ఈ వాద వివాదాల్లో తను గుర్తించలేదు కానీ మురళి ఏదో కొత్త దార్లగుండా పోనిస్తు న్నాడు స్కూటర్ని. ఇందిర చూకేస్తా అంటూ బెదిరిస్తోంది. మురళి చైటకి ఇందిరని దబాయిస్తున్నాడే కానీ మూర్ఖురాలు నిజంగా దూకితే ఎంత ప్రమాదమో ఆలోచించదు అనుకున్నా పైకి గంభీరంగా వచ్చేశాం ఇందిరా! ఇది రైల్వేస్టేషనుకి దగ్గర దారి. అదిగో కాస్త దూరంలోనే ఉంది. ఇంకాస్తపోతే స్టేషను లోని రైళ్లు కన్పిస్తాయి అంటూనే ఇటూఅటూ తిప్పి అతిసామా న్యులు ఉండే ఓ పాతబస్తీలోకి తీసుకువెళ్లాడు. ఓ ఇంటిముందు ఆపాడు. ఆ ఇంటి తలుపు తెరిచివుంది.

మురళి స్కూటర్ దిగి ఇందిరని ఒకచేత్తోనూ, సూట్ కేస్ని ఓ చేత్తోనూపట్టుకుని లాక్కుపోబోతూంటే ఇందిరలోపలికి రానని చెయ్యిని గుంజుకుంటోంది. తలుపులు వార్లా తెరిచారు ఎవరో. లోపల ఫ్రంట్ రూమ్లో పడానికి ఎయిర్ బాగ్ లో ప్రయాణానికి సంసిద్ధుడై పెల్లగాఇల్లువాటి బైటపడబోయే సమయంలో భార్య లేపటమేకాక మామగార్ని కూడా లేపి చెప్పింది. సతీష్ తండ్రికి ఆ క్రితంరోజునే మురళి కబురు పంపటంవల్ల సమయానికి కొడుకుని పట్టుకుని నిలదీస్తున్నాడు "భార్యా, ఇద్దరుపిల్లలూ ఉన్న నీకు ఇదేం పోయేకాలంరా" అని తిడుతూ చెంపలు వాయించేస్తున్న సమయంలో ఇందిరని తీసుకొచ్చి చూపిస్తూ "ఇందిరా! అడుగో నీ ప్రియుడు. అతని భార్యా పిల్లలిద్దరూ, తల్లీ తండ్రీ చూడు ...సరిగ్గా కళ్ళుపెట్టుకుని చూడు....ఇదిగో ఇందిరా .. ఈ సతీష్కి కావాల్సిన ఇందరున్నారు. అదిగో అమాయకురాలైన అతని భార్య ఎలా కుమిలికుమిలి ఏడుస్తోందో చూశావా! ఆ తల్లి ఈ పుత్రరత్నాన్ని కన్నందుకు సిగ్గుతో ఎలా తలవంచేసుకుందో చూడు ఇందిరా! ఇప్పుడుచెప్పు. ఈసతీష్ రూపం....మాటలూ, నటనా చూసి కదూ నువ్వు ప్రేమించింది. ఆ 'అందం' వెనక ఉన్న గుణం చూడు. ఆడపిల్లలని ఆటబొమ్మలనిచేసి తనవెంట త్రిప్పుకునే ఈ సతీష్ అందం త్రాచుపాము అందం....ఈత్రాచు ఎందరినో కాటేసింది. అందుకే ఈ అందం ఈ రోజుతో అంతం కావాలి. కానీ మనిషికి 'శిక్ష' మరోమనిషికాదు వెయ్యవల్సింది.

క్షణక్షణం అంతరాత్మ ఇస్తుంది....సరే అవన్నీ....ఇప్పుడు మా అందరి ఎదుటినించీ నువ్వూ శ్రీసతీష్ వెళ్ళిపొండి....కావాలంటే సంతోషిస్తాను. చీకట్లో ఎవ్వరూ చూడకుండా పారిపోయి బ్రతకటం మీలాంటి సంస్కారివంతుల లక్షణం కాదు. సతీష్.... ఇదిగో ఇందిర ఒకప్పటి కాదు. షుమారు పదివేలు ఖరీదుచేసే బంగారం వగైరాతో బాటు నీ దగ్గరికి వచ్చింది. మా అందరి ముందునించీ తీసుకువెళ్ళు....ఏం తీసుకువెళ్ళగలవా! అటు నీ అర్ధాంగి, తల్లిదండ్రులూ ఇటు ఇందిరకి బాపన్న నేను ఉన్నాం....వెళ్ళండి....ఏం ఒక్క అడుగుకూడా ముందుకు పడదేం....ఏం ఇందిరా జవాబు చెప్పవేం....ఇప్పుడు చెప్పండి మీ ప్రేమపాఠాలు ...చెప్పరేవా.... మాటలు రావటంలేదా, ఈ సతీష్‌కి పెళ్ళి అయిందని, పిల్లలున్నారని నీకు తెల్సి వుండదు. తెల్సుకోవల్సిన అవసరం లేదు. ప్రేమించేయటం మాత్రమే మీకు తెల్సు. అంతేకదా. 'నా డ్యూటీ అయిపోయింది.... నేనింక వెళ్ళిపోతున్నాను."

అంటున్న మురళివేపు ఆశ్చర్యంగా చూస్తూ శిలావిగ్రహంలా చూస్తోంది ఇందిర. సతీష్‌కి పెళ్ళి అయిందా! పిల్లలున్నారా! నోటమాట రావటంలేదు. అతని భార్యనీ, తల్లిదండ్రులనీ మార్చి మార్చి చూస్తూ గోడనివున్న సతీష్ పెళ్ళిఫోటో మీద పడింది ఇందిర దృష్టి. అలాగే నిల్చిపోయిన ఇందిరకి, మురళి 'వెళ్ళిపోతున్నా' అనేసరికి ఉలిక్కిపడి చప్పున మురళి చెయ్యి గట్టిగా పట్టుకుని—

"బావా!" అంది. 'ఏం' అన్నట్లు చూశాడు మురళి.

'బావా!' ఒక్క క్షణం ఉండు వస్తాను నేనుకూడా" అంటూ చేతినున్న గాజుని బలవంతంగా పగులగొట్టి ఓ ముక్క తీసుకుని చకచకా సతీష్ దగ్గరికి వెళ్ళింది. సతీష్ బిక్కచచ్చి పోయినట్లు చూస్తున్నాడు. ఇందిర గాజుముక్కతో సతీష్ బుగ్గమీద గట్టిగా గీసేస్తూంటే సతీష్ 'అబ్బా' అంటూ ఇందిర చెయ్యిజీట్టుకుని దూరంగా తోస్తుంటే సతీష్ తండ్రి ఆవేశంగా ముందుకొచ్చి కొడుకు చేతులు రెండూ వెనక్కివిరిచి పట్టుకుని—

"ఇందిరమ్మా ఈ జన్మకంతా గుర్తుండేలా వెయ్యి. మళ్ళీ నీలాంటి ఆడపిల్లల జీవితాలతో ఆటలాడకుండా ముఖం మీద చెరిగిపోని గుర్తుపెట్టమ్మా ఇంకా ఇంకా గుర్తులుపెట్టు.... రాత్రి మురళిబాబు కబురు పంపేవరకూ ఈ దౌర్భాగ్యుడు చేసే పని మాకు తెలియదమ్మా. అయినా ఈ పాడుకాలంలో నీలాంటి ఆడపిల్లలు జాగ్రత్తగా ఉండక్కరలేదా! అందులోనూ పెళ్ళి విషయంలో....నా కొడుకు చేసినపనికి నే క్షమాపణ కోరుతున్నా మురళిబాబూ!"

యాభై ఏళ్ళ పైబడ్డ ఆయన కళ్ళల్లో నీరు పెల్లుబికింది. మురళి చప్పున "ఇందిరా! వచ్చేయి.... వెనక్కి వచ్చేయి" అన్నాడు బిగ్గరగా.

సతీష్ ముఖంలో నెత్తురు చిమ్ముతున్నది ఇందిర చేసిన గాయం. ఇందిర ఇంకాఇంకా గింజుకుంటోంది ఆవేశంగా బాధగా వణికి పోతున్నా మోసపోయాననే కోపం, ప్రతీకార వాంఛ ప్రజ్వరిల్లగా. ఇందిర పిచ్చిఆవేశంలో పడిపోవటం చూసిన మురళి ముందుకువెళ్ళి ఇందిర రెక్కపట్టుకుని లాక్కువస్తూ—

"ఛీ! నువ్వు రాక్షసిలా ప్రవర్తించకు" అంటూ సతీషు తండ్రికిచెప్పి బైటకివస్తూ "ఇందిరా! పద ఇంటికి వెళ్ళిపోదాం" అన్నాడు సూట్‌కేస్ తీసుకుని. ఇందిర వచ్చి స్కూటర్‌పైన కూర్చుంది. మురళి స్కూటర్ స్టార్టుచేశాడు. ఇందిరలో ఇంత వరకూ అణుచుకున్న దుఃఖం పొంగుకొస్తోంది. మురళి వీపు మీద ముఖం ఆనించి వెక్కి వెక్కి ఏడుస్తోంది.

మురళి కాసేపు ఊరుకోవటం మంచిదని అనుకున్నాడు. మరికొంచెంసేపు ఏం మాట్లాడలేదు మురళి. ఇందిర ఇల్లు దగ్గర కొచ్చేసింది. రోడ్డులో వస్తూ పోతూ సందడిగా ఉంది. పని మనుషులూ, వాహనాలూ ఇటూఅటూ తిరుగుతున్నారు. "ఇందిరా! మీ ఇల్లు దగ్గరౌతుంది. ఇంక ఏడవకు. ఊ...."

ఇందిర క్షణం నివ్వెరపోయినట్లయి....అంతలోనే కళ్ళు గట్టిగా తుడిచేసుకుని గాభరాగా వణికిపోతూ "బావా....నీకు నమస్కారం చేస్తాను. నన్ను దూరంగా ఎక్కడికన్నా తీసుకు వెళ్ళు....ఒకసారి బైటకి వచ్చేసిన నేను తిరిగి ఏ ముఖంపెట్టుకు

ఆ ఇంట్లో అడుగుపెట్టను. పెట్టలేను. బావా....త్వరగా తీసుకు వెళ్ళిపో...." త్వరపెట్టింది ఇందిర.

"ఇందిరా! మరేం ఫర్వాలేదు. నీ వెంట నేనూ వస్తాను. మీ అమ్మతో నే మాట్లాడతానుగదూ. రా ఇందిరా!" నచ్చచెప్ప చూశాడు.

"వద్దు....బావా వద్దు....నేను....అమ్మ ముఖం, అక్కయ్య ముఖం చూడలేను. నాన్నారు వచ్చారేమో.... వద్దు బావా.... నన్ను ఆ ఇంట్లోకి తీసుకువెళ్లాలని ప్రయత్నించకు. నేనా ఇంట్లో ఒక్కక్షణం ఉండలేను బావా.... నన్ను అర్థంచేసుకో. పోనీ ఏవూరైనా పంపు. నీ సహాయం ఈ జన్మలో మర్చిపోలేను బావా."

"ఇందిరా! తల్లిదండ్రులు పిల్లలు తెలియక తప్పుచేసినా క్షమించగలరు. అనవసరంగా భయపడుతున్నావు. నీ వెంట నే వస్తానుగా లోపలికి."

"వద్దు....వద్దు. నీకు దణ్ణం పెడతాను నేను ఇప్పుడు ఈ ఇంట్లోకి వెళ్ళలేను. వెళ్ళినా బలవంతంగా చచ్చిపోవటం ఖాయం....వద్దుబావా"

"సరే....నీ ఇష్టం. మీ అక్క నీకు అండగా ఉంటుందని నేనింతగా చెప్పాను. మరి ఏంచేస్తావు. ఒంటరిగా ఎక్కడుంటావు?"

"ఏ ఊరైనా వెళ్ళి ఏ చిన్న ఉద్యోగం అయినా సంపాదించుకుని బ్రతుకుతాను."

"అవన్నీ అంత సులభమేనా ఇందిరా! సరే పద.... మా ఇంటికి తీసుకువెడతాను. తర్వాత చూద్దాం."

"మీ ఇంటికా! ఇప్పుడా! వద్దు....వద్దు"

"మరేం భయంలేదు. నీకు అనూ ఉంది. ఏం దిగులుపడకు. నిన్నిలా ఎలా వదిలిపెట్టను. రా ఇందిరా" ఎంతో అనునయంగా అన్నాడు మురళి.

"నన్ను తీసుకెడితే ఈ విషయం తెల్సిన అత్తయ్యా, మామయ్యా నిన్ను ఏమంటారో ఎంతగా నిందిస్తారో! వద్దు.... బావా!"

"అలా జరగదు ఇందిరా! ఒకవేళ అలాంటిదే జరిగితే-"

"బావా! నేనిలాంటిపని చేశానని తెలిస్తే ఇంట్లోకి రానీయరు. మెడపట్టి బైటికి గెంటేసారు. అందుకే వదంటున్నాను."

"అనరు నా తల్లిదండ్రులు. ఒకవేళ ఈ ఇందిరని ఇంటికి ఎందుకు తీసుకువచ్చానంటే జవాబిస్తాను నన్ను ఇంట్లోకి రానివ్వకపోతే నీ వెంట నేనూ బైటకి వచ్చేస్తాను. ఇందిరా, నువ్వు మా అనూలాంటిదానివి. నిన్నిలా వదిలేయలేను. చూడు ఎవరో వస్తున్నారు. మర్యాదగా లేదిలా చీకటిలో ఉండటం. రా ఇందిరా. నీ మనస్సు ప్రశాంతపడేవరకూ మా ఇంటిలో ఉండు. ఆ తర్వాత ఆలోచిద్దాం అంటూ ఇందిర ఏదో చెపుతున్నా వినిపించుకోకుండా మురళి ఇంటికి తీసుకొచ్చేశాడు. అప్పటికే నారాయణరావూ, అన్నపూర్ణమ్మా నిద్రలేచారు. కొడుకు అలవాటుకి భిన్నంగా ఒక రాత్రివేళ లేచి ఎక్కడికో వెళ్ళటం తెల్లవారకుండా ఇలా ఇందిరని వెంటపెట్టుకుని పెట్టెతో రావటం

ఏమిటిది! అని ఆశ్చర్యపోతూ నిల్చున్నారు. మురళి వాళ్ళని ఏమీ అడిగే అవకాశం యివ్వకుండానే.

"అమ్మా! కాఫీ అయిందా! ఇందిరా ముఖం కడుక్కో.... అనూ ఇందిరకి ముఖం కడుక్కునేందుకు నీళ్ళియ్యి" అంటూ చెల్లెలిని చాటుకి తీసుకువెళ్ళి స్పష్టంగా చెప్పి ఇందిరని చాలా జాగ్రత్తగా కనిపెట్టి ఉండమ్మా చాలా జాగ్రత్త....ఇందిర బాధ్యత నీదే. అసలే గాయపడిన మనస్సు. యిప్పుడేం మాట్లాడించవదు. ఏం తెలియనట్లు మామూలుగా వుండు అని మరీ మరీ చెప్పాడు.

అన్నపూర్ణమ్మకి మురళి ప్రవర్తన ఏమిటో అర్థం కాక విసుగ్గా వుంది. అయినా పైకి ఏమీ మాట్లాడలేదు. మురళి అది గ్రహించే తల్లికి జరిగిన సంగతి అంతా వివరంగా చెప్పి నాన్నగారికి చెప్పమ్మా—కానీ ఇందిరని ఏమీ ప్రశ్నించనూ వద్దు. కోపగించుకోనూ వద్దు ...నా మాటవిని ఇందిరని ఏమీ అనకండమ్మా."

"అన్నపూర్ణమ్మ యిదంతా విని నిర్ఘాంతపోయింది. 'అమ్మయ్యో ఆ వెధవతో వెళ్ళిపోతే రేపు లగ్నం ఏమయేది ...' పదినిమిషాలవరకూ మాటలు రాలేకపోయింది. నారాయణరావు కొడుకు ఏంచేశాడో అని లోలోపల భయపడ్డా గంభీరంగా వూరుకున్నాడు. మురళి గబగబా ముఖం కడుక్కొని కాఫీతాగి చెల్లెలిని పిల్చి 'అనూ అలా అత్తయ్యగారి యింటికి వెళ్ళొస్తా! యిందిర జాగ్రత్త!' అంటూ హెచ్చరించి స్కూటర్ తీసుకొని రాజేశ్వరమ్మ యింటికి వెళ్ళాడు అప్పటికే యిందిర

కన్పించకపోవటం, రాజేశ్వరమ్మ కంగారు పడుతూంటే ఇందిర రాసిన ఉత్తరం కన్పించి సునంద అదిచదివి "అయ్యో!"అంటూ తల్లికి తెచ్చియిచ్చింది. అప్పుడే ప్రసాదరావు వూరినించి వచ్చాడు. యిల్లంతా గొడవగావుంది. రాజేశ్వరమ్మ ఏడుస్తూ, సునందని తిడుతూ, భర్తని ఇందిరని వెదుక్కురమ్మని త్వర పెడుతూ గోలచేస్తోంది.

మురళి స్కూటర్ దిగి యింట్లోకి వచ్చినా ఎవరూ పలకరించలేదు. ఐనా మురళి నిదానంగా కూర్చుని మేనత్తని పిల్చి జరిగినదంతా చెప్పాడు.

అంతా విన్న రాజేశ్వరమ్మ కళ్ళుతుడుచుకుంటూ "నిన్ననే నీకు తెలిస్తే నాకు చెప్పకుండా ఎందుకు దాచిపెట్టావురా ఈ విషయాన్ని" కోపంగా అంది.

"అత్తయ్యా! నే చెప్పినా నువ్వు నమ్మవేమోఅని ఊరుకున్నాను. ఇందిర అన్నీ అబద్ధం అని దబాయించినా నేనేం చెయ్యలేనుకదా."

రాజేశ్వరమ్మకి కూతురు చేసినపనికి కోపం వస్తోంది. ఎదురుగా కనక కన్పించివుంటే నరికిపారేయాలన్నంత కోపం వస్తోంది. మరోవేపు పరువుపోయిందే అన్నబాధ కుంగతీస్తోంది. ఆవేశపు పొంగుతగ్గి ఆలోచన మొదలైన తర్వాత మురళి ఎంత శ్రమపడి ఇందిరని ఆ అపాయంలోనించి తప్పించితీసుకొచ్చాడో అని అర్థమౌతూ వుంది. ప్రసాదరావు మౌనంగా అంతావిన్నాడు. ఆయన ఆవేశపడలేదు. కాని లోలోపల ఎంత బాధపడుతున్నాడో మురళి గ్రహించాడు.

"మామయ్యా! బాధపడకండి" పూరడించడం చేతకాక ఏదో అనేశాడు.

"మురళీ! చేసుకున్నవారికి చేసుకున్నంత మహాదేవా అని. ఈ అనుభవాలు నాకు గుణపాఠాలు చెపుతున్నాయి. ఆడపిల్లకి అతి స్వాతంత్ర్యం యివ్వటం మొదటి పొరపాటు. ఆపైన యిచ్చిన స్వాతంత్ర్యాన్ని సక్రమంగా ఉపయోగించుకుంటోందా లేదా అని గమనించకపోవటం రెండవ తప్పు. ఐనదానికీ కానిదానికీ దాని మాట సాగనిస్తూ అతిగారాబం చేయటం మూడో తప్పు. దీనికి మేం తప్పక ఈ అవమానం భరించితీరాలి. ఇంత బాధలోనూ దేవుడిలా నా బిడ్డని కాలుజారకుండా రక్షించిన నీకు ఈ జన్మ అంతా కృతజ్ఞత చూపినా ఋణం తీర్చుకోలేను మురళీ ..."

ఆయన కంఠం గద్గదమైంది. మురళి ఆయన్ని వారిస్తూ "మామయ్యా! ఇందిర నా మేనత్తకూతురు. పరాయిది కాదే."

అంత బాధలోనూ రాజేశ్వరమ్మ తృప్తిగా మేనల్లుడిని చూసుకుంది. "మురళీ! ఇప్పుడు మమ్మల్ని ఏంచెయ్యమంటావు.... ఇంటికి తీసుకొద్దామన్నా అది వస్తుందా!"

"మీరేం చెయ్యద్దు అత్తయ్యా! కొన్నాళ్ళు ఇందిరని మా అనూకి తోడుగా ఉండనియ్యి. తర్వాత చూడవచ్చు" అని చెప్పి ఇంటికి వచ్చేశాడు మురళి. సునందతో కాస్సేపు మాట్లాడాలని పించింది. కానీ అవకాశం చిక్కలేదు.

# 28

సాయంకాలం నాలుగుగంటలు కావస్తోంది. నారాయణ రావు కోర్టునుంచి యింకా రాలేదు. ఎందుకో ఈరోజు ఆలశ్యం అయింది అనుకుంటూ అన్నపూర్ణమ్మ భర్త కోసం ఎదురు చూస్తోంది. ఒకవేళ ఆడబడుచు యింటికి వెళ్ళి వుంటారా అని ఆలోచిస్తూ. మురళి బలపంతంమీద ఇందిర అన్నంతిన్నదికాస్త. తర్వాత అనూ మురళి కూర్చుని చదువుకునే గదిలోనే తనూ కూర్చుంది. పుస్తకం చదువుకోవాలని ప్రయత్నిస్తోందే కానీ తల కెక్కటంలేదు. అన్నపూర్ణమ్మకి కొడుకుమీద బోలెడంత కోపంగా ఉంది. ఇందిరని పెళ్ళిచేసుకుంటే అసలే సమస్యలు ఏవీ వుండేవికావుకదా అని. అనూ జీవితం చక్కబడేది. ఇందిర యిలాంటిపని చేయటానికి అవకాశం లేకుండాపోయేది. అప్పుడు పెళ్ళిచేసుకోనని యిలాంటి పరిస్థితిలో ఇందిరని తీసుకువచ్చి యింట్లో అట్టిపెట్టటం అసలు నచ్చలేదు ఆవిడకి. సరాసరి తల్లిదండ్రుల దగ్గరే దించేస్తే బాగుండేది. యిప్పుడు వాళ్ళు వచ్చి ఈ పిల్లని తీసుకువెళ్ళకపోయినా బాధే. మురళి ఉండడు, ఎల్లుండి వెళ్ళిపోవాలి. మరోవైపు ఆ నీరజని యిస్తానని వచ్చిన పెద్దమనిషి చలపతిరావుగారికీ విషయాలు తెలిస్తే ఏం బాగుంటుంది. మురళి 'పెళ్ళి' ట్రైనింగ్‌కి వెళ్ళేముందే చేసేయాలని ఆయన అడగటం నారాయణరావు కొడుకు యిష్టపడకపోవటంతో పెళ్ళి తర్వాత లగ్నం పెట్టుకుందాం అని ఆయనకి నచ్చచెప్పే

సరికి చాలా కష్టమే అయింది. ముందు అనీని గిరిధర్ తీసుకు వెళ్ళాలి. వాళ్ళు సుఖంగా వుండాలి. ఇన్ని సమస్యలతో ముడి పడివుంది మురళి పెళ్ళి.

అన్నపూర్ణమ్మ సన్నటిపిరికా ఇందిరని చేసుకోలేదని కోపంగావున్నా రోజు "ఛీ ...రకలాంటిపిల్ల దసురనే మురళి అక్కరలేదన్నాడేమో!" అనుకుంది లోపల.

గదిలో కూర్చున్న ఇందిర మురళి బట్టలు మార్చుకుని బైటకి వెళ్ళబోతున్నది గ్రహించి—

"బావా!" అంది మెల్లగా.

"ఏం ఇందిరా"

"నీ ప్రయాణం యెప్పుడు?"

"యెల్లుండి

నువ్వు వెళ్ళిపోతే నేనక్కడ పంపరిగాడుండలేనుదావా"

"అలా ఉంటుందిగా! పైగా మనందరం రోజూవచ్చివెళ్ళమని చెప్పి వెడతాను. అదీగాక ఏదైనా ఉద్యోగంలో చేరతానంటున్నావుగా. నా స్నేహితుడికి చెప్పివెడతాను. ప్రయత్నిస్తే ఏదోఒకటి తప్పక దొరుకుతుంది. యిందిరా నువ్విప్పుడు చాలా స్థయిర్యంగా నిలబడాలి. తొందరపడి ఏ నిర్ణయమూ తీసుకోవద్దు."

యిందిర పేలవంగా నవ్వింది. ఆ అమ్మాయిలోని డాబూ దర్పం ఎటుపోయాయోగానీ ఒక్కరోజులో కొత్త యిందిరలా అయింది. తను చాలా తెలివిగలదాన్ని అనీ తనని యెవ్వరూ

మోసం చెయ్యలేరని తనమీద తనకి ఎంతో విశ్వాసం. అలాం
టిది ఎంతో ప్రేమించి నటించిన సతీష్ పెళ్ళి అయివుంటుందనే
వూహే రాలేదు. అతను సామాన్యమైన వ్యక్తి అని తెలియదు.
ఓ పెద్ద కంపెనీలో ఆరువందల జీతంతో ఈమధ్యనే ఉద్యోగంలో
చేరానని బోలెడంత భవిష్యత్తుందని చెప్తే పొంగిపోయింది.
అతని మాటల చాతుర్యం అందమైన ముఖం వెనక కేవలం
డబ్బు వ్యామోహం ఉందనికాని, ఆడబ్బుకోసం ఆడపిల్లల జీవి
తాలని నాశనంచేసే కిరాతకుడని మాత్రంగా తెల్సుకోలేక పోయింది.
అసలు ఈ పెళ్ళి విషయం తల్లిదండ్రులకి చెప్పి చేసుకోవాలనే
అనుకుంది. అలా చేద్దామని సతీష్‌తో చెప్పిందికూడా. అయితే
సతీష్ ఒప్పుకోలేదు. "అలా పెద్దలు చేసినపెళ్ళిలో 'థ్రిల్' ఏం
ఉంటుంది. ఛీ ... ఛీ ... మనలాంటి ఆధునికులు ఇలా దూరంగా
వెళ్ళిపోయి పెళ్ళిచేసుకుని హనీమూన్ అదీ తిరిగి 'ఎంజాయ్'
చేసి రావాలికాని ... పెద్దలుచేస్తే చేయించుకునేందుకు మనం మట్టి
బొమ్మలమూ కాము. వ్యక్తిత్వంలేని వాళ్ళమూ కాదు. అన్నిటికీ
మించి అసంబద్ధం అసలేకాదు" అంటూ తేలిగ్గా అతితెలివిగా
ఇందిరకి నచ్చేలా 'గాస్'కొట్టి ఇందిరను బుట్టలోవేసుకున్నాడు.
ఇందిర ఇలా ఇల్లు వదిలి రావటానికి ముందు చాలా ఆలో
చించింది. కానీ ఆ క్రితంరోజు మురళిచేత తిరస్కరించబడ్డ
తర్వాత యేదో ఒక ప్రతీకార చర్యచేసి తన ఆధిక్యతని అంద
రికీ అర్థం అయేలా చెయ్యాలని తహతహలాడింది. ఆ ఆవే
శంలో నిర్ణయం చేసుకుని సతీష్‌కి చెప్పేసింది. ఈ అవకాశం

కోసమే యెదురుచూస్తున్న సరోజ యెగిరి గంతేసి యెలా ప్రయాణమై యిల్లుదాటి రైల్వేస్టేషన్లో కల్సుకోవాలో అన్నది ప్లానువేసి చెప్పాడు. అన్నయ్యంటే వీలయినంత తన్ను దగ్గర వుంచుకోవటం ముఖ్యం అన్నది పదేపదే గుర్తుచేస్తూ. ఇందిర తన నగలూ యింట్లో వున్నంతవరకూ తెచ్చా. బట్టలూ సర్దేసుకుంది. తెలివిగా ఇల్లు దాటి పైకి వెళ్ళింది కాని మురళికి దొరికి పోయింది. తర్వాత జరిగిన విషయాలన్నీ ఇందిర యిష్టా యిష్టాలతో ప్రమేయం లేకుండా జరిగిపోయాయి. తను యెంత గానో ప్రేమించిన పెళ్ళి అయి ఇద్దరు పిల్లల తండ్రి అని తెల్సినపుడే ఇందిరకి 'షాక్'లా తగిలింది. ఆపైన ఆ అమ్మాయి యెదుట అలా పనిచేసినందుకు. కానీ యెలాగో నిల దొక్కుకుని మురళివెంట మేనమామ ఇంటికి వచ్చేసింది.

యిప్పటికింకా [illegible] పట్టిన రోజులు గడిచిపోయాయి. అందుకే ఆలోచనా విధానం మారింది. మురళి అంటే అంత క్రితం వుండే నిర్లక్ష్యం. తగ్గిపోయి వాడి స్థానంలో గౌరవం చోటు చేసుకుంది. మాటిమాటికీ ఇందిర తనని తను ప్రశ్నించు కుంది. "నేను తనని యెంతగా నిర్లక్ష్యంగా చూసినా యిష్టం వచ్చినట్లు మాట్లాడినా మనస్సు గాయపరిచేట్లు నన్ను పెళ్ళి చేసుకోను అని ముఖంమీదే అన్నా అవేం పట్టించుకోకుండా నేను అగాధంలోకి పడిపోయినట్లు తెల్సుకుని యెంత ఆవేదన పడ్డాడో? యెంత వుపాయంగా తప్పించాడో!

ఇప్పుడు మురళి సామాన్యుడిలా కాక తనపాలిటి దేవు డిగా కన్పిస్తున్నాడు ఇందిరకి. అందుకే తన కృతజ్ఞత తెల్పు

కునే అవకాశంకోసం చూస్తోంది. మురళి అతి మామూలుగా వున్నాడు.

“బావా! సరిగ్గా యెవరో యే వుద్యోగం చేస్తున్నాడో యిదివరకే నీకు చెప్పానా?” అడిగింది.

నిష్కపటంగా చెప్పాడు. పార్కులో మీ సంభాషణ విని నిర్ఘాంతపడాను. అతను ఏం చెప్పాడో యెక్కడ వుంటాడో యేం చేస్తూ వుంటాడో మాత్రం నాకు తెలియదు. అయితే ఆ రాత్రే ఆరా తీశాను. పేరు చెప్పి మరి అడిగితే యేమైనా కానివ్వు అని అతని తండ్రిని కలుసుకున్నాను.... ఆ తర్వాత విషయాలు అన్నీ నీకు చెప్పినవే. ఇందిరా అదంతా ఒక పీడకల అని మర్చిపోవటానికి ప్రయత్నించు.

ఇందిరకు ఉబికి వస్తోంది దుఃఖం.

“బావా! అతనితో సన్నిహిత్యం ఏర్పడిగానే కానీ....”

“కానీ....”

“నన్ను అనుమానిస్తున్నావా?”

“లేదు ఇందిరా! నువ్వింక మరీ తెలివి తక్కువదానివి కావు అని నాకు తెల్సు.”

“అంతేచాలు బావా....! అంతేచాలు” తృప్తిగా నిట్టూర్చింది ఇందిర.

“నువ్వు నమ్ముతావు కానీ ఈ ప్రపంచం, అమ్మ, నాన్నారూ నన్ను నమ్ముతారా....? ఒకవేళ యిది తెల్సిన అన్నయ్య.... యేం చేస్తాడో, యెంత బాధపడతాడో అని నాకు

భయంగావుంది బావా! ఇప్పుడు నీకంటే ఆత్మీయులూ ముఖ్యులూ నాకింకెవరూ లేరు. అందుకే సిగ్గువిడిచి అన్నీ నీకే చెప్పి మనస్సులోని భారాన్ని దించుకుంటున్నాను. బావా! మరేం అనుకోకు ...."

"ఇందిరా! మొదటినించీ సునంద నా మనస్సుకి దగ్గరగా వుంది కనుకనే బాగా అర్థం చేసుకుంది. మరి నువ్వూ అర్థం చేసుకో. నేనిలాంటివన్నీ చాలా తేలిగ్గా తీసుకుంటాను. ఇంక నీ తల్లిదండ్రులు నిన్ను అనుమానిస్తారేమో అనికదూ భయం. ఇందిరా ఒకటి చెప్తాను. సరీగా విను. మంచిచెడ్డలనేవి సంజాయిషీ యిచ్చుకోవాలనే దృష్టితోకాక మన అంతరాత్మకే మనం సంజాయిషీ యిచ్చుకొనేలా వుండాలి. అలాగే స్త్రీకి "శీలం" కూడా. ఒకరు అనుమానిస్తారనికాదు. నీమీద నీకు నమ్మకం నీ మనస్సాక్షి. నీకు సాక్ష్యం అంతే. మరీ విషయాలు వదిలేయ్యి. మనస్సుని మరే విషయంమీదైనా లగ్నం చెయ్యి. పోనీ యేదయినా సినిమాకి వెళ్ళివస్తారా నువ్వూ అనూరాధా."

"వద్దు బావా! సినిమాకి వెళ్ళను. యేదయినా మంచి పుస్తకం యివ్వు."

అనూరాధ టిఫిను ప్లేట్లతో గది లోపలికి వస్తూ అన్నగారూ, ఇందిరా మాట్లాడుకుంటూంటే ఆగిపోయి మళ్ళీ గదిలోకి వచ్చింది. మురళీ, ఇందిరా ప్లేట్లు తీసుకున్నారు.

"అనూ! నువ్వు టిఫిను ప్లేటు యిక్కడికే తెచ్చుకోమ్మా" అన్నాడు మంచినీళ్ళ గ్లాసు అందుకుంటూ.

"అలాగే అన్నయ్యా" అంటూ లోపలికి వెళ్ళి టిఫిను తెచ్చుకుని—

"అన్నయ్యా అన్నట్లు మరచాను. నీరజా వాళ్ళ నౌకరు వచ్చి ఈ కవరు నీకిమ్మని చెప్పాడు. మర్చిపోయానన్నయ్యా" అంటూ ఓ కవరు అందించింది. "నాకా! నీరజ కవరు పంపిందా!" తనలో తనే అనుకుంటూ టిఫిను తినకుండా కవరు చించాడు. నీరజే రాసిందా ఉత్తరం.

మురళీధర్

మీరోసారి పార్కులో నన్ను కల్సుకోవటానికి రండి. సరిగ్గా నాలుగింటికి వస్తాను అక్కడికి, తప్పక రావాలి. అతి ముఖ్యమైన విషయాలు మాట్లాడాలి. నేను వంటరిగా పార్కుకి వస్తున్నాను....లైబ్రరీ ప్రక్కన వున్న పార్కు."

నీరజ.

మురళికేదోలా అన్పించింది. నీరజ ఏం మాట్లాడాలన్నా ఇంటిదగ్గరే మాట్లాడవచ్చునుకదా! ఏమై వుంటుందీ అతి ముఖ్య విషయం. మనస్సు ఎందుకో కీడు శంకిస్తున్నట్లుంది. ఛీ! ఇంత చిన్న విషయాలకే అశాంతిపడితే ఎలా అనుకుంటూ ఆ ఉత్తరం పాంటుజేబులో కుక్కి "అనూ మళ్ళీ వస్తా" అంటూ వాచ్ చూసుకుని త్వరత్వరగా స్కూటర్ తీసుకుని బైటకొచ్చేశాడు మురళి. 'టిఫినన్నా తినకుండా వెళ్ళిపోయాడేంటి" ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు ఇందిరా, అనూరాధాను.

"సీరజ యిలా ఉత్తరాలు ఎప్పుడూ రాస్తూ వుంటుందా" అడిగింది ఇందిర. "నాకు తెల్సినంతవరకూ యిదే మొదటి సారి."

మరేం మాట్లాడలేదు ఇద్దరూ. 'ఏమౌవుతుంది' అని ఇద్దరూ ఆలోచనలో పడారు. ఇందిరకి మరోవైపు భయంగా వుంది నారాయణరావు కోపంనుంచి తన ఇంటికి వెళ్ళి తల్లి దండ్రులని వెంటతీసుకు వస్తాడేమో అని.... ఒకవేళ సునంద వచ్చినా ఈ ముఖాన్ని యెలా చూపించను. చూపకుండా ఎక్కడ దాక్కోను.... ఈ ఆలోచనలు వచ్చేసరికి తను చేసినది యెంత తప్పో క్రమక్రమంగా తెల్సివస్తోంది ఇందిరకి. వాకిట్లో రిక్షా ఆగిన శబ్దం. నారాయణరావు గొంతూ విన్పించింది. ఇందిర కుచించుకుపోయి దిండులో ముఖం దాచుకుని పడుకుంది. అడుగుల చప్పుడు తను పడుకున్న గదివరకూ వచ్చి ఆగిపోయింది. అనూ మెల్లగా యేదో చెప్పటం మాత్రం విన్పించింది. ఒక నిమిషం తర్వాత చల్లని చెయ్యి ఇందిరని స్పర్శించింది. ఆ స్పర్శలోని హాయీ ఆత్మీయతా ఇదివరకెన్నడూ యెరగనట్లు కొత్తగా వుంది. మంచంమీద కూర్చుని వీపుమీద చెయ్యివేసి 'ఇందిరా' అన్నది సునంద. అంతే ఇందిర గభాలున లేచి అక్కని గట్టిగా కౌగలించుకుని వెక్కివెక్కి యేడ్చేసింది. ఆ గదిలోకి మరెవ్వరూ రాకుండా అనూ తలుపు దగ్గరగా వేసి వెళ్ళింది.

"అక్కయ్యా! నేనంటే అసహ్యంగా లేదూ నీకు?' ఇందిర అడిగిన మొదటి ప్రశ్న సునందని.

"లేదమ్మా! నీవిలా ఒంటరిగా ఫీలయి ఇల్లు వదలటానికి నేనూ బాధ్యురాలినేమో అని లోలోపల కుళ్ళిపోతున్నాను. నేను నీ కింకా ఆత్మీయంగా దగ్గరగావచ్చి వుంటే త్వరపడి ఈ నిర్ణయం తీసుకోవని ... అలా తీసుకోవాలన్నా ముందు నాకు చెప్పి వుండేదానివని అలా నాకేగనక ఆ విషయం కాస్తయినా తెల్సి వుంటే యిలా జరిగి వుండేది కాదనీ.... అసలు జరగనిచ్చే దాన్ని కాదే అని లోలోపల ఎంతగా కుమిలిపోతున్నానో నీకు తెలియదు ఇందిరా. పోనివ్వు యింకా భగవంతుడు నీయందున్నాడు. కనకనే వాడు సమయానికొచ్చి రక్షించాడు. ఇందిరా ఇంక ఆ విషయాలు మర్చిపోవటానికి ప్రయత్నించు...." అనునయంగా పొదివిపట్టుకుని అంది సునంద.

"అక్కా! అమ్మకీ, నాన్నారికీ నామీద కోపంగా లేదూ....?"

"వున్నా అది తాత్కాలికమేనే."

ఇందిర తన ముఖాన్ని రెండు చేతులతోనూ కప్పుకుని ఇంకా ఏడుస్తూనే వుంది. సునంద ఓదారుస్తోంది.

## 29

మురళి స్కూటర్లో స్పీడుగా వచ్చేశాడు పార్కుకి. అప్పటికే అర్ధగంట లేటు అయింది. నీరజ రమ్మన్న టైముకి వుంటుందో వెళ్ళిపోతుందో! అసలు యింత ముఖ్య విషయం యింత హటాత్తుగా యెలా వచ్చింది. ఏం వచ్చింది! యెంత

ఆలోచించినా అర్థంకావటంలేదు మురళికి. స్కూటర్ లాక్ చేసి త్వరగా పార్కు అంతా గాలిస్తున్నాడు. నీరజ యెక్కడ కూర్చుంటుందో తనకి తెలియదు. అసలు ఇద్దరూ కల్సి యిలా యెప్పుడూ రాలేదుకూడా. అసలే రాత్రి అంతా నిద్రలేదు. ఆందోళనతో అలిసిపోయాడు. మధ్యాహ్నం విశ్రాంతిగా పడుకోవాలి అనుకున్నాడేకానీ కంటిమీద కునుకు రాలేదు. ముఖం అంతా నల్లగా అయిపోయి కళ్ళు గుంటలు పడిపోయినట్లు అద్దంలోకి చూసినప్పుడే తెల్సింది. అస్సలు రెస్టు లేదు. యెల్లుండే ప్రయాణం. అబ్బ అనుకుంటూ పార్కు అంతా రెండుసార్లు ప్రదక్షిణం చేశాడు. కానీ నీరజ కన్పించలేదు. పెద్దవాళ్ళెవరూ ఇంకా రాలేదు. పిల్లలే వచ్చి యేవో ఆటలాడుతున్నారు కొందరు. ఆ పిల్లల గుంపును దాటుకొని తల తిప్పాడు. నీరజ కాస్త దూరంలో కూర్చున్నదల్లా మురళిని చూసి లేచి నిలబడింది.

మురళి గబగబా నీరజ దగ్గరికి వెళ్ళాడు. ఆకుపచ్చ పువ్వుల చీరె కట్టుకుని అదేరంగు జాకెట్టు వేసుకుని పమిట భుజంచుట్టూ తిప్పి కప్పుకుంది నీరజ. మురళి నీరజని చూస్తూనే "గుడీవెనింగ్" అన్నాడు నవ్వుతూ.

నీరజ బదులు చెప్పలేదు. కాని మురళి ముఖంలోకి ఉద్రేకంగా చూస్తోంది. మురళి "అబ్బ! చాలా అలసటగా వుంది నీరజా! కూర్చో అలా! నేనూ కూర్చుంటాను" అంటూ పచ్చ గడ్డిలో కూర్చుని కుడిచెయ్యి చాచి కాస్త వెనక్కి వాలి, నీరజ ముఖాన్ని పరీక్షిస్తూ, "అదేమిటి! అలా యెవరో కొత్త వాడిని పరిశీలిస్తున్నట్లు చూస్తున్నావ్! యేం గుర్తుపట్టలేదా!

"మీకేం తెలియదా?"

"ఏ విషయం?"

"అమాయకులా?"

"అసలు వానీ విషయం చెప్పకుండా....యిలా చూస్తుంటే నాకు చాలా చిరాకొస్తుంది. ఏమైనా సరే."

"మీకేనాదు నాకూ వస్తుంది" తీవ్రంగా అంది నీరజ. మురళి అయోమయంగా చూశాడు. అప్పటికే అతనికి ఆవేశం వచ్చేస్తోంది.

"నీకెందుకు వస్తోంది అనే అడుగుతున్నాను మిస్ నీరజా" కాస్త తీవ్రంగా ధ్వనించింది మురళిగొంతు.

"ఈ ఫొటోలో వున్నది మీరేనా!" హేండ్‌బాగ్‌లోని కాబినెట్ ఫొటో ఒకటి తీసి మురళి కళ్ళకి ఎదురుగా పెట్టింది. మురళి దాన్ని చూస్తూనే "అవును నాదే! ఏం?" నీరజ ముఖంలోకి చూస్తూ అడిగాడు.

"ఎన్నాళ్ళయింది పెళ్ళి చేసుకుని?"

"పెళ్ళా! ఓహో.... ఈ పెళ్ళికూతుర్ని చూసేనా నీవింత సేపూ నన్ను హడలగొట్టింది" అని తేలిగ్గా నవ్వేస్తూ, "ఇది ఇది...." అని చెప్పబోతూనే నీరజ ముఖంచూసి మరీ నవ్వాడు. "ఈ ఫోటో నీకెక్కడినించి వచ్చింది?"

"అది అనవసరం. నాక్కావల్సింది జవాబు" మరీ కోపంగా అడిగింది నీరజ.

మురళి ముఖంలో నవ్వు మాయమైంది. గంభీరంగా చూస్తూ "నీరజా! నన్ను అనుమానిస్తున్నావా! నువ్వు!"

"నాకు జవాబు కావాలి."

"ఓ అలాగా. అయితే విను ఈ ఫొటోలో వుంది మామూలు పెళ్ళికూతురుకాదు. నాటకంలో పెళ్ళికూతురు. నీకు అర్థంకాలేదుకదూ! నా ఫ్రెండ్ 'శ్యాం' డ్రామాల్లో ఆడవేషాలు వేస్తాడు. ఒక నాటకంలో పెళ్ళికూతురుగా వేశాడు. ఆ నాటకానికి నేను వెళ్ళాను. చాలాబాగా వేశావని అచ్చంగా పెళ్ళికూతురిలా వున్నావనీ అభినందించాను. వాడు మోజుపడి ఆ డ్రెస్‌లో నా ప్రక్కన నిల్చుని ఓ ఫొటో తీయించుకున్నాడు. యిదొక్కటే కాక తను ఒక్కడూకూడా ఒకటి తీయించుకుని పెద్దగా చేయించి ఫ్రేం కట్టించి హాలులో తగిలించుకున్నాడు. వాడి అడ్రెస్ కావాలంటే ఇప్పుడే యిస్తాను. వెళ్ళి చూసిరా! లేకుంటే ఆ ఇంటికి తీసుకువెళ్ళి నేను బయట నిల్చి ఉంటాను. నువ్వు చూసి రావచ్చు. ఏం.... నీరజా! సంజాయిషీ సరిపోయిందా! లేక...."

నీరజలో యింకా నమ్మకం కలిగినట్టులేదు. మురళి కళ్ళ ల్లోకి చూస్తోంది.

"ఏం ఇంకా ఏమైనా ప్రశ్నలు మిగిలి ఉన్నాయా! ఉంటే త్వరగా వెయ్యి! జవాబు చెప్పేసి ఆపైన నేను చెప్పవలసినవి చెప్తాను. టైము చాలా తక్కువ ఉంది" చేతివాచ్ చూసుకుంటూ అన్నాడు. "అసలీ ఫోటో నీదగ్గరకెలా వచ్చింది?"

"కాపుడమ్మ మాకు చాలా దూరం చుట్టం. అయినా మా యిల్లు వెతుక్కుంటూ వస్తూనే ఉంటుంది. ఈసారి వచ్చి ఈ

రహస్యం బయటపెట్టింది. మీరు అసలు ఈ ఫొటో కాపుదమ్మ కెందుకిచ్చారు?"

"ఆ విషయం ఆవిడనే అడగలేకపోయావ్?"

"నాకు కావల్సింది మీ జవాబు."

"అబ్బ. 'రా' పాయింట్లలో మా నాన్నగారు నీముందు ముందుగా పనికిరాకుండా ఉంది. సరే చెప్తాను. ఆ కాపుదమ్మకి ఒక మనుమరాలుంది. ఆ అమ్మాయి పేరు నాగనాంచారి. ఆ పిల్లని నేను పెళ్ళిచేసుకోవాలని ప్రాణం కొట్టుకుంటూ ఉంటే ఆ వాళ్ళ పడలేక ఆవిడ ఒప్పుకోకపోవటంకోసం ఉపాయం ఆలోచించి స్నేహితుడిని శరణువేడి ఓ ప్లానువేసి ఈ ఫోటో ఆవిడకి పంపేస్తూ ఆకాశరామన్న ఉత్తరం రాయించాను. నాకు గాంధర్వ వివాహం అయిందని ఆవిడ నమ్మి చాలారోజులు ప్రచారం చేసింది. ఒకసారి మా తాతయ్యతో తగాదాకి దిగింది. ఆయన మళ్ళీ మా వాకిట్లోకి రానీకుండా చేశారు. ఆ తర్వాత ఆవిడనీ ఆవిడ కూతుర్నీ ఈ పెళ్ళి ఫోటోని దాదాపు మర్చిపోయామనే చెప్పాలి ... సిరజా! నేనెందాకటినుంచీ నీ ముఖంలోని భావాలని గ్రహిస్తూనే వున్నాను. నన్ను యిన్నిరేకళ్ళతో చూస్తున్నావీవేళ. సరే.... యింకేమైనా ఉంటే చెప్పు జవాబు చెప్పటానికి రెడీగా ఉన్నాను.

"నన్ను.... నన్ను.... మోసం చెయ్యటానికి చూస్తున్నావు. మీరు చెప్పినదంతా అబద్ధం. అబద్ధం అని చెప్పటానికి ఋజువులు చాలానే ఉన్నా

మురళి ఎంతో నిగ్రహించుకుంటూన్నాడు. కానీ సాధ్యం కావటంలేదు. అయినా ప్రయత్నిస్తూ "ఏమిటది! క్విక్! త్వరగా చెప్పు!"

"మీ చెల్లెలికి దొంగపెళ్ళి చేసి జయించేశానని గర్వ పడొదు. కాని ఆ గిరిధర్ ఒక చెల్లెలిని పెళ్ళి చేసుకోండే మీ చెల్లెలిని ఎపురానికి ఓమడుస్తానని చెప్పినమాట అబద్ధమా!"

"నిజమే!"

"అలాంటప్పుడు నాదో ఆశలు రేపి పెళ్ళిరా సదారాలు సాగించి.... యింతకారం ఎందుకు రానిచ్చారు?"

"నేను ఇందిరని పెళ్ళి చేసుకోపటం కల్ల. చేసుకోనని అందరికీ చెప్పేశాను. నన్ను మోసం చేయటం అనే మాటకి అర్థం లేదు."

"ఎందుకులేదు! నిన్న చేసుకోనన్న ఇందిరని యివాళ మీరే స్వయంగా తీసుకొచ్చారు ఇంటికి. ఇప్పుడు చెప్పండి మీ మాటలు యెలా నమ్మమంటారు?"

""సీతా!" సరిగ్గా ఓదార్చుంటూ అన్నాడు.

"ఊ... సరిజనే అడుగుతున్నాను. చెప్పండి జవాబు."

"నా మాటమీద నమ్మకం వుందా నీకు?"

"అలా అయితే నే చెప్పటం అనవసరం. చెప్పను కూడా. నీకే ప్రయత్నించి తెల్సుకో! యిదే నా జవాబు."

"అనుకోని ప్రశ్నకి జవాబు చెప్పటానికి టైము చాల్లేదా?'

"నీరజా! నువ్వు యేవేవో మనస్సులో అనుమానాలు పెట్టుకుని నన్ను యిలా ప్రశ్నించటం నేను యిచ్చే జవాబులు నీకు తృప్తి కలిగించకపోవటం నాకేం బాగాలేదు. నేను యెల్లుండి వెళ్ళిపోతున్నాను. తిరిగి వచ్చేవరకూ నీ అనుమానాలన్నీ తీర్చుకోగల్గితే సంతోషిస్తాను. లేకుంటే నేనేం చెయ్యగలిగింది లేదు. నీకు అభ్యంతరం లేదంటే నే వెళ్ళగానే ఉత్తరం రాస్తాను నా అడ్రెస్ తెల్పుతూ. జవాబు యివ్వాలనుకుంటే యివ్వు. లేదా ఆ విషయం జవాబు రాయి. యింతకిమించి ఓర్పుగా జవాబిచ్చే శక్తి నాకిప్పుడు అసలు లేదు. కొన్ని కారణాలవల్ల నేనిప్పటికే చాలా అలసిపోయాను. మరింక శలవు అంటూ లేచి నాలుగడుగులు ముందుకు వేసిన మురళిని విగ్రహంలా చూస్తూ వుండిపోయింది నీరజ. యేదో చెప్పాలని ప్రయత్నిస్తోంది కానీ మాట బయటకి రావటంలేదు. అదేం గుర్తించని మురళి మళ్ళీ వెనక్కి వచ్చి "నీరజా! యిప్పటికే చాలా టైము అయి పోయింది. నా స్కూటరులో మీ యింటిదగ్గర దించేసి వెడతాను వచ్చేయి."

"అక్కర లేదు. వెళ్ళగలను" కోపంగా అంది.

"నువ్వు వెళ్ళగలవు. కానీ.... నాకు శాంతి వుండదు. రా.... పూ...."

నీరజ కదల్లేదు. మురళి క్షణం నిల్చి చూశాడు. నీరజ లేచేలా లేదని గ్రహించి చెయ్యి పట్టుకుని బలవంతంగా లేవ

నెత్తి గేటువైపు లాక్కుపోయాడు" నీరజ "వదలండి చెయ్యి" నిలా అంటున్నా మురళి విన్పించుకోలేదు.

"యిది నీకోసం కాదు నీరజా నా కోసం' అంటూనే నీరజ ఇంటివైపు పోనిచ్చి ఆ యింటికి కాస్త దూరంలో స్కూటర్ ఆపి దిగి ..

"ఇంక వెళ్ళు నీరజా! నీకేదైనా బాధ కలిగించే మాట మాట్లాడితే క్షమించు. ఈరోజు నీతో యెన్నో చెప్పాలని అను కున్నాను. కానీ మరోలా అయింది సరే.... మరింక వెళ్ళి వస్తాను.... వీలుంటే రైల్వేస్టేషనుకి వస్తే సంతోషం. గుడ్ నైట్" మురళి వెనక్కి తిరిగి వెళ్ళిపోతూంటే నీరజ నోట మాట రాక అలా నిలబడిపోయింది. తెప్పరిల్లి "మురళీధర్" అన్న పిలుపు గాలిలో కల్సిపోయింది. మురళి ఇంటికి రావా లనుకున్నాడేకానీ మనస్సు అంతా చేదు తిన్నట్లుంది. దారిలో ఓ ఫ్రెండ్ కన్పిస్తే 'స్కూటర్' అతనికిచ్చి 'మా ఇంటి దగ్గర పెట్టేయరా ప్లీజ్. నేను రేపు ప్రొద్దున్నే వస్తానని చెప్పు మా అమ్మతో' అంటూ బస్స్టాండులో పల్లెకి వెళ్లే ఆఖరిబస్‌లో ఎక్కి కూర్చున్నాడు.

# 30

మురళి బస్‌దిగి కాలువ దాటి చీకటిలో గతుకులరోడ్డులో నడిచి యెలా పల్లె చేరాడో అతనికే తెలియదు. వూరంతా మాటు మణిగి వుంది. మురళి కొత్తవాడని కాబోలు ఒకటి రెండు కుక్కలు అరిచి అరిచి మళ్ళీ కళ్ళు మూసుకుని పడుకున్నాయి.

"అలాగా! తాతయ్య నన్ను చూడాలని వచ్చాడు. కానీ నేను నిన్ను చూడాలని వచ్చాను ఒరే వాసుండిరటా!" అంటూ నవ్వాడు.

యశోద లోపలికి వెళ్ళి మంచినీళ్ళు తెచ్చి యిచ్చింది. వంట ప్రయత్నం చేయబోతుంటే మురళి వారిస్తూ "నే భోజనం చేసే వచ్చాను యశోదమ్మా" అంటూ అబద్ధం చెప్పాడు. అయినా యశోద లోపలికి వెళ్ళి గ్లాసుడు పాలు తెచ్చి యిచ్చింది. అది తాగేసి 'కబుర్లు చెప్పు యశోదమ్మా' అంటూ తాతగారు పడుకునే ఆ మంచంమీదే పడుకున్నాడు మురళి.

"నేనేం చెప్పను బాబూ! నువ్వే చెప్పు. తిరిగి రావటానికి యిన్ని నెలలు పడుతుంది."

"అబ్బ! ఆ విషయాలు తర్వాత గాని నేనీరాత్రి యింత పరుగెత్తుకుంటూ ఎందుకు వచ్చానో తెలుసా?"

"అంతా నేను అడుగుతా అక్కడ జరిగిన సంగతులన్నీ ఆ.... అబ్బ! ఆ అశాంతిగా వుంది యశోదమ్మా! నాకెన్నాళ్ళుగానో సరిగా నిద్రలేదు. యశోదమ్మా రేపు ప్రొద్దున్నే వెళ్ళిపోవాలి. నేనీరాత్రి హాయిగా నిద్రపోయేందుకు చోటే దొరక్క ఎంతదూరం నీకోసం పరుగెత్తుకుంటూ ఎందుకొచ్చానో తెలుసా?"

"చెప్పు?"

"నీ వడిలో కాస్సేపు పడుకునేందుకు చోటిస్తావనీ

కమ్మని నిద్రపోయేలా నాకిష్టమైన ఆ జోలపాట పాడతావనీ యెంతో ఆశతో యింతదూరం వచ్చాను యశోదమ్మా" ఈ మాటలు చెప్తున్నప్పుడు మురళి కంఠంలోని ధ్వని గుర్తించింది యశోదమ్మ.

"అమ్మో! చిన్నబాబూ! యింటిలో అమ్మాయిలున్న నీకు హాయిగ పడుకునే చోటులేక యింతదూరం పరుగెత్తుకు వచ్చావా! బాగానేవుంది వానీ మీ అమ్మ వుందిగా.... అంతకి మించి అమ్మలెవరూ వుంటారు మరెవ్వరుంటారు."

"మా అమ్మ అమ్మలెవరూ లేరే నాకు తల్లి—దానే ఇంకెవరని పెళ్ళి చేసుకోలేదని కోపం వుంది. నన్ను అర్థం చేసుకోలేదని చాలా బాధగావుంది యశోదమ్మా. నాకు నీ జోలపాట కావాలి. చిన్నపిల్లవాడిలా మారాం చేస్తుంటే యశోదమ్మ కళ్ళు చెమ ర్చాయి. "మురళిబాబూ!" అంటూ ప్రేమగా తల నిమిరింది. క్రాపు సవరిస్తూ—

"మురళిబాబూ! నా ఈ ముత్యాలపల్లకిని ఇంకా ఎన్నాళ్ళు [illegible] ఎవరింక కట్టిరేము బాబూ! త్వరగా పెళ్ళి చేసేసుకోవాలి మరి." అంటూ నవ్వి "చిన్ని కృష్ణా నిదురపో" అంటూ గొంతెత్తి పాడుతోంది యశోదమ్మ. యశోదమ్మ పాటకి ఆ నిశ్శబ్ద ప్రకృతి పరవశించి పోతోందా అన్నట్లుంది. మురళి లేచి యశోద ఒడిలో తల పెట్టుకుని క్రిందనే పడుకున్నాడు. ఎక్కడా దొరకనంత హాయి విలువకట్టలేనంత తృప్తితో మురళి మనసు నిండిపోయింది. 'యశోదమ్మా' అంటూనే 'నన్ను కదల్చవద్దు.... నేను నిద్రపోతున్నాను' అంటూ ఆపాట వింటూ

వత్తిగిలి పడుకున్నాడు. అలా అలా నిద్రపట్టేసింది. ఆ నిద్రలో అందమైన కల. ముత్యాలపల్లకీలో తను పెళ్ళికొడుకుగా నీరజ పెళ్ళికూతురుగా ఊరేగింపు సాగిపోతోంది. సన్నాయి పాట చెవులకి ఇంపుగా వినిపిస్తోంది. తాను [illegible] జరీ అంచు ఉత్తరీయం భుజాన వేసుకుని ఊరేగింపులో ముందు నడుస్తున్నాడు. అలా సుఖ స్వప్నంలో తేలుతున్న మురళికి అప్పటికే యశోదమ్మ లేచి వాకిట్లో రంగవల్లులు దిద్ది పాలు పితుకుతూ "తెల్లవార వచ్చె తెలియక నా స్వామి మళ్ళీ పడుకున్నావు లేరా" అంటూ పాడుతోంటేగాని మెలకువ రాలేదు.

లేచి ముఖం కడుక్కున్న మురళికి కాఫీగ్లాసు అందించింది యశోదమ్మ. అది తాగి ఖాళీ గ్లాసు అందిస్తూ పల్లకీ దగ్గరకి వెళ్ళి దానిని మూసివుంచిన బట్ట తొలగించి ఒక్కసారి చూసుకున్నాడు. పల్లకీ యెన్నో సంవత్సరాల క్రిందటిదే అయినా చిత్తరంగు మాయలేదు. మురళి చెయ్యి అప్రయత్నంగా [illegible] దెబ్బతగిలి ముఖం మీద నిల్చిన మచ్చ మీదకి పోయింది. తిరిగి భద్రంగా కప్పేసి ఇవతలకి వచ్చేసి 'వెళ్ళొస్తా యశోదమ్మా' అంటూ చెప్పి బస్తీకి వస్తూంటే ఆ వీధి చివరిదాకా వెంటవచ్చి ఇంక ఆగిపోయింది యశోదమ్మ. బస్తీకి వచ్చేశాడు. సామాను సర్దేశాడు. ఇందిరకి ధైర్యం చెప్పి మరునాటి రోజు ప్రయాణమై ఊరుకి వెళ్ళటానికి రైల్వే స్టేషనుకి వచ్చాడు. వెంట తాతగారూ, చెల్లెలూ, తండ్రీ వచ్చారు. సునందకూడా స్టేషనుకి వచ్చింది. అందరూ యేదో

గందరగోళంగా మాట్లాడుతున్నారు. అన్నపూర్ణమ్మ కొడుక్కి యెన్నో జాగ్రత్తలు చెప్తోంది.

# 31

అనూరాధ వికృతముఖం వేసుకుని చూస్తోంది. సునంద "ట్రైనింగ్ అయి తిరిగి వచ్చే రోజుకూడా నేనే రిసీవ్ చేసుకుంటాను మురళీ" అంది నవ్వుతూ.

"చిత్తం తమరి దయ. మరి వంటరిగానా జంటగానా వచ్చేది నువ్వు" జోక్ చేశాడు మురళి. సునంద జవాబు చెప్పలేదు. రైలుకి టైము అయింది. తాతగారు స్వయంగా మనవడిని రైలెక్కించారు. రైలు కదలబోతూంటే మురళి అందరిదగ్గరా శలవు తీసుకుంటూ తను కావాలనుకున్నవాళ్ళు యెదురుచూసే వాళ్ళు రాలేదని ఆఖరుసారి ప్లాట్‌ఫారం వైపు చూశాడు. దూరంగా నీరజ తాతగారి చెయ్యి పట్టుకుని ప్లాట్‌ఫారంమీద రైలుపెట్టెలు వెతుక్కుంటూ వస్తోంది కాని అప్పటికే కొన్ని పెట్టెలు ప్లాట్‌ఫారం దాటిపోయాయి. అయితే మురళి ముఖం వికసించింది. మాట్లాడటానికి వీలులేకపోయినా నీరజ వచ్చింది అన్న ఊహ కొంత ప్రశాంతిని ఇచ్చింది. రైలుకిటికీ పట్టుకుని వంగి నీరజకి చెయ్యి వూపుతున్నాడేకాని ఆమె చూడలేదు ఇటువైపు....

"హుష్...." అంటూ లోపలికి వచ్చి పెట్టెమీద కూలబడ్డాడు. మరో కొత్త ప్రపంచంలోకి అడుగిడుతున్నాను.

జీవితం ఓ పెద్ద మలుపు తిరిగింది ఈ రోజుతో. ఇంక తీరు బాటు అంటూ వుండదు.... అనుకుంటూ వెళ్ళబోయే కొత్త ప్రదేశం ఎక్కడ అని పోయే ట్రైనింగ్ అవన్నీ ఆలోచిస్తూ కూర్చున్నాడు మురళి. రైలు మాత్రం వేగంగా ఫస్ ఫస్‌మని శబ్దంచేస్తూ వెళ్ళిపోతూనే వుంది.

# 32

మురళి అందరికీ ఉత్తరాలు రాశాడు. సునందకీ, ఇందిరకీ, తల్లిదండ్రులకీ, చెల్లెలికీ. అనూరాధకి ఉత్తరం రాస్తూ సిరజ నా అడ్రెస్ కావాలని అడిగితే ఇవ్వు అని మాత్రమే రాశాడు. అందరి దగ్గరినుంచీ జవాబులు వచ్చాయి. అన్నింటికంటే ముందు వచ్చిన ఉత్తరం తాతగారు రాసింది. 'నువ్వు మెప్పుడు తిరిగివస్తావు!' అని రోజులూ, వారాలూ, నెలలూ లెక్కపెట్టుకుంటున్నాం అంటూ రాశాడు.

మురళికి ఇక్కడ రోజులు మహావేగంగా గడిచిపోతున్నట్లుంది. అప్పుడే రెండునెలలు అయిపోయింది. అనూ ఉత్తరం రాసింది. ఏం చదువుతుందంటూ పైన పూరుపేరు చూశాడు. జంషెడ్‌పూర్ అనిపించింది. అరె.... ఇదేంటి అనుకుంటూ ఉత్తరం పూర్తిగా చదివేస్తున్నాడు.

అన్నయ్యా!

నమస్కారం. ఇందిర క్షేమం. మీ గిరిధర్ బావకూడా క్షేమం. నేను ఇక్కడికి వచ్చి నాలుగురోజులైంది. నేను రాలేదు. బావే మనహారి వచ్చి నాన్నగారికీ, అమ్మకీ చెప్పి తన తల్లిదండ్రుల ఆమోదంపొంది నన్నిక్కడికి తీసుకు వచ్చారు. బావ ఇలా మారటానికి కారణం ఇందిర. ఇందిర ఇప్పుడు చాలా మారిపోయిందన్నయ్యా. ఎన్ని విషయాలని రాయను. నువ్వు వచ్చేప్పటికి నేను మళ్ళీ మనహారు వస్తాను. నా సంసారం చాలా ఆనందంగా గడిచిపోతోంది. ఇంక ఇందిర పెళ్ళి ఇప్పట్లో చేసుకోననీ యేదైనా వుద్యోగం కావాలనీ అంది. వాళ్ళ అన్నగారు ప్రయత్నిస్తున్నారు. త్వరలోనే దొరకవచ్చు. అన్నట్లు మరో విచిత్రం జరిగింది. అత్తయ్యా, మామయ్యా సునందని తీసుకుని చుట్టాలింటికి పెళ్ళికి వెళ్ళారీ మధ్య. ఆ పెళ్ళిలో ఓ లెక్చరర్ సునందని చూసి పెళ్ళిచేసుకుంటానని రాయబారం పంపాడు. అతనికి ఆస్తి వుంది. అంతస్తు వుంది. కానీ రెండో పెళ్ళి. మొదటి భార్య 'డెలివరీ' కష్టమైపోయిందట బిడ్డతో సహా. ఆయనకి కళ్ళు కనపడని వృద్ధురాలైన తల్లి తప్ప మరెవ్వరూ లేరట. ఆమెను సునంద జాగ్రత్తగా చూస్తుందని ఈ పెళ్ళికి వప్పుకున్నాడుట. సునందకూడా అంగీకారం తెల్పిందనే అన్నారు బావ. అంటే త్వరలో సునంద గృహిణి అవుతుందన్నమాట. సునంద మా కందరికంటే నీకు ఆత్మీయురాలని

అందరికీ తెల్సు. నువ్వూ పెళ్ళికి రాలేకపోయినా మంచి ప్రెజంటేషను పంపు. దాన్ని నేను స్వయంగా అందిస్తాను. గుర్తు ఉంటుందిగా. ఇంక అమ్మకీ నాన్నారికీ నేను అత్త వారింటికి వచ్చేస్తున్నానని ఒకవైపు సంతోషం మరోవైపు వదిలి ఉండలేక బాధా. అమ్మ నే వచ్చేస్తానన్న రోజున అసలు అన్నం తిననే లేదు. నాన్నారు లోపల బాధగావున్నా పైకి గంభీరంగా ఉన్నారు. తాతయ్య కన్నీళ్ళు ఆపుకోలేక నాదగ్గరికొచ్చి చెయ్యి తీసుకుని ముద్దుపెట్టుకుని బావని పిల్చి ఆయన చేతిలో పెట్టి "ఒరే గిరీ రత్నాన్ని ఇచ్చాం ... జాగ్రత్తగా చూసుకో" అంటూంటే ఆయన నోట్లోంచి మాట రాలేదు. బావకి ఇప్పుడు నీమీద గాని, తాతయ్యమీద గాని అసలు పిసరంతయినా కోపం లేదు.

నాకారోజు నువ్వు లేనిలోటు బాగా తెల్సిందన్నయ్యా. కానీ తప్పదుగా. నీ ట్రైనింగ్ యెప్పుడవుతుందా అని అందరం యెదురు చూస్తున్నాం. ఇంక వుంటాను జవాబు రాస్తావుకదూ!

చెల్లాయి

అనూరాధ.

మురళి మనస్సు సంతోషంతో గంతులేస్తోంది. అమ్మయ్య.... అనూకి ఇంక మరేం ఫర్వాలేదు.... అనుకున్నాడు. కొన్ని కొన్ని మార్పులు ఇలాగే గమ్మత్తుగా ఒకటి తర్వాత ఒకటి ఇలా జరుగుతూ వస్తాయి అనుకుంటూ ఉంటాడి

రాసిన ఉత్తరంకూడా చదువుతున్నారు. అసలా రాసిన విషయాలే అయినా రాశారు. అందరి దగ్గిరనుంచీ ఉత్తరాలు వస్తున్నాయి. రాసి తను ఎదురుచూసే ఉత్తరం అసలు రావటంలేదు. నీరజ ఉత్తరంకోసం ఎదురుచూసి చూసి విసుగెత్తిపోతూంది. చదువు కున్న అమ్మాయి అయినా చాలాకూడా ఆలోచనలేదు. బుద్ధి అసలు లేనట్టుంది. యింతలో నేను తన ఉత్తరంకోసం ఎంతగా ఎదురు చూస్తూ వుంటానో ఆ మాత్రం అర్థంచేసుకోలేదూ! ఛీ! తనమీద తనకే విసుగొస్తోంది అప్పుడప్పుడూ. నీరజమీద కోపం రోజురోజుకీ పెరిగిపోతోంది. ఆ కోపంలో మరీ వేగంగా గడుస్తున్నాయి రోజులు. నన్ను సరిగానే అర్థం చేసుకో లేదేమిటా! ఆ రోజు అలా మాట్లాడినా చిరాకు అయినా యథార్థం తెలియదా! చలపతిరావుగారు ఈ మధ్య రెండు ఉత్త రాలు రాశారు. [illegible] తర చుగా కలుసుకుంటున్నామని [illegible]. [illegible] చదువుతున్నాను. మురళీధరం [illegible] 'ఫెన' మాత్రం నేర్పను. అదిగనక నేర్చుకున్నావా పల్లెలో యింటిని మర్చి పోయి ఈ ఫెన్ దగ్గరే కూర్చుంటావని.... నవ్వుకుంటూ అన్నట్లు నీరజ రాగానే మంచి. ఇలా ఉంటుంది ఆయన ఉత్తరం.

నీరజ రాయటమన్నా చలపతిరావుగారి ఉత్తరాలలోనైనా కాస్త శాంతిపడుతోంది మురళి మనస్సు. తనుపోసే ప్రత్యుత్తరం రాద్దామని అనుకున్నాడు. కానీ అభిమానం అడ్డు వచ్చింది.

పట్టుదల పెరిగింది. అంతే అక్కడ సరజా ఇక్కడ మురళీ భీష్మించుకు కూర్చున్నారు. కాలచక్రం గిరగిరా తిరిగి పోతోంది.

# 33

నారాయణరావుగారి యిల్లు చాలా రోజులకి మళ్ళీ కల కలలాడుతోంది. కూతురూ అల్లుడూ వచ్చారు. మురళి పెళ్ళి లగ్నం పెట్టేసుకున్నాడు. రెండురోజులేవుంది. పెళ్ళి ప్రయత్నా లన్నీ చాలావరకూ పూర్తి చేయించేసింది అన్నపూర్ణమ్మ. చల పతిరావుగారూ ఆర్భాటంగా పెళ్ళి యేర్పాట్లు చేశాడు. యింక ఈ రోజే మురళి ప్రొబేషను పూర్తి అయి వచ్చేస్తున్నాడు. రైల్వే స్టేషనుకి వెళ్ళాలని అందరూ సరదాపడుతూండగా మురళి దగ్గరి నుంచి టెలిగ్రాం వచ్చింది. "నేను రైల్లో రావటంలేదు. ఓ ఫ్రెండ్ కారులో వస్తున్నాను" అని. అప్పటికే కొందరు చుట్టాలు వచ్చేశారు. సెలవు రాతయ్యకూడా వచ్చి లేను నాటిక పెట్లు యింటి పెద్దవెనాయా ఒకసారి చూసుకుని చుట్టాలని పేరు పేరునా పిల్చి చూపించి మరీ పెళ్ళి పనుల్లో జొరబడ్డాడు. వాకిలిముందు పందిరి వేయించేసెయ్యాలి అని నారాయణరావుకి గట్టిగా చెప్పేశాడు "షామియానా తెప్పిస్తాను" అంటుంటే దశరథరామయ్యగారు.

"నారాయణా పందిరి వేయించరా! అందంగా ఉంటుంది. మామిడాకుల తోరణాలూ అవీ ఈ తాతయ్య చూస్తాడులే" అంటుండగానే వాకిట్లో కారు ఆగిన శబ్దమైంది. మురళి వచ్చాడు. అంటూండగానే గిరిధర్ పరుగున వచ్చాడు బయటికి. సునందా, ఇందిరా, అనూ, పిల్లల తాతయ్యా అందరూ వస్తూ ముసలయిన నారాయణరావునీ అన్నపూర్ణమ్మనీ, వెనక్కి నెట్టేస్తున్నారు. రాజేశ్వరమ్మ కూడా బిందె అంత చెంబుతో నీళ్ళు తెచ్చింది. వాకిట్లోకి మేనల్లుడి కాళ్ళు కడిగేందుకు.

నల్లగా నిగనిగలాడుతున్న అంబాసిడర్ కారు ఆగి ఉంది. స్టీరింగ్ ముందు ముప్ఫయి సంవత్సరాలలోపు అందమైన యువకుడు కూర్చుని గుంపులా వచ్చిన అందరినీ చూస్తూ మొహమాటంగా తల తిప్పాడు. వెనక డోర్ తెరుచుకుని మురళి కారు దిగాడు. లోపలినుంచి మరో స్త్రీని చెయ్యి అందించి దింపుతూంటే అందరూ విస్తుపోయి చూస్తున్నారు. కంచిపట్టు జరీచీర కట్టుకుని తెల్లగా నెరిసిపోయిన జుట్టును వేసుముడి వేసుకుని పమిట భుజంనిండుగా కప్పుకుని మురళి చెయ్యి ఆసరాతో క్రిందికి దిగింది యాభై సంవత్సరాలు పైబడ్డ స్త్రీమూర్తి. నుదుట పదిపైసలంత కుంకుమ ఉదయించే సూర్యబింబంలా ఉంది. నల్లటి ముఖం అయినా ఆ కళ్ళలో ఏదో మెరుపులో కూడిన నిర్మలత్వం చూసేవాళ్ళని క్షణం నిలబెడుతోంది. పేలి

ముడిలోనించి పెద్ద మందార పువ్వు కొద్దిగా క్రిందకి జారుతోంది. అందరికంటే ముందున్న దశరథరామయ్యగారు తెల్లబోయి మసపడి దగ్గరకి రాబోయినవాడల్లా ఆగి 'యశోదా' అన్నారు మెల్లగా.

"ఏ యశోదా!" అంటూ కుతూహలంగా చూస్తున్నారు.

"అవును తాతయ్యా! ఈమె యశోదమ్మ. నేను వెళ్ళి తీసుకొచ్చాను. నీ అనుమతి లేకుండా తీసుకొచ్చినందుకు క్షమించు తాతయ్యా."

అంటూన్న మురళిని అమాంతంగా గట్టిగా కౌగలించేసుకున్నారు దశరథరామయ్యగారు. ఆయన ఆలింగనంలో క్షణం సర్వం మరిచి పసివాడిలా అయిపోయాడు మురళి. తాతయ్యా ఈ రోజుకోసం నీవెన్నాళ్ళుగానో కలలు కంటున్నావు. ఒక విధంగా నేనుకూడా అంటూ తల్లిదండ్రుల కోసం చూశాడు. 'అమ్మా' అంటూ అందరినీ తప్పించుకు తల్లిదగ్గరకి వచ్చి కాళ్ళకి నమస్కరిస్తున్న కొడుకుని అక్కున చేర్చుకుంది అన్నపూర్ణమ్మ. ఆమె కళ్ళల్లో ఒక విధమైన తృప్తి దానితోపాటు యేదో గర్వంకూడా కన్పిస్తోంది. 'అన్నయ్యా' అంటూ అనూరాధ దగ్గరకొచ్చింది.

"అమ్మా! అనూ! బలాసాగా వున్నావమ్మా" అంటూ "బాపగారెక్కడ" కళ్ళతోనే గిరిధర్‌కోసం వెతికాడు. గిరిధర్ అందుకే చూస్తున్నట్లు దగ్గరకి వచ్చి మురళి చెయ్యి గట్టిగా పట్టు

కుని "కంగ్రాచ్యులేషన్స్ మురళీ" అంటూన్న అతని గొంతు చాలా మృదువుగా పల్కింది.

"అరే గిరీ! ఆ మాట చెప్పవల్సింది ముందు నాకు" దశరథరామయ్య మనవళ్ళిద్దరినీ చెరోవైపూ నిలబెట్టుకుని. ఒరే నారాయణా, ఒసే రాజేశ్వరీ యిప్పుడు నేనెలావున్నాను" అంటూ ఆ యిద్దరి భుజాలమీదా చేతులువేసి నిల్చున్నారు.

"చిన్నాన్నా! నిన్ను చూడటానికి రెండు కళ్ళు చాలటం లేదు. ఒకవిధంగా చెప్పాలంటే ఈ చలపంతా నీదే" అంది తృప్తిగా రాజేశ్వరమ్మ.

నారాయణరావు కొడుకు నమస్కరిస్తుంటే "ఇప్పుడివన్నీ యెందుకునాన్నా! రేపెలాగూ పెళ్ళికూతురితోసహా యెన్నో నమస్కారాలు చేయాలిగా!"

"అన్నయ్యా! మా అందరిని చూస్తూ అసలు ఆ కారులో స్టీరింగుముందు కూర్చున్న నీ ఫ్రెండ్‌ని మర్చిపోయావు. లోపలికి తీసుకురా అన్నయ్యా. ముందు [illegible] అది చూస్తాను" అని అనూరాధ హెచ్చరించేవరకూ గుర్తురాలేదు మురళికి.

"అరె.... మోహన్! సారీ. రా లోపలికి" అంటూ తీసుకొచ్చి ముందు తల్లిదండ్రులకీ తాతగారికీ [illegible] పరిచయం చేశాడు. అనూనీ గిరిధర్‌నీ ప్రత్యేకంగా పరిచయంచేసి.

"ఇంతకీ పదిరోజులు ఆర్భాటం చేస్తున్నాడా చలపతిరావు గారు" అంది ఉసూరాష.

త్వరగా భోజనాలు కావాలని కేకలు పెట్టటంతో అందరూ లేచారు. మురళి భోజనంచేస్తూ లేని ప్రక్క కూర్చున్న సునందని పరీక్షగా చూసి నవ్వుతూ "అబ్బ ఈ ఆడవాళ్ళు ఎంత త్వరగా మారిపోతారు. నువ్వు పక్కా గృహిణివి అయి పోయావు. కానీ మీ శ్రీవారు రాలేదేం?" అన్నాడు.

"ఏ పెళ్ళి లగ్నం టైముకి సరిగ్గా వచ్చేస్తారు" అంది సునంద అలా అంటూంటే యేమిటోగా వుంది. అది గ్రహించి కిసుక్కున నవ్వి-

"మురళీ! నన్నేం చూస్తావుగానీ నీరజ సంగతి చెప్తాను విను నీకు వాళ్ళ తాతగారు కొనే మాటు బట్టలన్నీ తనే స్వయంగా యెన్నిక చేసింది. ఆ అమ్మాయికి మా అన్నయ్యా హాస సాయపడాడనుకో. ఏమైనా చెప్పు. నీ సెలక్షన్ అమోఘం నీరజ చాలా తెలివైనది."

"ఆ ...అలాగా" అన్నాడు.

"యింకా చాలా చాలా చెప్పాలి. కానీ టైములేదు యిప్పుడు. అదిగో చూడు నీ చెల్లాయి అనూ ఇంతమందికి ఎలా చకచకా వడ్డించేస్తుందో! మరో శుభవార్త చెప్పనా. అనూ త్వరలోనే నీకు ఓ బుల్లి మేనల్లుడినో మేనకోడలినో మరి ఇవ్వ బోతోంది.

"ఓ....నిజంగా" ఆ క్షణంలో యెందుకో సంతోషమైంది మురళికి.

భోజనాలు పూర్తి అయిన తర్వాత తాతగారు ఒక్కరూ పడుకుని వున్నది చూసి మెల్లగా ఆయన దగ్గర కూర్చుని "తాతయ్యా! నన్ను సంప్రదించకుండా కనీసం ముందు ఉత్తరమన్నా రాయకుండా ఇంత త్వరలో యెందుకు లగ్నం పెట్టించావు?"

"ఓ.... అదా! అదీ.... ఎందుకు చేశానంటే, అసలు నన్నూ, చలపతినీ ఆ నీరజ నిలవనిచ్చిందటరా! లగ్నాలు పెట్టించే వరకూ నిద్రపోలేదు అంతా నీరజ పట్టుపటే."

"ఓహో! మరి వాపుడు నన్ను లేమూ!"

"వాపుడు పిన్ని ఇంకెక్కడుంది. అప్పుడే వెళ్ళగొట్టేసింది గా నీరజ" అంటూ ఆవలించి నిద్రకి వుపక్రమించారు విశ్వరఘరామయ్యగారు. మురళికి ఒకసారి నీరజని మాడాలన్పిస్తోంది. కానీ యెలా! వాళ్ళ ఇంటికెడితే బాగుండదేమో! అమ్మ రాగానే చెప్పింది. చెప్పకుండా వాళ్ళ ఇంటికి వెళ్ళేవురా చూసిన వాళ్ళు నవ్వుతారు అని. అందుకే ఆ విషయం వదిలేశాడు. గదిలో విశ్రాంతి తీసుకోమని చెప్పి వెళ్ళింది అనూరాధ. కానీ నిద్ర రావటంలేదు.

అలాగే గడిచిపోయింది ఆరోజు. మర్నాడు మురళిని పెళ్ళికొడుకుని చేశారు. అనూరాధ పసుపు పారాణి పెట్టింది. సునంద ముఖాన కుంకుమబొట్టూ, బుగ్గన చుక్క పెడుతూంటే

యశోదమ్మా వీరరాఘవరామయ్యా మురళిని చూసుకుంటూ 'పెళ్ళి కొడుకు కళ వచ్చింది' అనుకుంటున్నారు తృప్తిగా. గిరీశ్, మోహన్, మురళిని యేవో ఒకటి అని పరిహాసిస్తున్నారు.

వీరరాఘవరామయ్యగారు పట్టుబట్టారు. పెళ్ళి ఇక్కడైనా గృహప్రవేశం పల్లెలో జరిగి తీరాల్సిందే అని. కొత్త పెళ్ళి కూతుర్ని ముత్యాలపల్లకిలో ఊరేగిస్తూ ఇంటికి తీసుకువెళ్ళాలనీ ఇందుకు సన్నాహాలు అన్నీ అక్కడే చేసి వుంచాననీ.

"అలాగే చిన్నాన్నా!" అనక తప్పలేదు నారాయణ రావుగారికి. అన్నపూర్ణమ్మకి యిష్టం లేకున్నా పైకి 'సరే' అంది. యశోదమ్మ సంతోషం వర్ణనాతీతం. "ఇక్కడ మురళి పెళ్ళి లగ్నం కాగానే ముందు నే వెళ్ళి అక్కడ ప్రయత్నాలన్నీ చూస్తాను" అనుకుంది లోలోపల.

# 34

అనుకున్నట్టుగానే ఎంతో ఆర్భాటంగా చేశాడు చలపతి రావుగారు మనవరాలి పెళ్ళి. మురళి స్నేహితులు చాలామంది వచ్చి శుభాకాంక్షలు చెప్పారు. సునంద భర్త వచ్చేడు పెళ్ళికి. యింక వాళ్ళలో పల్లెకి వెళ్ళేవారు ఊరి పొలిమేరలోనే

గాస్లైట్లు ముత్యాలపల్లకీ బోయీలూ రెడీగా వున్నారు. దశరథరామయ్యగారు జరీ అంచు పుత్తరీయం కండువాలా మెడలో వేసుకుని చేతికర్ర పట్టుకుని మురళిని చెయ్యి అందించి ముత్యాల పల్లకీ దగ్గరికి తీసుకువెడుతూం  యశోదమ్మ
పట్టుకుంది.

మురళి, నీరజా ముత్యాలపల్లకీ ఎక్కారు. బోయీలు పల్లకీని లేవనెత్తారు. సన్నాయి శ్రావ్యంగా వాయిస్తున్నారు. వాళ్ళకంటే ముందు బ్యాండువాళ్ళు కొత్త హిందీ పాట హుషారుగా వాయిస్తున్నారు. మగవాళ్ళంతా పల్లకీ ముందు నడుస్తున్నారు. స్త్రీలు పల్లకీ వెనక కాలి నడకన బయలుదేరారు. దశరథరామయ్యగారు పల్లకీ దగ్గరకి వచ్చి ఒకసారి నీరజనీ, మురళినీ తదేకంగా చూసుకున్నారు. 'యశోదా' అంటుంటే 'ఇక్కడేవున్నా' అంది ప్రక్కనే నిలబడ్డ యశోదమ్మ.

"చూడు యశోదా! నీ కన్నుల కరువుతీరా చూసుకో! ఈ సంతోషం చూడాలని కలలుకన్నావుగా చూడు" అన్నారు సంతోషంతో. యశోద మురళి ముఖంకేసి చూసింది. నీరజని చూసింది. ఆ ముత్యాలపల్లకీకి ఉన్న ఆర్చీలు లైట్ల కాంతికి సన్నగా కదులుతూ తళతళా మెరుస్తున్నాయి. పల్లకీకే ఒక విధమయిన అందం వచ్చినట్లు అన్పిస్తోంది. మురళికి సిగ్గనిపిస్తోంది. అయినా పెదవి మునిపంటితో కొరుకుతూ తాతగారి ముఖంలోకి చూశాడు.

ఆయన గర్వంగా మీసం మెలేస్తూ చిరునవ్వు నవ్వుతూ పల్లకి ముందు ఊరేగింపుకి ముందుకెళ్ళి—

"యిదిగో ఈ ఊరేగింపు మెల్లగా సాగి నడివీధి దాటి గుడివీధి కెళ్లాలి. ముందు దైవదర్శనం. ఆ తర్వాత గృహ ప్రవేశం. తెల్సిందా, యింక వాయించండి మీ యిష్టమైన పాటలు అంటూ రీవిగా నడుస్తున్నారాయన. నారాయణరావూ, ప్రసాద రావూ, పిలకరావతయ్యా పగ్గెరా పగ్గెరా అంటా ఆయన వెంట ఉన్నారు.

ఈ ఊరేగింపు చూడటానికి ఆ ఊరు ఊరంతా పోగ యింది. "దశరథరామయ్యగారు మనవడిని కలెక్టర్ని చేయటమే కాదు ముత్యాలపల్లకీ యెక్కించారు. మాటంటేమాట ఆయనదే" అంటున్నారు కొందరు. ఆయనది సరే ఈ మురళివాడుకూడా రావుగారిమాట నిలబెట్టాలని మరి పట్టుదలగా కృషిచేసి ఆ మున లాయన కలలు పండించాడుగా యిది చెప్పుకోవల్సిన సంగతి అంటున్నారు మరికొందరు. బాజాబజంత్రీల మోతలో యెవరు యేం మాట్లాడుతున్నారో తెలియడంలేదు. యశోద పల్లకీ ప్రక్కనే నడుస్తోంది క్షణం గమ్మత్తయిన అనుభూతి కలిగింది. ఈ ముత్యాలపల్లకీలో ఊరేగేది తనూ దశరథరామయ్యగారూ అయినట్లు యేదో సిగ్గు ఆమెని ముంచేస్తోంది. ఆ అనుభూతి క్షణం మాత్రమే. అంతలోనే తేరుకుని 'ఛీ యేమిటిది' అను

కుంటూ పమిట కొంగుతో ముఖం గట్టిగా తుడుచుకుని పల్లకీతో బాటు నడుస్తోంది.

పల్లకీ యిటూ అటూ వూరుగుతున్నప్పుడు నీరజ భయంగా వెరుగ్గా మురళివైపు చూడబోయి మళ్ళీ కళ్ళు దించేస్తోంది. సిలం పట్టుచీరమీద పెద్దపెద్ద జరీ పువ్వులున్న అదే రంగు జాకెట్టు మెడలో కొ_ంగా కట్టిన పసుపుతాడులో వున్న మంగళసూత్రాలూ, చేతినిండుగా రంగురంగుల గాజులు నుదుట కల్యాణం బొట్టూ పెళ్ళికూతురిగా నీరజని యెంత చూసినా తనివి తీరటంలేదు మురళికి. కానీ తనని చుట్టూవున్నవాళ్ళు పరిశీలిస్తున్నది గ్రహించిన మురళి కళ్ళు తిప్పుకున్నాడు.

గ్యాస్‌లైట్ల కాంతిలో ముత్యాలపల్లకీకి ఉన్న జలతారు అర్చీలు మెల్లగా కదులుతూ తళతళా మెరుస్తూన్నాయి. మురళి పెదవిని మునిపంటితో నొక్కుతూ తాతగారికోసం చూశాడు. కానీ ఆయన మురళికి యెక్కడా కన్పిస్తారు. ఆ పల్లకీ ముందుగా సంతోషంతో మీసం మెలేస్తూ నడుస్తుంటే.

"ఊా మురళీధర్‌ని ప్రకాశం జిల్లాకి కలెక్టరుగా వేశారుటకదూ" అనుకుంటున్నారు కొందరు. సన్నాయీ, బ్యాండ్ వాయిద్యాల మోతలో ముత్యాలపల్లకీ ఠీవిగా ముందుకు సాగిపోతోంది.

—: స మా ప్తం :—